విశ్వకవి రవీంద్రుని

# విశ్వమానవ మతం

అనువాదం :

బొమ్మకంటి వేంకట సింగరాచార్య

కళ్యాణీ ప్రచురణలు

విశాఖపట్టణం - 3

First Edition 5,000 copies
February, 1960

# VISWA MANAVA MATHAM

*Abridged Version of*

## THE RELIGION OF MAN

by Ravindranath Tagore

*Telugu translation by*

B. V. Singaracharya



---

Published under the auspices of
The Southern Languages Book Trust

---

TELUGU 50

Price **Rs. 1-60 nP.**

Publishers :

KALYANI PRACHURANALU

*Visakhapatnam*—8

**Printed at Pattabhirama Press, Eluru.**

# పరిచయము

ప్రజాసామాన్యానికి ఆకర్షకంగా, విశేషోపయోగకరంగా ఉండే పుస్తకాల ప్రచురణకు దోహదం చెయ్యాలనే సంకల్పంతో దక్షిణభారత పుస్తక సంస్థ లోగడ కొన్ని పుస్తకాలను ప్రచురింపజేసింది. ఆ ప్రచురణల వలన కలిగిన అనుభవంతో ఇప్పుడు మరికొన్ని పుస్తకాలను వివిధ ద్రావిడ భాషలలోనికి అనువాదం చేయించి ప్రచురింప జేస్తోంది. పాఠకులలో భిన్న భిన్న అభిరుచులకు తగినట్లు ఈ పుస్తకాలను శ్రద్ధగా ఎన్నికచేశారు. అందు వల్ల, మానవ జీవితానికి సంబంధించిన వివిధ విషయాలను గురించిన రచనలు ఇందులో ఉండటం సహజం. భారత మహానాయకుల జీవిత చరిత్రలు, వారు చేసిన ఘన కార్యాలు వివరించే గ్రంథాలు ఈ ద్వితీయ గ్రంథ పరంపరలో ఒక శాఖ. మన దేశ శ్రేయస్సుకోసం, అభ్యుదయం కోసం ఆ మహా పురుషులు ఏమిచేసినది, వారికి తామెంత ఋణపడిఉన్నది, ప్రజలకు ముఖ్యావశ్యకములైన హక్కులను సంపాదించడానికి వారెన్నెన్ని పాట్లు పడినది ముందు తరాల వారంతా తెలుసుకుని ఉండటం అవసరం.

తత్త్వశాస్త్రం, మతం, విజ్ఞాన శాస్త్రం, సాహిత్యం – ఈ గ్రంథ పరంపరలోని ఇతర శాఖలు. కథానికలు, ప్రాచీన కళా సంపదలను అభి వర్ణించే గ్రంథాలు కూడా ఇందులో ఉండటం ముదావహం. నాటకకళ, శిల్పశాస్త్రం, పురావస్తు పరిశోధనలు, నిరతాద్భుతావహములైన దాక్షి ణాత్య దేవాలయాలను గురించిన గ్రంథాలు ఈ పరంపరలో ఉన్నవి. విజ్ఞాన వికాస దాయకములైన భిన్నభిన్న విషయాలను గురించిన ఈ గ్రంథాలు ప్రజలను విశేషంగా ఆకర్షింపగలవని, ఆ విధంగా ఇట్టి ప్రచు రణలకు ముందుముందు విస్తార ప్రచారం కలుగగలదని నా విశ్వాసం.

దక్షిణ భారత భాషలలోని ఉత్తమ గ్రంథాలు కొన్నింటిని మిగిలిన దాక్షిణాత్య భాషలలోకిఅనువదింపజేయటం ఈద్వితీయగ్రంథపరంపరలోని మరొక ప్రశంసనీయమైన విశేషం. ఈ పుస్తకాలన్నీ పూర్తిగా వెలువడి నప్పుడు విద్యావంతులలో ఎక్కువమందిని వివిధవిషయాలను గురించిన జ్ఞానాసక్తి గల పాఠకులుగా ఆకర్షించి, ఆ జ్ఞాన పిపాసను తృప్తిపరచ డానికి యోగ్యమైన గ్రంథాలనుకూడా వారికి అందజేసినట్లు అవుతుంది.

ఈ దక్షిణ భాషా పుస్తకసంస్థ ఆశయాలు శీఘ్రగతిని సఫలము కాగల వని ఆశిస్తున్నాను.

మద్రాసు,
7-10-1958.

ఇట్లు,
ఏ. లక్ష్మణస్వామి మొదలియార్,
వైస్ ఛాన్సెలర్,
మద్రాసు విశ్వవిద్యాలయం.

# భూమిక

రవీంద్రనాథుని భారతీయులకు కొత్తగా పరిచయం చేయవలసిన పని లేదు. మనజాతీయ మహాకవులలో ఆయన అగ్రగణ్యుడు. ఇతర భాషల లోని కవులెందరో విశ్వకవి రచనలవలన ఉత్తేజం పొందారు. ఆయన అడుగుజాడలను అనుసరిస్తున్న కవులు ఇప్పటికీ చాలామంది ఉన్నారు. రవీంద్రుడు, మహాకవిగానే ప్రసిద్ధుడై విశ్వగౌరవపట్టమైన నోబెల్ పురస్కారం పొందినప్పటికీ, పవిత్రసారస్వత ప్రపంచంలో ఉత్తమోత్తమమైన వైదిక వాఙ్మయానికి శిఖరాయమానమైన ఉపనిషద్వాణియే ఆయన కవితావాహినికి మూలం అన్న సంగతి మనం మరచిపోకూడదు. ఆయన మతానికి 'విశ్వమానవమతం'అని ఆయన చేసిన నామకరణం. కవిగా ఆయన పొందిన ప్రగాఢ అపరోక్షానుభూతులే ఆయన మతంలో అభివ్యక్తమైనవి. ఉత్తమ కళకు అవిదితమైన ఏదో మతతత్త్వం విధిగా ప్రాతిపదిక అయి ఉంటుందని ఇటీవల గుర్తిస్తున్నారు. ఈ విషయం గ్రహించడం వల్లనే సర్గాత్మక కళలలో శాశ్వతత్వాన్ని గుర్తించడానికిఅవకాశం ఏర్పడింది. రవీంద్రుని కవితాసంపత్తికి, మనోహరసృష్టికి ప్రాతిపదికఅయిన మత సిద్ధాంతాలను ఆయనే స్వయంగా మనకు వివరించడం మన అదృష్టం. ఆయనకు సాక్షాత్కరించిన సత్యస్వరూపం ఆయన కవితాప్రతిభకు, ఆయన సౌందర్యారాధనకు ఫలితం. ప్రకృతి పరిణామక్రమంలో జీవి స్వరూప స్థౌల్యంనుండి స్వభావౌచితి వంకకు వరుసగా పురోగమించిన ప్రక్రియకు ఆయన వివరించిన తాత్త్విక పరమార్థం మానవపరిణామానికి మనోహరమైన వ్యాఖ్యానం. గాఢమైన, శాశ్వతమైన విలువలు ఎలా పెంపొంది, వికసించినదీ కూడా ఆయన చక్కగా వివరించారు. మానవుడే, వేదములోని పురుష సూక్తములో అభివర్ణింపబడిన పురుషుడే, లేక భగవద్గీతా ప్రతిపాద్యుడైన పురుషోత్తముడే జీవితమనే ఈ సర్గాత్మక కలాపానికి పరమార్థం. శాంతం, శివం, సుందరము అయిన ఆ పురుషుని దివ్యలీలనే ఈ సృష్టిలో సర్వం సూచిస్తుంది. రవీంద్రుడు విశ్వంలోని సర్వవస్తువులను ఆ భగవానుని సౌందర్య వ్యంజకములుగా, ఆయన అద్భుతలీలలుగా సందర్శించాడు.

కర్మవలన, జ్ఞానంవలన భగవంతుని అర్థంచేసుకొనవచ్చు, ఆరాధించవచ్చు. అయితే, సర్వవస్తువులలోగల ఆ రహస్సౌందర్యసీమలోనికి ప్రవేశంమాత్రం ప్రేమద్వారానే లభిస్తుంది.

ప్రకృతి, మానవుడు ఆ పరమపురుషుని శరీరాలు. సర్వవస్తువుల లోను గల విశిష్టతే అతడు. అది అనిర్వచనీయం. ఆ విశిష్టతే సర్వవస్తువులను ఆ పరిపూర్ణ వ్యక్తిత్వ వికాసం వంకకు, లేక ఆ దివ్య సౌందర్యముయొక్క సర్గాత్మక పరిపక్వత దిక్కుగా నడిపిస్తున్నది. సౌందర్యం పరమసత్యము యొక్క సర్గాత్మక వికసనం. సత్యం అవ్యక్తికం కాదు, నిర్గుణమూ కాదు. సత్యానికీ వ్యక్తికీ అనుబంధం ఉన్నది. మానవులతో బాంధవ్యం పెట్టు కొనగల శక్తి సత్యానికి ఉన్నది. ఈ విషయంలో మానవులందరినీ మించిన శక్తి దానికి ఉంది. సౌందర్యం ముక్తిహేతువు. ఇది అచ్చమైనకవి చెప్పే వేదాంతం; ఇదే శాశ్వతమైన సిద్ధాంతం. "సన్యాసిపథం నాకుసరిపడదు," అని రవీంద్రుడు ఒకచోట స్పష్టంగా వ్రాశాడు. భగవంతుని విశ్వం సహజ సుందరమైనదని అంగీకరించడంలోను, ఆయన తనకు ప్రసాదించిన విశిష్ట దృష్టితో సర్వవస్తువులలోను సౌందర్యమయుడైన ఆ పరమాత్మను సందర్శించడంలోనూ రవీంద్రుడు ఆ ఆనందానుభూతిపొంది, భారతీయ మహా కవిగా, సర్వప్రవణుడైన విద్యావేత్తగా, సర్వశస్తుమయ జగత్తునూ దివ్య సౌందర్యరాశిగా దర్శించగల ఆత్మవిమోచన ప్రవక్తగా రూపొందాడు.

రవీంద్రుని రచనలను ఏమాత్రం చవిచూచినవారైనా, సాంద్రకోమికమైన ఆయన సత్య సౌందర్యాభిరుచికి వశులుకాకుండా తప్పించుకొన లేరు. అందువల్ల పాఠకుడు కూడా ఈ ప్రపంచంలోను, అనంతరమూ సర్వవస్తువులలోను సౌందర్యాన్వేషణకు ఉపక్రమించవచ్చు. కనుక, రవీంద్రనాథుడు రచించిన ఈ గ్రంథాన్ని దక్షిణభారతీయులకు పరిచయం చేసే అవకాశం నాకు కలగడం ఆనందదాయకమైన విషయం. ఈ పుస్తకం రవీంద్రుని రచనలను ఇతోధికంగా చదవాలనే ఆసక్తిని. పాఠకులలో కలిగించగలదని ఆశిస్తున్నాను.

తిరుపతి,
26-7-58.

కె. సి. వరదాచార్య.

అది అమర స్వప్నం-
అనాది కాంతి గరుత్తులపై
ఊరేగివచ్చి,
అవ్యక్తతా యవనికను త్రచ్చి
అసంఖ్యాక జీవరూప సృష్టిచేస్తూ,
అనంతకాలాన్ని
అధిచరిస్తూంది.

రహస్యం మౌనముద్రాంకితమే ఇంకా-
ఈ యాత్రా పరమార్థం
ఈ అనంతాస్తిత్వోద్యమం-
ఆకాశానికి అడ్డంగా ఎగిరి పోతూ
అగణిత వలయ పథాలుగా ఉజ్జ్వలిస్తూంది.

కడకు సాంధ్యకాంతిలో
అనంత మానవాత్మలో
జ్ఞానం ఉదయిస్తుంది
ఆ సంధ్యా మందరోచిలోన
ఆ మిహికాయవనిక నొత్తిగించి తొంగి
చూస్తుంది ఆమె మౌనంగా.
మోదవేదనా సంకుల మీ
జీవన ప్రేమల చిత్రం.

శాంతి నికేతనం,
సెప్టెంబరు 16, 1929.

# వ్యాసక్రమం

# ఈ గ్రంథ గాథ



నేను 1930 మే నెలలో ఆక్స్‌ఫర్డులో మాంచెస్టర్ కళాశాలలో చేసిన హిబ్బర్ట్ ఉపన్యాసాలు ఈ గ్రంథంలో వివిధ అధ్యాయాలుగా రూపొందింప బడినవి. ఆయా విషయాలపై నేను భిన్నభిన్న సమయాలలో చేసిన ఉపన్యాసాలలో వెలిబుచ్చిన అభిప్రాయాలన్నీ ఇందులో గ్రుచ్చి ఉన్నవి.

అన్నింట విషయం ఒక్కటే. అందువల్ల "మానవ మతం" నాలో తత్త్వ శాస్త్ర జ్ఞానంగా కాక, మతానుభూతిగా ప్రవృద్ధమవుతూ వచ్చినదని నేను ధ్రువపరుచుకొన గలిగాను. నిజానికి, అస్ఫుటయావనదశ మొదలు నేటి వరకు నేను చేసిన రచనలలో అత్యధికభాగం నా మతానుభూతి పరిణామ చరిత్రను సూచిస్తున్నవి. నేను ఉపక్రమించిన కార్యాలకన్న నేను పలికిన పలుకులకు గాఢమైన ఆవైశైక్యానుబంధం ఉన్నదని నేడు నాకు తెలివిడి అయింది. ఐతే, ఆ అనుబంధ స్వరూప నిరూపణం నాకే తరచు అగమ్యగోచరంగా ఉంటూ వచ్చింది.

ఈ గ్రంథంలో, నా వ్యక్తిగత జీవితమే ప్రత్యక్షసాక్ష్యంగా వివృతమయింది. నా పాఠకులలో కొందరికి ఇది మనస్తత్వ పరిశీలనకు తగిన విషయంగా ఉపయోగ పడ

వచ్చు; మిగిలిన వారందరికీ, మతం వంటి ముఖ్యవిషయానికి ముఖ్యంగా ఉండవలసిన ఆదర్శ ప్రయోజనాన్నే ఈ గ్రంథం అందించ గలదని ఆశిస్తున్నాను.

ఈ హిబ్బర్టు ఉపన్యాసాలు అసలు నేను 1928 లో ఇవ్వవలసింది. అప్పుడు అస్వస్థతవల్ల యూరపుకు ప్రయాణం చేయలేకపోయాను. ఆ విషయం నేను ఎన్నిసారులు వ్రాసినా, ఓరిమితో 1930 వేసవి వరకు ఈ ఉపన్యాస పరంపరను వాయిదా వేసినందుకు హిబ్బర్ట్ ధర్మకర్తలకు, ముఖ్యంగా డాక్టరు డబ్లియూ. హెచ్. డ్రమ్మండ్ కు నా ధన్యవాదాలు. ఆ ఉపన్యాస పరంపరాసారాన్ని విపులీకరించి, వివిధాధ్యాయాలుగా విభజించి, ఉపన్యాసశైలిని మార్చి గ్రథితం చేయడానికి నాకు అనుమతియిచ్చినందుకు కూడా ఆ ధర్మకర్తలకు నా అభివాదములు తెలుపవలసి ఉన్నది. ఆక్స్‌ఫర్డులో నాకు ఆతిథ్య మొసగిన గృహిణి శ్రీమతి డ్రమ్మండ్ విశేషాదరణాభిమానాలకు, ఈ ఉపన్యాసాలకూ సన్నిహితానుబంధం ఉండడంవలన అవినాకు చిరస్మరణీయములు.

రవీంద్ర నాథ ఠాకూర్.

సెప్టెంబరు 1930.

# విశ్వమానవ మతం

## ౧ మానవవిశ్వం

అది సృష్ట్యాది. కాంతిమంతమైన ఒకానొక స్వయం వ్యక్తశక్తి వికసించింది. అణుగర్భాకాశంలో విద్యుత్కణాల చక్రభ్రమణ నాట్యం ఆరబ్ధమయింది. నిరామయమైన ఆ అపారకాలావకాశరంగంలో అసంఖ్యాక తారకలు నర్తిస్తున్నవి. మహాగ్నిజ్వాలాకుండంలోంచి వెలువడిన గ్రహాలు యుగయుగాలుగా ఆ సూర్యశోభలో విహరిస్తున్నవి. ఆనాడు ఆ గ్రహాలు నిరాశ్రయమైన నీరవ మహాస్తబ్ధతకు సింహాపీఠికలు. లక్ష్యమెరుగని ఆ స్తబ్ధత-తన అప్రతిహత సామ్రాజ్యాధిపత్యాన్ని అంతమొందించటానికి పొంచి ఉన్న భవిష్యత్తుపై రూక్ష వీక్షాప్రసారం చేస్తూంది.

ఆ స్థితిలో సూక్ష్మమైన ఏకజీవకణ ప్రాణి విశ్వరంగస్థలంలో ప్రవేశించింది. స్వయంవర్ధన శీలము, దేశకాలానువర్తన నైపుణి గల ఆ ప్రాణి అప్రాణిజగత్తుయొక్క అపార గురుత్వ మహత్త్వాలను చూచి, ఆ నిరర్థకస్థూల్యాన్ని అపహసించింది. ఆ జీవిలో కలిగిన చైతన్యం పరిమాణ సంబంధి కాదు. అస్తిత్వ ప్రాధాన్యాన్ని గురించినది. నాటినుండి ఆ ప్రాధా

న్యాభివృద్ధి కొరకే కృషిచేస్తూ, ప్రకృతి శాసనానుసారం గానే, ప్రాకృతికమైన అలసత్వావరోధాలను అధిగమిస్తూ, సృష్టి నానాశాఖలలో అస్తిత్వ ప్రాధాన్యాన్ని కాపాడుతూ వచ్చింది.

సృష్టి అద్భుతావహాత ఇంతటితో - ఏకజీవకణ ప్రాణిని రూపొందించి అస్పష్టలక్ష్యాభిముఖమైన ఆ ఏకాంత యాత్రాపథంలో వదలటంతో - అంతమైపోలేదు. అట్టి అసంఖ్యాక జీవకణాలను సమీకరించి మరొక జీవిని కల్పించింది. ఈ చేర్పు గుడ్డికూర్పు కాదు. ఆ జీవకణాలమధ్య అద్భుతమైన పరస్పరసంబంధ బాంధవ్యాలు, పరిపూర్ణమైన సహకార సామరస్యాలు గల అద్భుతమేళనమది. ఇదే వివేచనకు అంతుపట్టని సమష్టి సృష్టిసూత్రం; అస్తితా పరమ రహస్యం. సర్వాంగ సంశోభితమైన సహకార సంస్థలను బోలిన యీ విలక్షణ ప్రాణులు అపూర్వ స్వయంవ్యక్తతకు తగిన ప్రయత్నాలు ప్రారంభించినవి. అందుకు సమర్థమైన నవీన ఉపకరణాలుగా తమ శరీరాలలో నూతనాంగాలను సంతరించుకొని, వృద్ధిచేసుకొనటం ఆరంభించినవి. ఇదే నిత్యనూతన జీవశక్తులను వ్యక్తంచేసే పరిణామ ప్రగతి.

అయితే భౌతికరూపాలలో సాగే ఈ పరిణామం పరిమితమైనది. దీనికి అనుచిత ప్రాముఖ్యం ఇవ్వటం జీవన పురోగమనానికి భంగకరమైన భారం అవుతుంది. కేవలం

శరీరం పెంచుకొనటంలోనే నిమగ్నమైన ప్రాణులు, ఆ అసందర్భ ప్రవృత్తే కారణంగా ఇంచుమించు పూర్తిగా అంతరించి పోయినవి.

ఆ అధ్యాయం పూర్తి అవటానికి పూర్వమే మానవుడు అవతరించి, ఈ పరిణామ ప్రగతిని అనిర్దిష్టమైన భౌతిక ప్రాభవపథం నుండి తప్పించి సూక్ష్మతర పూర్ణస్వాతంత్ర్యం వంకకు మళ్లించాడు. దీనివలన మానవుడు అపరిమితు డవటానికి చేసేకృషికి అవకాశం లభించింది. స్వశక్తియొక్క అసౌమ్యతను గ్రహించటానికి తగిన సామర్థ్యం అతనికి ప్రాప్తించింది.

కుంపటి రాజుకుంటుంది. సమ్మెటవేట్లు పడగా పడగా ఆధూమంలో, ధూళిలో అహోరాత్రశ్రమ ఫలితంగా గానవాద్యయంత్రం రూపొందుతుంది. మనం దీనిని పృథక్సంఘటనగా గ్రహించి, ఆ పరిణామ క్రమాన్ని పరిశీలించవచ్చు. కాని ఆ వాద్య యంత్రంనించి గానం వ్యక్తమయినప్పుడు, ఇదంతా దానికి సంబంధించని భిన్నకార్యంగా కనిపించినా, ఆ సంగీతావిర్భావంలో ఇదికూడా భాగమే అన్నసంగతి మనకు సుబోధ మవుతుంది. యుగయుగాంతర పరిణామ ఫలితంగా మానవుడు అవతరించాడు. నాటినుండి పరిణామ క్రమం నూతన శోభతో క్రొత్తదారి త్రొక్కినా, అసలు పరిణామ క్రమాన్ని మానవ పరిణామ సహితంగా ఏకంగానే

మనం గ్రహించాలి. పరిణామక్రమం అవిచ్ఛిన్నమైన ప్రవాహం వంటిది. ఈ పరిణామ పరమార్థం మానవునిలో కనిపిస్తుంది. విజ్ఞానశాస్త్ర వేత్తలు చెప్పే పరిణామం మానవుని విశ్వానికి సంబంధించినది మాత్రమే అని ఒప్పుకోక తప్పదు. తోలు బైండింగు, అట్టా కూడా పుస్తకంలో భాగాలే. జ్ఞానేంద్రియాలద్వారా, మనస్సుద్వారా, జీవితానుభూతిద్వారా మనకు విదితమవుతూన్న జగత్తుకి, మనకూ గల ఏకత అలాంటిది.

ఈ ఏకతాదివ్యసూత్రం సర్వదా ఆంతరంగికమైన పరస్పర బాంధవ్యానికి సంబంధించినది. పరిణామ క్రమంలో భూమిపైన బహుజీవకణ ప్రాణులు రూపొందే దశారంభంలోనే ఈ విషయం వ్యక్తమయింది. మానవుడు అత్యంత పూర్ణమైన అంతర్దృష్టిని తన శరీరంలోనే సాధించాడు. అయితే, తన భౌతిక శరీరానికి, వెలుపల గల తన సూక్ష్మతర శరీరాన్నికూడా మానవుడు సాక్షాత్కరింప జేసుకొన్నాడనేది ముఖ్యాతి ముఖ్య విషయం. ఏకాంతంగా ఉన్నప్పుడు మానవుడు తనను తాను మరచిపోతాడు. మానవజగత్తుతో తనకుగల అనుబంధంలో అంతకన్న విస్తృతమైన, వాస్తవమైన స్వాత్మను దర్శిస్తాడు. బహుజీవకణమయమైన అతని శరీరానికి జననమరణాలు ఉన్నవి. అతని బహువ్యక్తిమయమైన మానవత అజరా

మరం. ఈ ఏకత్వాదర్శంలోనే అతడు తన జీవితంలో అనంతత్వాన్ని గ్రహిస్తాడు; తన ప్రేమలో అపారతను చూస్తాడు. ఈ ఏకత కేవలం వ్యక్తిగత భావంగా గాక, చైతన్యప్రదమైన మహాసత్యంగా భాసిస్తుంది. దానికి పేరు ఏదిపెట్టినా, అది ఏరూపానికి సంకేతం అయినా, ఈ ఏకతను గూర్చిన జ్ఞానం ఆధ్యాత్మికమైనది; దానియందలి ప్రతిపత్తే ముఖ్యం. అది మన చరిత్రలో ఇంకా పరిపూర్ణవికాసంపొంద వలసి ఉంది. మన నయనం ఈవిశాల భౌతిక విశ్వంతో మనకుగల అనుబంధం. మనలో మరొక నిగూఢశక్తికూడా ఉన్నది. మానవుడు పరమాత్మతో, ఆ విశ్వవ్యక్తిత్వంతో తనసంబంధాన్ని గ్రహించటానికి ఈశక్తి సహాయపడుతుంది. మన ఉజ్వల భావనే ఈశక్తి. ఉదాత్తస్థాయిలో ఇదే మానవుని విశిష్టత. శారీరకజీవనానికి సంబంధించిన సామాన్యావసరాలకు కేవలం అనవసరమైన ఆ పరిపూర్ణతాజ్ఞానమును ఈశక్తి మనకు కలుగజేయగలదు. మనలో ఆ పరిపూర్ణతా చైతన్యమును ఉద్బుద్ధం చేయటమే దాని ప్రయోజనం. ఆ పరిపూర్ణతా చైతన్యమే వాస్తవమైన ఆత్మామరత్వజ్ఞానం. నిజానికి పరిపూర్ణత అనేది ఆ అమరమానవునిలోనే సమగ్రంగా ఉండి, వ్యక్తులలో ఈ ఆదర్శంపట్ల అనురాగాన్ని ప్రేరేపిస్తూ, దానిని సాధించటానికి ఎప్పటికప్పుడు వారిలో ఉత్సాహం పురిగొల్పుతూ ఉంటుంది.

జీవనయాత్రకు అవసరమయిన వివేకము, భౌతిక బలము వృద్ధిచేసుకొనవలసిన ఆవశ్యకత జంతువులకు, మానవులకు సమంగానే ఉంది. జ్ఞానాన్ని వృద్ధిచేసుకొని, ఆ అమరత్వాన్ని, ఆ పరిపూర్ణత్వాన్ని, ఆ అపరిమితత్వాన్ని గూర్చిన చైతన్యాన్ని క్రమంగా గాఢతరం, విస్తృతం చేయగల జ్ఞానాన్ని వృద్ధిచేసుకొనగలగటమే మానవునకు గల విశిష్టశక్తి. ఈ చైతన్యమే మానవునిలోని దివ్యత్వాన్ని (అదే అతని మానవత్వం) అభివ్యక్తం చేయగల రచనలు చేయటానికి అతన్ని ప్రేరేపిస్తుంది. ఈదివ్యత అతనిలోని సత్యశౌచసౌందర్యాభివ్యక్తిలోను, ఆత్మవికాసం తప్ప స్వప్రయోజనమేమీలేని అతని చేష్టలలోను కూడా కనిపిస్తుంది. వ్యష్టి మానవుడు, ఆమహామానవునకు పరతంత్రుడై బ్రతుకుతూ శాస్త్రం, వేదాంతం, సాహిత్యం, కళలు, సేవ, ఆరాధనవంటి నిస్స్వార్థకర్మలలో ఆపరమాత్మను వ్యక్తం చేస్తాడు. ఇదే అతనిమతం. ఇదే భిన్నభిన్ననామాలతో వ్యవహరింపబడుతూన్న సర్వమతసారభూతమైన మూలభావం. మానవుడు ఈప్రపంచాన్ని, దాని అనంతత్వాన్ని గుర్తెరిగి, దానిని ఉపయోగించుకొని, ఆవిధంగా మహత్త్వాన్ని సాధిస్తాడు. అయితే అతడు తననుగురించిన సత్యాన్నికూడా పరిపూర్ణరూపంలో గ్రహించి, ఆవిధంగా అశయసిద్ధి పొందుతాడు.

భగవంతుని మానవత్వ నిరూపణమే లేక నిత్యమాన వునిలోని దేవాంశానిరూపణమే, దేవత్వభావనే ఈ గ్రంథా నికి ప్రధానవస్తువు.

ఈ భావన నాలో ఏదో వేదాంతతత్వ విచారణా ఫలితంగా ఉద్భవించినదికాదు; కేవలం తద్విరుద్ధంగా, బాల్యమాదిగా నాభావ వాహినిని అనుసరించివస్తూ, చివర కొకనాడు హఠాత్తుగా నాకు సాక్షాత్కరించినది. ముందు ముందు మరొక అధ్యాయంలో నేను వివరింపబోయే నా విల క్షణాను భూతివలన ఒకే అంశం ధ్రువపడింది. మన వ్యక్తి గతాత్మలకు సంబంధించిన క్షణిక పరిణామాలు మాత్రమే మన జీవనోపరిభాగాన గోచరమవుతవి. కాని లోపల మన ప్రత్యక్షజ్ఞానానికి అందని అనంతైక్య మానవాత్మ ఉన్నది. అది మన దైనందిన జీవితములోని అల్పత్వాలను తరచు నిరసిస్తూ ఉంటుంది. మన వైయక్తికాభ్యాసాలు, అవ్యక్తాభి ప్రాయాలు అనే గోడల మధ్య వ్యష్టివిశిష్టతకొరకు మనం చేసుకునే ఏర్పాటులను తారుమారుచేస్తుంది. విశ్వాత్మాభి వ్యక్తిపరములైన కర్మలకు మనను ప్రోత్సహిస్తుంది. స్వార్థ పరమైన జీవికకు మధ్యలో అనుకోకుండా అద్భుతమైన త్యాగశీలతను సంఘటిస్తుంది. మనలో సహజంగా ఉత్తమా దర్శాలపట్ల గౌరవం లేకపోయినా, దాని ప్రేరణవల్ల మనం జీవితాన్ని సత్యసౌందర్యాలకు నిస్స్వార్థమైన పరోపకృతికీ అంకితం చేస్తాం.

నా అనుభూతి ప్రథమదశ ప్రకృతితో నాసన్నిహిత సౌమనస్యం ద్వారా రూపొందినదని, నా ఆధ్యాత్మికానుభవాన్ని గురించిన ప్రకరణంలో నేను వివరించాను. నా సాన్నిహిత్యం - మనబుద్ధికి సమాచార పరంపరను అందజేస్తూ; మన సజీవ శరీరాలతో భౌతికానుబంధం గల ప్రకృతితో కాదు; మన జీవితాన్ని శోభామయంచేసి ఆరూపరంగశబ్దచాలనములతో మనభావనాశక్తిని ప్రజ్వలింపజేయగలదృశ్యాలతో మనవ్యక్తిత్వానికి సంతుష్టి కలిగించగల ప్రకృతితో శాస్త్రవేత్తకు తాను విశదంచేసిన సూత్రానుగుణంగానే తాను కేవలం కొన్ని ఆరూప సంకేతాలుగా ప్రీలి కరగిపోయే ప్రకృతితో కాదు; తన సత్య సంపదతో మన వ్యక్తిగతాత్మలకు దివ్యదర్శనమిచ్చి, మన మానవ స్వభావాన్ని సదాస్వప్రభావితంచేసే ప్రకృతితో.

నా వైయక్తికానుభవాన్ని వివరించే సందర్భంలో, వంగదేశ గ్రామ సీమలలో పాడుతూ తిరిగే బాల్ జాతి వాళ్ళు తరచు పాడే కొన్ని పాటలను గురించి వ్రాశాను. వారికి విగ్రహాలులేవు, దేవాలయాలులేవు, స్మృతులులేవు, క్రతువులులేవు. మానవుని దివ్యత్వాన్ని కీర్తిస్తూ వాళ్లు గానం చేస్తారు. మానవునియందు గాఢమైన ప్రేమ ప్రకటిస్తారు. ఆ నిరాడంబర సరళజీవనుల హృదయాలలోనుండి వెలువడిన ఈ భావం సర్వమతాలకు మూలమైన పరమార్థాన్ని

గ్రహించడానికి కీలకంగా ఉపయోగపడుతుంది. మతాలన్నీ మానవ వ్యక్తిత్వంలోని భగవత్తత్వాన్ని నిరూపించేవేగాని, సర్వశక్తిమంతుడైన పరబ్రహ్మాను అభివర్ణించేవి కావని వారి సూచన.

శాస్త్రం ప్రతిపాదించే అవ్యక్తిగత సత్యంకూడా మానవ విశ్వానికి సంబంధించినదే అని మనం అంగీకరింపక తప్పదు. అయితే, సత్యానికి మానవ చైతన్యాతిరిక్తమైన అస్తిత్వం ఉన్నందువలన, అది సత్యాసాశీల్యాల వంటిదికాదని ఆధునిక విజ్ఞానశాస్త్రవేత్త లంటారు. సత్యం మానవచైతన్య పరతంత్రం కాదనే విశ్వాసం దార్శనికరహస్యమనీ, మానవ సహజమనీ, అయినా దానిని వివరించి చెప్పటానికి వలను పడదనీకూడా వారు మనకు చెపుతారు. కాని, మనకు అవగత మవుతూన్న సత్యానికి మానవతాతిరిక్తమైన అస్తిత్వం ఉన్నదనటంవల్ల శాస్త్రం తనను తానే పూర్వపక్షం చేసుకున్నట్టు అవుతుంది. మానవుడు కనుగొని, స్వాయత్తం చేసుకున్న సత్యాలనే శాస్త్రం హేతువాదబద్ధమైన సూత్రాలుగా కూర్చిపెడుతుంది. హేతువాద మనేది యాంత్రిక మానవుడు సృజించుకొన్న భావనాయంత్రమేగదా! కనుక, పరమసత్యం వ్యక్తిగత మానవ చైతన్యానికిగాక, సర్వవ్యక్తి పరివ్యాప్తమైన విశ్వమానవ చైతన్యానికే పరతంత్రం అంటే పొసగుతుంది.

నాగదిలో నేను వాడుకుంటూన్న మేజాబల్ల మాన వుని వ్యక్తిగత ఇంద్రియదృష్టికి, వ్యక్తిగత భావనకు దాని రూపరేఖాది సర్వలక్షణాలతో మేజాబల్లగానే గోచరిస్తుంది. ఆ బల్లే శాస్త్రీయ వివేచన దృష్టితో చూచి నప్పుడు, తన ఐంద్రియ దృష్టికి గోచరించిన బల్లగా కాక పూర్తిగా భిన్నంగా కనిపిస్తుంది. ఈ భౌతికమైన ఇంద్రియాల వలన కలిగిన జ్ఞానము, హేతువాద బుద్ధివలన; శాస్త్ర పరికరాల వలన కలిగిన జ్ఞానమూకూడా అతని భావనాశక్తి ఫలితంగా కలిగినవే; ఈ రెండూ సత్యాలే – ముఖ్యంగా అతనికి. ఆయన నిస్సంశయంగా ఆ బల్లను తన భౌతికావసరాలకు వాడు కుంటాడు. అలాగే, అంత నిస్సంశయంగాను శాస్త్ర విజ్ఞాన వివేచనార్థమూ ఉపయోగించుకుంటాడు. అయితే, ఆజ్ఞానము ఒకానొక మానవునిది. ఆమానవవ్యక్తి లేకపోయినా, ఆబల్ల ఉంటుంది. కాని, అప్పుడుకూడా దాని అస్తిత్వం మానవ చైతన్యానికి ముడివేసుకునే ఉంటుంది. మన ఇంద్రియజ్ఞాన గోచరమైన బల్లకు, మనశాస్త్రజ్ఞాన దృష్టికి గోచరించే బల్లకుగల వైరుధ్యానికి సమష్టి మానవవ్యక్తిత్వంలోనే సమన్వయం కుదురుతుంది.

భావనాజగత్తుకి కూడా ఇది వర్తిస్తుంది. ఈ ప్రపం చాన్ని గురించి భౌతిక శాస్త్రజ్ఞుల సిద్ధాంతం ప్రకారం కార్యకారణ సూత్రం (Law of causality) తిరుగులేనిది.

జరిగిపోయిన సంఘటన ఏదీ మరొకవిధంగా జరిగిఉండటానికి వీలులేదు. మానవబుద్ధి జనితమైన ఒకానొక తార్కిక ప్రక్రియ ననుసరించే ఈ సూత్రం రూపొందింది. కాని, ఈ మానవబుద్ధిలోనే, దానివెనువెంటనే సంకల్పచైతన్యంఉంది. దానికి స్వతంత్రతాజ్ఞానం ఉంది; ఆ స్వాతంత్ర్యంకోసం నిరంతరం ఆరాటపడుతూంటుంది. మనం అనుదినం, ఇంచు మించు మనప్రవర్తనలో అడుగడుగునా ఈ సత్యాన్ని గమ నిస్తాం. నిజానికి ఆ సత్యంతో సమన్వయం కుదుర్చు కొన్న ప్పుడే మనప్రవర్తన సంపూర్ణంగా ప్రయోజనకారి అవు తుంది. అలాగే, మేజాబల్లను ఉపమానంగా తీసుకున్నప్పుడు కూడా జరుగుతుంది. ఆ బల్ల వాస్తవ స్వరూపాన్ని గురించి శాస్త్రవేత్త నిస్సంశయంగా రుజువుచేసిన సత్యం ఎట్టిదైనా, అది కేవలం కఱ్ఱతో చేసిన బల్ల అనే భావంతో వ్యవహరిస్తేనే మనకు దాని ప్రయోజనం. అది అరూపశక్తి లేశాల సము దాయం అనుకుంటే ఆ ప్రయోజనం ఉండదు. పరిమాణం విషయంలోకూడా ఈదృష్టి భేదాన్ని మనం గమనించవచ్చు. ఒకసూది పరిమాణాన్ని పెద్దభూతద్దంలోంచి చూచినప్పుడు ఆ సూదిమొన అప్సరోంగనల నాట్యరంగస్థలమంత విశాలం గాను, ఆసూదిబెజ్జం పెద్దఒంటె దూరిపోగలిగేటంత పెద్దది గాను కనిపించినా మనకు విభ్రమం కలుగకపోవచ్చు. ఐతే, సినీమా చూస్తున్నప్పుడు మాత్రం, దేశకాల ప్రమాణాలను

గురించిన మనదృష్టిని ఆ యాంత్రిక విన్యాసాలతో కుంచిం చటం, విపులీకరించటం సులభం. చిన్నవిత్తులో కాల పరి ణామాల దృష్ట్యా అపారమైన భవిష్యత్తు నిక్షిప్తమైఉంది. మానవుడు అనేసత్యం అనంతవాహినిలో ఒకానొక క్షణంలో హఠాత్తుగా అభివ్యక్తంకాలేదు. ఆ కాల గమనంలో ఒకా నొకప్పుడు విశదమైతే అయి ఉండవచ్చు. అంతేకాదు, ఈ మానవాభివ్యక్తి ఇప్పటికీ ఇంకా పూర్తి అయినది అని చెప్పటానికి కూడా వీలులేదు. మనం ఊహిం చిన ఏదో ఒకానొక సమయంలో జరిగినదీ కాదు. మాన వుని జన్మ రహస్యం అనంతతాగర్భగతమై ఉంది; అసం ఖ్యాకయుగాలనుండి పరిణామం పొందుతూ వస్తూంది. మానవావిర్భావం అతఃపూర్వం కోటానుకోట్ల కాంతి సంవత్సరాలనుండి జరుగుతూ వస్తూన్న ప్రక్రియలో ఒక పరిణామం అన్నప్పటికీ, అదంతా దానికి పూర్వరంగం అని ఒప్పుకోక తప్పదు. అతడు రూపొందే ప్రక్రియకు పట్టిన కాలం ఎంతదీర్ఘమైనా అది అతనిలోభాగం. మానవుని అస్తిత్వం సత్యమని ఒప్పుకుంటే ఆతనిచుట్టూఉన్న విశ్వంతో అతని అవినాభావ బాంధవ్యాన్ని కూడా ఒప్పుకోవాలి.

ఈ బాంధవ్యమే ఈదృశ్య జగత్తుకి మూలాధారమైన సత్యం. ఉదాహరణకు చిన్నబొగ్గు ముక్క చూడండి. దాని యథార్థరూపాన్ని గురించిన విచారణ ప్రారంభిస్తే, దానికి

స్థూల స్వరూపమే లేదనీ, కేవలం కొన్ని పరిభ్రమణాత్మక శక్తులతోకూడిన కేంద్రకాల సమూహమనీ తేలుతుంది. వీటిని బొగ్గుకి మూలకణాలంటారు. వాటిని ఇంకా వివేచించి చూస్తే కొన్ని ఎలక్ట్రానులు, ప్రోటానులు మిగులుతవి. అయినా, ఈ విద్యుల్లేశాల పరస్పర బాంధవ్యం, లేక సామరస్యంలోనే ఆబొగ్గుకి అస్తిత్వం. ముందు ముందు వీటినికూడ ఇంకా వివేచించడం సాధ్యంకావచ్చు. కాని, వాటిలో కనిపించే పరస్పరసంబంధ సామరస్యాలు మాత్రం యథాతథంగానే ఉంటవి.

ఈ సూక్ష్మాతి సూక్ష్మమైన మూలకణాల సముదాయం బొగ్గుగా ఎలా రూపొందుతున్నదో మనకు తెలియదు. వాటిలో ఒక విధమైన పరస్పర బాంధవ్యం ఏర్పడినప్పుడు అవి బొగ్గుగా రూపొందుతవని మాత్రం మనం చెప్పగలం. ఈ బాంధవ్య సామరస్యాలు ఆబొగ్గు ముక్కలోనేకాదు, ఈ భౌతిక విశ్వమంతటిలో అవి సృజనాత్మక సహకార స్నేహభావబద్ధమై ఉన్నవి.

వ్యష్టి నిరంతరం ఈవిశ్వానికి ఆత్మార్పణ చేసుకుంటూ ఉండటంవల్లనే ఈసృష్టి సాధ్యమయింది. ఆధ్యాత్మిక రంగంలోకూడా వ్యక్తుల ఆత్మాహంకార త్యాగం అవసరం. ఐతే, ఈ ఆధ్యాత్మిక క్రియ భౌతిక జగత్తులో భౌతిక వ్యక్తిత్వ త్యాగమంత సులభం కాదు. ఇందులో

వ్యక్తులు తమ జ్ఞానసంకల్పాలను విశ్వాత్మతో శ్రుతికలుపు కోవలసి ఉంటుంది.

"చలనాత్మకమైన ఈజగత్తు ఒక విశిష్ట ఏకతాసూత్ర బద్ధమైఉంది. కనుక, వాస్తవమైన సుఖం ఆశవల్ల కలగదు. వ్యక్తిగతాత్మ పరమాత్మకు స్వార్పణచేసుకొనుట వల్లనే సాధ్యం అవుతుంది" అని ఉపనిషత్తు బోధిస్తూంది. అనేక లోకాలు ఉన్నవని బోధించే విద్వాంసులు కొందరున్నారు. అవి పరస్పరం ఏమాత్రం సంబంధంలేని లోకాలు అని వారి భావం. ఇది వాస్తవమనుకొన్నా, రుజువుచేయటం మాత్రం అసాధ్యం. ఈ విశ్వం మానవుని అనుభవానికి, జ్ఞానానికి, ఊహకు, వివేకానికి, నేడుగాని మరొకనాడుగాని అతడు తెలుసుకొనగలిగే సర్వానికి రూపం. ఈ విశ్వంయొక్క భిన్న భిన్నలక్షణాలు అతనికి విశ్వసౌందర్యంగా, అప్రతిహాత సంఘటనల పరంపరగా, శక్తిగా అనుభవం అవుతున్నవి. ఈ విశ్వం తన వివిధ స్వభావాలతో అతని జ్ఞానేంద్రియాలకు, భావనకు, వివేచనా జ్ఞానానికి మాత్రమే సాక్షాత్కరిస్తున్నది.

అయితే, ఈప్రపంచముయొక్క సంపూర్ణస్వరూపం వ్యష్టి మానవ జ్ఞానదృష్టిమీదనే ఆధారపడి ఉన్నదని నేను చెప్పటం లేదు. అది విశ్వమానవ విజ్ఞానదృష్టి మీద ఆధారపడిఉంది. దాని వాస్తవికత సార్వకాలిక సర్వ గ్రాహకత్వశక్తి గల ఆ విశ్వాత్మమనస్సుతో అవినాభావ

సంబంధం గలది. కనుకనే, మనం సమగ్ర పదార్థవిజ్ఞానం కోసం ఆవిశ్వమానవుని హేతువాదబుద్ధికి ప్రాతినిధ్యం వహించే విజ్ఞానశాస్త్రంమీద ఆధారపడతాంగాని, పరిమిత దేశకాలావరణలోను, తాత్కాలిక జీవితావసరాలకోసమూ తారటలాడే వ్యక్తిగత బుద్ధిమీద ఆధారపడం. అందువల్లనే మననాగరకతకు అభ్యుదయం సాధ్యం అయింది. మానవ వ్యక్తి తన జ్ఞానశక్తి, ప్రేమ, ఆనందాల పరిధులను విస్తృతం చేసుకుంటూ సర్వోత్తమస్థితివంకకు పురోగమించటాన్నే మనం అభ్యుదయం అంటున్నాం. దూరాతిదూరాన మినుకు మినుకులాడే అదృశ్యతారక అత్యంతశక్తిమంతమైన దూరదర్శిని యంత్రంలోంచి చూచే వ్యష్టి మానవుని తత్వాన్వేషణ ప్రియతను సానుభూతితో పరికిస్తుంది. కనుక, ఈ విశ్వరహస్య పరిశోధన ఇలా చిరకాలం ఎడతెగకుండా సాగుతూనే ఉంటుందన్న మన విశ్వాసానికి ఎన్నడు భంగపాటు ఉండదు. ఆతారకలరహస్యం గ్రహించినకొద్దీ, మానవుని మహనీయ విజ్ఞానావకాశాన్నికూడా మనం గ్రహించగలుగుతాం.

మనం సాధించవలసినది ఒక్క హేతువాదబుద్ధినే కాదు. ఆమహామానవుని సృజనాత్మక భావనను, ప్రేమను, వివేకాన్నికూడా మనం సాధించాలి. ఆయన ఆత్మ మన అందరిలో వ్యాపించి ఉంది. ఆయనయెడ ప్రేమ సర్వజీవుల

పై ప్రేమ. ఆ ప్రేమశక్తి, గాఢత ఇతర ప్రేమ లన్నింటినీ అతిశయించినవి. సాహసకార్య శూరత, ఆత్మ త్యాగశీలం ఈ పూర్ణ ప్రేమసాధనకు చిహ్నాలు.

ఉపనిషత్తులలో చెప్పిన ఈశ్వరుడే ఈపరమాత్మ. అతడు సకల చరాచరవ్యాపి. అతడే మన మానవ విశ్వాధినేత అయిన భగవానుడు. మన వాస్తవజ్ఞానంలో, ప్రేమలో సేవాభావంలో, ఆయన మహిమమే ప్రతిభాసిస్తూంది. స్వార్థపరిత్యాగమార్గాన మన అంతరంగంలో ఆయనను సాక్షాత్కరింపజేసుకొనటమే జీవితపరమార్థం.

# ౨. సృజనశక్తి

ఒక పసిపిల్ల కథ కల్పించి. నాకు చెపుతూంది. ఆకథకు నేనే నాయకుణ్ణిట. నన్ను బలవంతాన ఒప్పించింది. నన్నొక చీకటిగదిలో పెట్టి బయట తలుపుతాళం పెట్టారనుకో మంది. "అప్పుడు అందులోంచి తప్పించు కుంటానికి ఏం చేస్తావ్?" అని నన్ను ప్రశ్నించింది. "తలుపు తీయండి, తలుపు తీయండి" అని అరుస్తాను అన్నాను. నా కేకలు విని ఎవరైనా వచ్చి తలుపు తీసేస్తే బాగానే ఉంటుంది. కాని, కథ చెడి పోతుంది. అందుచేత, ఆ పసిబిడ్డ ఆలోచించింది. నా కేకలువిని రావటానికి ఆ చుట్టు ప్రక్కల ఎవ్వరూ లేరంది. ఆ విధంగా, నేను బలప్రయోగం చేసి బయట పడటానికి ప్రయత్నించవలసిన అగత్యం కల్పించింది. అంటే, తలుపులు తన్ని, గుద్ది పగల గొట్టడానికి నేను ప్రయత్నించాలి. మళ్లీ కథ సాగాలి గద! అందుకోసం ఆ తలుపులు ఇనపవి అంది. నేనొక బీగం సంపాదించానుట. కాని ఆ బీగంతో కూడా ఆతలుపు రాదు. కథ ఇల్లా ఈ అడ్డంకులన్నీ దాటి ముందుకు సాగుతూండటం ఆ పిల్లకు అమితానందం కలిగించింది.

జీవనపరిణామం కూడా ఈకథలాగే నడుస్తున్నట్లు కనిపిస్తుంది. అంధకార కుహరద్వారభేదనమే ఉభయత్ర

ప్రధానసమస్య. చిక్కులు కల్పించటం, వాటికి తరణోపాయ మేదో కనిపించగానే, మళ్ళీ క్రొత్తచిక్కులు కల్పిస్తూ కథ పట్టుగా నడుపుకుపోవటం జరుగుతూంది. పూర్తిగా సంతృప్తి కరమైన ఉపాయం దొరికిపోతే, దానితో సర్వం ముగిసి పోతుంది. ఆపైన ఆ మహాశిశువు కథ వదలిపెట్టి కనుమూయ వలసి వస్తుంది.

అపార స్తబ్దత యొక్క అపరిమితాద్భుత వ్యాపృతికి ప్రతిగా జీవశక్తి చిన్న జీవకణమును రంగంలో ప్రవేశ పెట్టటంతో ఈ అధ్యాయం ఆరబ్ధమయింది. ఈ జీవశక్తి విజయయాత్ర అత్యాశ్చర్యకరంగా, అద్భుతంగా సాగుతూ ఇప్పటికీ తనరహస్యాన్ని గుప్తంగా అట్టిపెట్టుకుంటూంది. పైగా అక్కడితో ఆగక, ఎప్పటికప్పుడు తానే నూతన క్లేశాలను సృజించుకుంటూ, ఆ శిల్పవిన్యాసంలో మన హేతువాదబుద్ధికి ఎక్కడా అంతుపట్టని ఏదో వైచిత్రిని అద్భుతంగా ఉపయోగించుకుంటూంది.

స్వయంప్రచోదిత పరస్పరానుబంధన సామరస్యమే ఈ వైచిత్రి. ఇది మన వివేచనకు లొంగదు. ఆ జీవశక్తి అసంఖ్యాక జీవకణాలను ఏకీకృతంచేసి, సహకార స్వయం వర్ధనశీలముగల విశిష్టప్రాణిని సృజించింది. ఈ ఏకీకరణము రాళ్ళను ప్రోవుచేయటం వంటిదికాదు. ఈ సమీకరణములో భిన్నభిన్న వృత్తులు గలిగి, అయినా ఏక కుటుంబంగా సంచ

రెంచే ఒక సక్రమ వర్ణ వ్యవస్థ ఉంది. జీవశక్తి తన కనుసన్నలలో మెలగగల జీవకణ మహాసేన నొకదానిని సమీకరించి, ఆ సేనయందొక విధమైన కులాభిమానమును ప్రవేశపెట్టింది అనవచ్చు. కనుక వాటి ఏకతకు భంగం కలిగించే ప్రమాదం ఏది సంభవించినా ఆజీవకణాలన్నీ కలిసి సమష్టిగా ప్రతిఘటిస్తున్నవి.

ఇదే తన సౌందర్యంలో, తన బలంలో, తనసహిష్ణుతాభిజాత్యంలో పునర్జన్మ అనే అతి సూక్ష్మద్వారాన తన అఖండమైన అవిదితతత్త్వాన్వేషణ యాత్రలో అంతస్సామరస్యము, ఆంతరంగికజీవస్పందము గల వృక్షంగా రూపొందింది. నిజానికి సృజనాత్మకకృషి అంతటితో ఆగిపోవటానికి తగినంత అద్భుతసృష్టే-వృక్షం. కాని సృజనశక్తి ఆవిధంగా సంతృప్తిపడి ఊరుకోజాలదు. నూతన కవాటాలను తెరవాలి. అందుకోసం, తనమామూలు ధోరణిని కొంతమార్చి తన శిల్పంలో నూతన చమత్కృతిని ప్రవేశపెట్టింది. ఇదిస్వయం గమనశీలం. జీవనయాత్రలో ప్రమాదాలనుహెచ్చించి, ఆ విధంగా వాటిని పరిహరించు కొనడానికిగాను అవసరమైన సాహసోపజ్ఞలను పెంపొందించుకొనడానికి తగిన అవకాశము జీవులకు కలిగించింది. జీవజగత్తీరమునుండి వలసవచ్చే నవీనయాత్రికులపైన భౌతికజగత్తనేరాకాసి తీవ్రమైన నిషేధ శాసనాలు, ఆంక్షలు విధిస్తూఉండేది. అందువల్ల ఈ జీవశక్తి

తరచు ఆమెను ప్రతిఘటించి పోరాడుతూ ఉండేది. ఆవిధంగా రూపొందిన మరొక నూతనజీవి చేప. 'చలనశక్తి చేప విశిష్టత. భౌతిక జగత్తులో ప్రధానభూతాలలో ఒకటి అయిన జలం తన చిక్కదనంతో ఈ శక్తికి అవరోధం కలిగిస్తూంటే, దానిని జయించి ముందుకు కదలిపోవటానికి ఈ నూతనజీవి విలక్షణమైన ఆయుధాలు తయారుచేసుకోవలసి వచ్చింది. అలాగే వాయుమండలం తన పలుచదనంతో ఇంకాపెద్ద చిక్కులు కల్పించింది. అయితే జీవశక్తి ఈ చిక్కులను కూడా లెక్క చేయలేదు. పక్షికి అద్భుతమైన రెండురెక్కలు బహూకరించింది. అక్కడితో వాయువు జిత్తులన్నీ కట్టుబడిపోయినవి. సుస్థిరమైన భూమిమీదకంటె కూడా జీవశక్తికి సుకరమైన విహారస్థానమయింది వాయుమండలం. ధ్రువమండలం అచటి జీవరాశిపైన మంచు అనే భయంకరమైన ఆయుధాన్ని ప్రయోగించింది. ఉష్ణమండలపు ఎడారి రాకాసి నిప్పులు చెరిగే నిట్టూర్పులతో "అడుగుపెడితే హతమవుతారు" అంటూ జీవశక్తి సంతానమంతటినీ బెదరగొట్టింది. మృత్యు దండన విధాయకములైన ఈ అమోఘ శాసనాలనుకూడా పరకు చేయకుండా జీవశక్తి ఆ సీమలలోకి విజయవంతంగా ప్రవేశించింది.

ఈ విజయయాత్ర జీవశక్తి సాగించిన సామ్రాజ్య విస్తరణోద్యమంగా అభివర్ణింప దగినది. ఎప్పటికప్పుడు

నూతనాయుధాలను సమకూర్చుకుంటూ, వాటి సాయంతో ప్రకృతి శాసనాలను ఎదుర్కొని విజయం వెంట విజయం సాధిస్తూ జీవశక్తి ముందుకు సాగిపోయింది. ఈ జీవన పురోగమనం నిర్దాక్షిణ్య స్పర్థలతో, దారుణ హత్యాకాండలతో సాగింది. ఈ భౌతిక ప్రపంచం పరిమాణ ప్రాధాన్యం గలది కావటంవలన, ఇందలి సాధనసంపత్తి పరిమితం అవటంవలన అధికాయుధ సంపదే ఇందు విజయసాధన హేతువు అయింది. అందువలన ఒక జీవరాశి విజయం మరొక జీవరాశి పరాజయం ఈ పురోగమన యాత్రలో సదా సహచర సంఘటనలైనవి.

జీవనసౌకర్యాలకోసం అసంఖ్యాకములైన అల్పజీవుల నడుమ సాగుతూవచ్చిన ఈ స్పర్థ, సంఘర్షణ ఒక్కవిషయాన్ని ధ్రువపరిచినవి. బాగాకండలు పెంచుకొన్న పెద్ద శాకాసి జీవులదే రాజ్యమయింది. పటిష్ఠములైన పెద్దపెద్ద కండరాలు, ఎముకలు, దట్టమైన కవచంలాంటి చర్మం పొడుగైన తోకలూగల జీవులు వృద్ధిపొందినవి. పరిమాణప్రాధాన్యం గల ఈ జగత్తులో ఒడ్డుపొడుగులు గల శారీరక బలాధిక్యమే విజయహేతువుగా కనిపించటం సహజం. కనుక ఏ అందచందములులేని అట్టి భారీ వికృత రూపాలే జీవన విధాతకు కూడ నాడు ఉచితంగా కనిపించి ఉండవచ్చు. కాని, ఆత్మ పోషణకు, దౌర్జన్యానికి ఉద్దిష్టమైన ఈవికృత బృహద్రూపాలు

క్రమేపి పరాభూతములై నశించిపోయినవి. వాటి పరాజయ చరిత్రలే నేడు పురాతత్వవేత్తలు ఎడారులను, పురాతన కాలపు బురదనేలలను త్రవ్వి పైకితీస్తున్నారు. జీవన సంగ్రామంలో ఆ దారుణ పరాజయమునకు సంబంధించిన విస్మృత గాథను ఆ వికృతజీవుల అవశేషాలు మనకు తెలివిడి చేస్తున్నవి. ఆ బృహచ్ఛరీరాలు, భారీ ఎముకలు, మందపు చర్మాలు, గట్టి డిప్పలు, గొడ్డళ్లలాంటి దంతాలు, కత్తుల్లాంటి గోళ్ళు పెంచుకొని అమితభారవహాములైనవి. స్వేచ్ఛావిహారమును, తన ప్రధాన స్వభావాన్ని వ్యక్తీకరించడానికి తగిన అభ్యుదయమును కోరే జీవశక్తికి ఈ నిర్జీవాయుధ పరంపర బరువుచేటయింది. భూమి తన సంతతికై కల్పించిన జీవనాధారాల నన్నింటినీ అంతులేని ఆకలిగల ఈ రాకాసి జీవులే కబళించి వేస్తున్నవి. ఈ విధంగా ఉదర పోషణ చేసుకుంటూన్నప్పటికీ, ఆ వికృతాకారాలలోని నిర్జీవభారమే వాటి పురోభివృద్ధికి పెద్ద అంతరాయమయింది. ఈ పరాజయఖేల ఇప్పుడు పూర్తిగా అంతమయి పోయింది.. ఆరాకాసి జీవులలో మిగిలిఉన్న ఒకటి రెండు జంతువులు ప్రపంచంలో ఎక్కడో ఒకటి రెండుచోట్ల మాత్రం నేడు కనిపిస్తున్నవి. ఖడ్గమృగం, నీటిగుర్రం వంటివి ఆజాతివి. వీటికి కూడ తమ విశేషశక్తికి అమిత పరిమాణానికి తగినంత స్థానం ఈ భూమిపైన లేదు. ఎక్కడో మారు మూలల తమ

వికృతాకారాలను చూచుకొని పరితపిస్తూన్నట్లు బ్రతుకు తున్నవి. ఇవీ, వీటి పూర్వీకులూ జీవశక్తిచేసిన అసంఖ్యాక ప్రయోగాలలో అతిదారుణ పరాజయాలకు గురియైన జీవులు. పిమ్మట ఒకానొక శుభముహూర్తాన, ఉదయమో, సాయం కాలమో జీవశక్తి సాగించే ఈ ప్రయోగంలో ఆయుధ విసర్జన శకమనే నూతనాధ్యాయం ప్రారబ్ధమయింది. మాన వుడనే చిన్నజీవి అగాధ గాంభీర్యంగల ఆశలతో, సూచన లతోసహా రంగంలోకి అవతరించాడు.

ప్రపంచ పరిణామక్రమం స్వసత్య నిరూపణలక్ష్యంతో స్థలవిస్తృతిని, కాలగమనాన్ని అతిశయించిన ఏదో అంత రంగిక ప్రాముఖ్యాన్ని వ్యక్తీకరించే ఆశయంతో సాగుతున్న దని మనం గ్రహించాలి. ఆదిలో జీవోత్పత్తి జరిగినప్పుడు, అది తనతోకూడా నూతన పదార్థాలేవీ పట్టుకొని రాలేదు. కొండలు, ఖనిజాలు రూపొందటానికి ఉపకరించిన మూల పదార్థాలే దానికీ ఉపకరణాలయినవి. కాని ఇతర పదార్థాల వలె జీవం ఏవిధమైన భౌతిక విశ్లేషణకు లొంగటంలేదు. మనస్సూ, ఆత్మచైతన్యం కూడా ఇలాంటివే. అవి ఒకానొక మహార్థానికి వ్యక్తీకరణాలు. ఒకానొక సత్యం యొక్క స్వయం వ్యక్తతా చిహ్నాలు. ఈసత్యం మానవునిలో ప్రకృష్టంగా ప్రత్యక్షమయి, ఎప్పటి కప్పుడు మరింత విశదంగా ఆత్మాభి వ్యక్తీకరణకై పెనగులాడుతూంది. అనంతతత్వం చరిత్రలో

సీమావరోధాల నధిగమించి క్రమేపి స్వాత్మ సాక్షాత్కారం చేసుకుంటూంది అన్నమాట.

జీవపరిణామ క్రమంలో ఈ భౌతిక పరిణతి మానవునిలో పరాకాష్ఠ చెందినట్టు కనిపిస్తుంది. మానవ శరీరంలో మనం ముఖ్యమైనవిగా పరిగణించే అవయవాలు మార్పు చెందుతాయనిగాని, నూతనావయవములు మొలకెత్తగలవని గాని మనం భావించలేముగద! ఒక వేళ దైవికంగా నాలుగుకళ్లతోగాని, అవాంఛితములైన ఇతర అవయవాలతోగాని ఎవడైనా జన్మించినా, వాటిని తన శరీరంలోంచి వదుల్చుకొనటానికే మానవుడు ప్రయత్నిస్తాడు. శరీర నిర్మాణంలో ప్రస్ఫుటంగా కనిపించే మార్పు ఎట్టిదైనా మానవుడు తీవ్రంగా నిరసిస్తాడు, పరిహరిస్తాడు. అందచందాలులేని వికృతమైన కూర్పు ఎంతప్రయోజన కరమైనదయినా మానవుడు సహించడు. ఇది అతని సహజ సౌందర్య ప్రియతకు సంబంధించిన పట్టింపు. మన శరీరంలో వెనుక తట్టున విశాలంగా ఉన్న వీపుకి ఏవిధమైన రక్షణా లేదని మనకు తెలుసు. రక్షణావశ్యకత దృష్ట్యా నిజానికి ఇది దురదృష్టకరమైన లోపమే. ఈ లోపంవల్ల మనం భ్రమ ప్రమాదాలకు లోనవుతూనే ఉన్నాం. ఆదిలో వెనుకతట్టు రక్షణకు ఉపయోగపడుతూ వచ్చినతోక క్రమంగా మాయమైనందుకు మనం విచారించినా నిజానికి తప్పులేదు. ఆ తోకగుర్తు

మానవశరీరంలో ఇప్పటికీ గుప్తంగా నిలిచిఉంది. అయి నప్పటికీ శరీరావయవాల విషయంలో ఈ పాదుపరితనపు పద్ధతిని మళ్ళీతిరగతోడటానికి మాత్రం మానవుడు ఎన్నటికీ అంగీకరించడు. భూతప్రేతాలను గురించిన భీతికి అతిసున్నిత మైన, అజ్ఞాంధసీమ అయిన వెన్నుపూసే జన్మస్థానమని, నా దృఢవిశ్వాసం. అయినా, మననేత్రాలలో ఒకటి, అను చితంగా నిర్లక్షితమై అవ్యక్తభయాలకు ఆలవాలమైన మన మూపువైపుఉంటే బాగుండేదని నేను అనలేను.

ఒకవంక శరీరనిర్మాణంలో ఏవిధమైన సంస్కరణానైనా ఇంత పట్టుదలగా ప్రతిఘటిస్తున్నప్పటికీ, మానవుడు తన శరీరావయవ పటుత్వాన్ని గురించి తగినంత శ్రద్ధతీసుకోనక నిర్లక్ష్యం చేస్తున్నాడు. కొన్నిఅవయవాలశక్తి క్రమంగా సన్నగిల్లిపోతూంది. గోడలనడుమ నాగరక జీవనంవలన మానవుని దూరదృష్టి, దూరశ్రవణశక్తులు క్షీణించి పోతున్నవి. పచనంచేసిన పదార్థాలు తినడం వలన మన దంతాలకు తగినంత పరిశ్రమ లేకపోవడం, దంతవైద్యులకు చేతినిండా పనితగలటం జరుగుతూంది. నిరంతరం దుస్తులు ధరించటంవల్ల మనచర్మం వాతావరణ శీతోష్ణములకు తట్టు కొనటం, గాయాలను శీఘ్రంగా మాన్చుకొనటం మొదలైన సహజశక్తులను కోల్పోయి నిస్తేజమవుతూంది.

మానవావతరణ జరుగబోతూన్న తరుణంలోనే ప్రాణి

కోటికి సాహసోపజీవన దశ ముగిసిపోయినట్టు కనిపిస్తుంది. నిరంతరం ప్రయోగాలుచేస్తూ కేవలం భౌతికస్థాయిలో నూతన రహస్యాలనుమాత్రం తెలుసుకుంటూ కాలం వెళ్ళ బుచ్చటంలోని నిరర్థకతను ప్రాణి గ్రహించినట్టు కనిపిస్తుంది. జీవనరంగంలో మాత్రం, ఎల్లప్పుడు రెండురెళ్లు నాలుగే కానక్కరలేదని రుజువయింది. సజీవజగతిలో పరిమితరూప సమగ్రత అవసరం. అట్టి పరిమితజీవిలోనే అంతస్సామరస్యం భంగపడకుండా ఉంటుంది. పరిమాణ విస్తృతివలన శక్తిని వృద్ధిచేసుకోవాలనేకాంక్ష వినాశానికే దారితీస్తుంది. అంతరంగిక గుణమైన అంతస్సామరస్యమే జీవికి సమగ్రత కల్పిస్తుంది. పరిమాణ విస్తృతి పెచ్చుపెరిగి వెర్రితలలు వేసినప్పుడు ఆ సమగ్రతకు భంగంకలుగుతుంది. ఏనుగుకు ఉన్నట్లు ముక్కు మూడుబారల పొడుగుసాగి, అదే చేయిలాగకూడా పనిచేయగలిగితే కొంతఉపయోగం లేకపోలేదు. అయితే, ఏనుగు తోకకూడ మరొక తుండంలాగ పెరిగితే మరీ బాగుండునని కూడా మనం ఊహించవచ్చు. అయితే, ఈ విధంగా ప్రాణావరణను సాధనోపకరణ సంకులంగా జేసే దురాశా పూరితమైన అభ్యుదయం వినాశాభిముఖమైన గమనం అవుతుంది గాని, సవ్యమైన అభ్యుదయం కాదు. గుణకార పట్టికలలో మృగ్యమైన స్వాభావసిద్ధమైన లయ జీవితానికి ఉంది. ఈ లయాభిరమ్యతను నవయజేసే ధూర్తమైన

అభ్యుదయం ఆ వలయాత్మకమైన శృంఖలాలతో చివరకు దానిని నశింపజేస్తుంది. నేను లోగడ చెప్పినట్టు జీవపరిణామ చరిత్రలో ఇట్టి దురంతాలెన్నో జరిగినవి.

కనుక, తన హద్దు లెక్కడో తెలుసుకోగల ఉచితజ్ఞత తోకకులేకపోతే, ఈ పరాధీనతా విధానం దేహసామ్రాజ్య వినాశానికి హేతువవుతుంది. ఇదే ఆ విషాదాంత ప్రకరణం నేర్పిన గుణపాఠం.

పైగా, కేవలము శారీరకాభ్యుదయ విధానంలో ఒకొ్కక్క జీవి ఒకొ్కక్క విషయంలో విశిష్టతకలదిగా రూపొందుతుంది. ఒంటె ఎడారి వాతావరణానికి తగిన విలక్షణ జంతువు. అది బురదనేలలో బ్రతకమంటే బ్రతుక లేదు. నైలునదీతీరపు బురదనేలలో ఉండే నీటిగుర్రం ఆ ప్రక్కనున్న ఎడారిలో ఎందుకూ కొరగాదు. ఇట్టి ఏకముఖ వైలక్షణ్యం జీవనరంగంలోవృత్తితత్వాన్ని ప్రవేశపెడుతుంది. ఆవిధంగా ప్రత్యేక ప్రజ్ఞల ఆవరణాన్ని సంకుచితపరుస్తుంది. వాయువీథులలో విహరించే, విశిష్టప్రజ్ఞ పక్షులకు పరిమిత మయిపోయింది. జలచరతాప్రతిభ చేపలకు పరిమితమయింది. నిప్పుకోడి తన పరిసరాలలో తాను మొనగాడు. డేగల రాజ్యంలో అది పనికిమాలినది. కనుక ఈజంతువులన్నీ తమతమ పరిమిత పరిసరాలలోని సౌకర్యాలతో సంతృప్తి-పడి అక్కడే శాశ్వతంగా కట్టుబడి ఉండకతప్పదు. ఈ

ప్రత్యేక ప్రవీణతలకు సంబంధించిన అభ్యుదయం కేవలం భౌతికమైనదిగనుక, విధిగా పరిమితం గాక తప్పదు. అందు వల్ల ఈ ప్రత్యేకతల కారణంగా పూర్ణ జీవన వికాసం భంగ పడవలసి వస్తూంది.

అమితంగా పెరిగిపోతూన్న ఈనిర్జీవాంగాలభారం నుండి ఆత్మరక్షణ చేసుకొనటం, ఈ ప్రత్యేకతలను తగ్గించు కొనటం, ఒకానొకదశలో జీవశక్తి లక్ష్యమైనట్లు కనిపిస్తుంది. జీవనం ముఖ్యంగా గుణప్రధానమైనది. పరిమాణ ప్రాధాన్యం గలదికాదు. కనుక, ఈ భౌతిక పరిమాణాభివృద్ధి ఎడతెగ కుండా సాగిపోయే యెడల బహుజీవన క్లేశాలకు హేతువయి అది ఒక విషచక్రంగా పరిణమించగలదని అచిరకాలం లోనే గ్రహించి ఉండాలి. భారీప్రమాణంలో మాంసకండ రాలను పెంచుకొన్న ఈ సృష్ట్యాదిమజంతువులు తమ శరీర భారాన్ని మోయడానికిగాను బలమైన పెద్ద అస్థిపంజరాన్ని నిర్మించుకోవలసివచ్చింది. ఆవెనుక, ఆ శరీరాలకు ముందు వెనుకల తూకం సమంగా కుదరడానికిగాను పొడుగైన తోకలు పెంచుకోవలసివచ్చింది. ఈవిధంగా, ఆ జంతువుల శరీరాలు పెరిగిపోయి ఎక్కువ ఆవరణను ఆక్రమించుకొన డంతో ఆ విస్తృత శరీరాన్ని కాపాడుకొనడానికి బలమైన, బరువైన, విశాలమైన కవచం కావలసివచ్చింది. ఈవిధంగా నిర్జీవపదార్థాలను పెంచుకొనే ఈ అభ్యుదయానికి తోడుగా

పళ్ళు, గోళ్ళు, కొమ్ములు, గిట్టలు లాంటి మరికొన్ని నిర్జీవ వస్తువులను సమకూర్చుకొనడం అవసరం అయింది.

ఒక యాంత్రికభారం ఇతర యాంత్రిక భారాల ఆవశ్యకతను కల్పిస్తూ, జీవనం కేవల నిర్జీవపదార్థాలకు వాహనంగా, కేవల యంత్రకూటమిగా రూపొంది, రూపొంది, చివరకు ఆ అంతులేని అసందర్భాల భారంతోనే కృంగిపోయింది. వృక్షాలలో ఎక్కువభాగం నిర్జీవపదార్థమే అని మనకు తెలుసు. ముఖ్యంగా కొండలో ఏదో కొద్ది భాగం తప్ప మిగిలినదంతా నిర్జీవపదార్థమే. తన ఔన్నత్యం కోసం ఆవృక్షం కాండాన్ని ఆధారంగా చేసుకున్నది. నిర్జీవమైన దారువు వృక్షానికి ఊడిగంచేస్తూ, చిలవలు పలవలుగా పెరిగిపోతూన్న దాని శరీరమంతటినీ మోస్తుంది. అట్టి నిర్జీవ అస్వతంత్ర పదార్థముపై ఆధారపడటంవల్ల వృక్షం తన స్వాతంత్ర్యాన్ని కోల్పోయింది. తన భారాన్ని మోయడానికి భూమితో స్థావరసంధి చేసుకోవలసి వచ్చింది. భూమితో ఏర్పాటు చేసుకున్న ఈ అదృశ్య సంధి బంధన పరంపర వలన తాను శాశ్వతంగా ఒక్కచోటే నిలబడి పోవలసివచ్చింది.

స్వేచ్ఛగా చరించడ మనే మహాసౌకర్యం కోరే జీవు లన్నీ తమ రూపాలలో నిర్జీవ పదార్థాలభారం తగ్గించుకోక తప్పదు. జీవనాభ్యుదయం ఆంతరంగిక జీవితానికి సంబం

ధించిన సర్వసమగ్రమైన అభ్యుదయంగా ఉండాలిగాని, కేవల భౌతిక యంత్ర సంబంధమైనది కారాదు. నిర్జీవ పదార్థం జీవత్పదార్థానికి ఇను మిక్కిలిగా పెరిగిపోవడం, కవచం త్వగింద్రియాన్ని చైతన్యరహితం చేయడం, ఆయు ధోపకరణాలు ఆ ఆయుధాలనే నిరర్థకంచేయడం వినాశకర మైన ధోరణే అని గ్రహించేస్థితి వచ్చింది.

చివరికి, జీవశక్తి మానవునిలో స్వస్వరూపాన్ని చూసుకొని, తన ఉద్యమాన్ని సఫలంచేసుకుంది. ఆమె సంకల్పశుద్ధి వెలుగురేకలుగా వికసించి, ఆమె పొలిమేరల ఆవల ఏవో నవం నవ లక్ష్యాల దిశగా ప్రసరించింది. ఈవృత్తం పూర్తిఅవడానికి పూర్వం అట్టినవలక్ష్య స్ఫురణలన్నీ బాహిర మైనవిగా, కేవలం శిల్పనైపుణికి, జీవనోపకరణాలకు, అంగో పాంగ పటుత్వానికి సంబంధించినవై ఉండేవి. ఆ విధంగానే సాగితే, అంతులేని దుర్భర భౌతికాభ్యుదయమే సాగుతూ ఉండవలసింది. తేనెటీగ కంటికి గల బహుముఖ వీక్షణశక్తికి మన ఊహకుకూడా అందని ఏదో అసాధారణ ప్రయోజనం ఉండిఉండాలని మనం ఒప్పుకోవచ్చు. అలాగే, మిణుగురు పురుగు తన శరీరంలోనే ఒకదీపికను ఏర్పాటు చేసుకొనడం మనజ్ఞానానికి, కౌశలానికి అందని వింత అనికూడా అంగీక రించవచ్చు. మనభావనల కందని విలక్షణ ఇంద్రియాలు గల జీవులు ఈ సృష్టిలో బహుశః చాలాఉండి ఉండవచ్చు.

అట్టి ఇంద్రియశక్తులన్నీ జీవశక్తి సాగించే అనంత యాత్రాపథాన్ని ఇంకా దీర్ఘీకరించడానికి మాత్రమే ఉపయోగ పడగలవు. మనం ఈ భౌతికాస్తిత్వసీమను దాటడానికి అవి ఏ విధంగానూ ఉపకరించవు.

జీవశక్తి సామర్థ్యాన్ని గురించి చెప్పినదంతా, వివిధ జీవుల అలంకారాలకు కూడా వర్తిస్తుంది. అగాధ సముద్రాల్లో అడుగున బ్రతికే జీవులు కొన్ని అతివిచిత్రమైనవి. వాటి శరీరాలపైన ఉన్న రంగులు, అలంకార కౌశలం మనను ముగ్ధుల్ని చేస్తున్నవి. సీతకోకచిలుకల రెక్కలు, మట్టిపురుగుల వెన్నులు, నెమళ్ళ పింఛాలు, నత్తల గుల్లలు, వృక్షజాతిలోని అద్భుతాలంకార విన్యాసం పరిపూర్ణస్థాయిని, ఇంచుమించు పరాకాష్ఠను అందుకున్నట్టు కనిపిస్తుంది. అయినా, ఈఅభ్యుదయం కేవలం ఈ భౌతిక స్థాయిలోనే సాగుతూఉంటే, అది ఎంత ఆశ్చర్యకరమైన అద్భుతవైవిధ్యాన్ని సాధించినా, ఏదో అనిర్వాచ్యమైన మహార్థాన్ని నిర్లక్ష్యంచేసినట్టే. ఈ అలంకారాలన్నీ, చెరపట్టిన బాలికకు ఆ చెరలోనే సర్వ భోగాలు కల్పించి – ఒకవంక ఆమె విమోచనంకోసం, దూరదిగ్వలయ మావల స్వగృహంకోసం, ఇంద్రియజ్ఞానాతీతమైన ఆంతరంగికానందంతో పరితపిస్తూన్న బాలికకు – తొడిగిన నగలవంటివి. భౌతికమైన స్వాతంత్ర్యం ఆ ఖైదు గోడలనడుమ స్వాతంత్ర్యంవంటిది. అది యాంత్రిక నైపు

ణ్యాన్ని, పై పై సొగసులనూ మాత్రమే సాధించగలుగు తుంది. శారీరకబలము, నైపుణ్యము ఎంత ఉన్నతస్థాయి వరకు వృద్ధిఅయినా, అవి జీవులను అభ్యాస ప్రాబల్యానికి బానిసలనుజేసి ఉంచుతవి. మూసలో పోతపోసే ఈ పద్ధతి భద్రతకు, చతురస్రమైన ఏకరూపోత్పత్తులకు ఉపయోగకారి కావచ్చు. కాని అది బంధనం. బహుశతాబ్దాలుగా తేనెటీగ అదే తేనెపట్టు నిర్మిస్తూంది; గిజిగాడు అదేగూడు కడుతూంది; సాలెపురుగు అదే నేత నేస్తూంది. ఈ ప్రవృత్తులు వాటి కండ రాలను, నరాలను బలంగా అంటిపట్టుకొని, తప్పులుచేసే స్వాతంత్ర్యం వాటికిలేకుండా చేస్తున్నవి. ఈ భౌతిక ప్రవృత్తి పూర్తిగా విశ్వసనీయమైనదిగా ఉండడంకోసం, – వినయ విధేయతలతో, క్రమశిక్షణతో, పాఠాలన్ని "తు,చ" తప్ప కుండా అప్పగిస్తూ ఏనాడూ అల్లరి ఆగం చెయ్యకపోయినా, ఎన్నడూ ఉత్సాహోద్వేగాల నెరుగని బుద్ధిమంతుడైన బడి పిల్లడి లాంటిది. అనతిక్రమణీయ పరిమితులకు అకలంక పరిపూర్ణరూపమది; బహుశః అచిత్తుకి ఇదిదూరపుజ్ఞాతి అనవచ్చు.

అయితే, ఈ పరిపూర్ణతాస్వర్గం తన నిష్ప్రమాదకర మైన, అవక్రక్రమబద్ధమైన భీరుపరిపాలనను నిరవధికంగా సాగించడానికి జీవశక్తి సమ్మతించలేదు. విజ్ఞాన వృక్షఫలం ఆస్వాదించడానికి తీర్మానించుకొని మరొక స్వాతంత్ర్యోద్య

మానికి అంకురార్పణ చేసింది జీవశక్తి - అతి సాహసంగా ఈ సారి జీవశక్తి పోరాడవలసింది అచిత్తుతో కాదు. తనకే భారవహములుగా పరిణమించిన తన పరిచారికల కట్టుబాటులతో; తన సంరక్షణ బాధ్యత వహించే ప్రజ్ఞాశాలియైన, తన ప్రధానమంత్రియైన విశ్వసనీయమైన ప్రవృత్తితో. ఆపైన నూతన ప్రయోగాలు చేయడంలో జీవశక్తి నూతన విధానం అవలంబించిది. నూతన శాసనాలు జారీచేసింది. వెనుకటి ధోరణికి పూర్తిగా భిన్నమైన చరిత్రలోనికి మానవుని మళ్లించడానికి ప్రయత్నం ప్రారంభించింది. మనస్సు అనే అతి ప్రమాదకరుడైన ఆగంతుకుడికి తన తలుపు తెరచి, అతనిని తన సలహాదారుగాకూడా చేసుకుంది. ఇది అమిత సాహసమైన ప్రవర్తన. ఈ మనస్సు అంతకు పూర్వం లేదని చెప్పలేము. కాని, ఒకానొక దశలో ఒక తెర లేవడం ఈ మనస్సు రంగంమీద ప్రవేశించి అభినయ మారంభించడం సంభవించి ఉండాలి. అనగా, తమోరూపంలో ఉన్న తేజస్సు, అత్యుజ్జ్వలస్థితికివచ్చి, స్వస్వభావ విరుద్ధంగా క్రాంతి ప్రసరణ గుణం అలవరచుకొన్నట్టే ఇదీ జరిగిఉండాలి.

ప్రాణంవలెనే మనస్సుకూడా ప్రధానంగా గోణాత్మకమైనది; స్థానపరిమాణ రహితమైనది. ఆకారణం వల్లనే స్థానావరణలపై దాని ఆధిపత్యానికి అవధులులేవు. ప్రాణానికివలెనే మనస్సుకికూడా స్వేచ్ఛలోనే వ్యక్తిత్వం. జీవశక్తి

తొలిసంతానంతో వ్యవహరించే టప్పుడు దానికి ఈ స్వేచ్ఛ లభించలేదు. జంతువులలోకూడా మనస్సు తన సన్నిహిత జీవన పరిధులను అధిగమించే అవకాశమున్నా, ఆ అవకాశం పరిమితమైనది; పసిబిడ్డ తన గదిలోనుండి బయటకు వెళ్లగలిగినా, తన ఇంటినుండి బయటకు పోలేనట్టు; లేక విదేశీయులకు విశృంఖల ప్రవేశమిస్తే ప్రమాదం కలుగవచ్చునసే భయంతో, జపాను పాశ్చాత్యదేశాలతో సంధిచేసుకొన్న కొత్తల్లో విదేశనౌకలు ఫలానిరేవుకి మాత్రమే రావచ్చునని నిబంధించినట్టు. జీవశక్తికి మనస్సుకూడా వైదేశికమే. దాని శాసనాలువేరు. దాని ఆయుధాలు ప్రబలమైనవి. దాని ధోరణులు, మర్యాదలు అపరిచితమైనవి.

సెమెటిక్ పురాణాలలోని 'ఈవు' వలె జీవశక్తి స్వాతంత్ర్యం సంపాదించుకొనగోరి తన ప్రశాంత ఏకాంత సుఖానికి ముప్పు తెచ్చుకొన్నది. ఆమెను నూతన రహస్యలోకంలో విహరింపజేస్తానని వాగ్దానంచేసిన ఆ మోహానుని గుసగుస లామె నాకర్షించినవి. దానితో, ఆ అపరిచితునికి, ఆమెకు శాశ్వతమైన దృఢబంధనం ఏర్పడింది. అంతవరకు జీవశక్తి శ్రద్ధాసక్తులు కేవలం స్వసామ్రాజ్యానికే పరిమితమై ఉండేవి. మనస్సుఅనే ఈ ఆగంతుకునితో సాంగత్యమేర్పడిన నాటినించీ అట్టిమరొక సామ్రాజ్యంకూడా ఆమెకు సంక్రమించింది. ఈ ఉభయమండలాలకు పరస్పర సంఘర్షణ

ఏర్పడుతున్నవి. అవి తీవ్రమైన క్లిష్టసమస్యలుగా పరిణమిస్తు న్నవి. మానవావయవాలలో కొన్ని నిర్లక్ష్యం చేయబడు తున్నవని లోగడ చెప్పాను. జీవశక్తి తనసామ్రాజ్యంపై సర్వతంత్రస్వతంత్రాధిపత్యం చెలాయించే ప్రశాంత సమ యంలో ఆమె జీవనకర్తవ్యాలను అతిశ్రద్ధగా గమనించేది. మనస్సు ఇప్పుడా శ్రద్ధను కొంతవరకు మరొకవంకకు మళ్ళిం చింది. జీవనానికే ప్రాముఖ్యమిచ్చే జీవశక్తి సంకల్పాలకు విరుద్ధంగా మనస్సు తనసంకల్ప వ్యక్తీకరణను బలంగా సాగించుకొనగలదు. మనస్సుకి ఇది సహజలక్షణం అని మనకు తెలుసు. మనస్సంకల్పసిద్ధి నిమిత్తం జీవశక్తి కొన్ని త్యాగాలు కూడా చేయవలసి వస్తుంది. ఇటీవల కొందరు సాహసికులు ఎవరెస్టు శిఖరారోహణకు ఉద్యమించారని మనకు తెలుసు. అది అత్యంత ప్రమాదకరమైన సాహస క్రీడ. దానికి విప్లవ తత్వంగల 'మనస్సు' యొక్క ప్రేరణే కారణం. ఇట్టి విషయాలలో మనస్సు తన సహచరితో చేసు కొన్న సహకారసంధిని భంగపరుస్తూంది. ప్రమాద రహిత మైన జీవనం జీవశక్తి లక్ష్యం. మనస్సు ఈ లక్ష్యసాధనకు సహాయపడకపోగా, ప్రబలమైన ప్రమాదాలను తెచ్చిపెడు తూంది. జీవశక్తి వెనుక ఒకప్పుడు చెలాయించిన అపరిమిత సర్వతంత్ర స్వతంత్రాధికారాలను ఈ ధూర్తమనస్సు తరచు ఎగురగొట్టివేస్తూంది. నిజానికి, ఈ సాహచర్యంలో

పోడుగునా, ఒకరికర్తవ్యాల్లో ఒకరు కలుగజేసుకోవడం, అదితరచు దురంతాలకు దారితీస్తూ ఉండటం జరుగుతూనే ఉంది. ఇలాజరుగుతున్నప్పటికీ, లేక ఇలాజరుగుతూ ఉండబట్టే, మానవుని పరిణామంలో ఈనవీనవాహినులు అనూహ్య సంపదలను తీసుకువచ్చి అతనితీరాన దిగుమతి చేస్తున్నవి. ఈ సంపదలేవీ మాంసల మహితములైన ఆదిమరాక్షసి జంతువులేవీ కలలోకూడా ఊహించి ఎరుగనివి.

జీవసామ్రాజ్యంలో మానవుడు అవతరించిన పద్ధతే. అసలు పెద్దసవాల్వంటిది. కథలో జాక్ అనే బాలుడు రాక్షసుణ్ణి సవాలుచేసినట్టుఉంది ఈసవాలు. భారవహమైన భౌతికాభ్యుదయానికి సంబంధించిన అంగబలంపట్ల అవిశ్వాసమనేది అసలు మానవుని శరీర నిర్మాణంలోనే ఉంది. మనస్సు నగ్న మానవుణ్ణి "భయపడకు" అని హెచ్చరించింది. అతడు ధైర్యంగా ప్రబలమైన మాంసకండర సైన్యాన్ని ఎదిరించి నిలబడ్డాడు. అతని బడుగు కండరాలు నిస్పృహాత్రో ఆర్తారావంచేసినవి. అతడు కొత్తపద్ధతిలో, నూతన పరిణామక్రమంలో తగుసాధన సంపదను కూర్చుకోనవలసివచ్చింది. దాంతో మానవుడు పాశవికమైన స్తబ్ధతలోంచి ఎగిరి మానుష మహోదశకు చేరుకున్నాడు. అతడూ తన అంగబలాన్ని వృద్ధిచేసుకోనడానికి నూతన సృష్టి ప్రారంభించాడు. అయితే, ఈ అంగబలం తన శరీరానికి అంటిపట్టుకోనని

బాహిరమైన అంగబలం. ఈ అంగబలం తనకు సేవచేస్తుంది; కాని, తన బ్రతుకులో పాలుపంచుకొనగోరదు. ఇట్టి అంగ బలశ్రేణిలో మొట్టమొదటివి విల్లులు, అమ్ములు. ఈ మార్పు భౌతికపరిణామక్రమంలోనే గనుక జరిగివుంటే, క్రమక్రమంగా, మెల్లగా అతిభారవహమైన పద్ధతిలో మానవుని చేతలు వికృతంగా తయారయి ఉండేవి. బహుశః నేను కొంచెం పొరపడుతున్నానేమో! జీవశక్తియొక్క ప్రాకృతిక సాంకేతికశక్తిలోని కుశలత, నైపుణ్యము అనుపమానమైనవి. కనుక, మానవుని హస్తాలు విల్లమ్ములకు మారుగా ఉపయోగపడేందుకు సముచితమైన సుందరమైన అవయవాలుగానే రూపొందేవేమో! అప్పుడు ఆధునిక భావకవులంతా వాటి సొబగులనూ, వేటాడటంలోనే కాకుండా, అలాంటిమరికొన్ని చిలిపిపనులలో కూడా వాటి కౌశలాన్ని ప్రస్తుతిస్తూ కావ్యాలు వ్రాసేవారనుకుంటాను. అయితే. అప్పుడు కావ్యరచన చేయడంలో మాత్రం ఆహస్తాలప్రయోజనం పరిమితంగానే ఉండేది. వేటాడడంలో ప్రత్యేక ప్రావీణ్యం గల చేతులు కలంపట్టి వ్రాయడానికిగాని, వీణాతంత్రులను మేళవించడానికిగాని సరిగా ఉపయోగపడలేవుగద! ఈ నూతన పరిణామపద్ధతిలో మహత్తర ప్రయోజనం ఉంది. విల్లు, అమ్ములు మొదలైన మానవుని నవీనాంగాలు అతని శరీరాన్ని అంటిపట్టుకొని ఉండక విడిగా ఉండడమే ఈ

ప్రయోజనం. అవి మానవుని హస్తాలు ఏదో ఒకే పనిలో నిపుణంగా ఉపయోగపడేటట్టు ఎన్నడు చేయవు.

ఏనుగు తొండము, పెద్దపులిపంజా, అడవిమెలుక గోళ్ళు, మానవుని హస్తాలకన్న బలవత్తరమైనవే కావచ్చు. కాని, అవి ఉపయోగపడే పనులన్నిటికీ మానవుని హస్తాలు ఉపయోగపడుతున్నవి. అలాకాకుండా, ఆజంతువుల అవయవాలన్నీ మానవశరీరంలో మొలిచివుంటే, అతివికటంగా, వికృతంగా తయారయి ఉండేవి.

ఈ నూతన కార్యక్రమంలోని ప్రప్రథమ సౌకర్యం, మానవునికి విశేష భౌతికభారం లేకపోవడం. అనగా, సాధ్యమైనంత తక్కువ శారీరకశక్తితో, అతడు సాధ్యమైనంత ఎక్కువ పనిచేసుకొనడానికి వీలు ఏర్పడిన దన్నమాట. దీనివల్ల కలిగిన మరొక ప్రయోజనం: మానవునకు సంబంధించినంతవరకు, పరిమిత ప్రయోజనాలకోసం నూతనావయవాలను సృష్టించవలసిన బాధ్యతనుండి జీవశక్తికి విముక్తి. దీనివలన చేపకు, పక్షికి, వేగంగా పరిగెత్తే జంతువులకూ గల ప్రత్యేక నైపుణ్యాలన్నిటినీ స్వయంగా సాధించాలని కలలు గనడానికి మానవుని మనస్సుకి ప్రోత్సాహం లభించింది. అన్నిరకాల జీవులకు తాను సంపూర్ణ ప్రతినిధి కావాలన్న కాంక్ష మానవునికి కలిగింది. ప్రాకృతిక పరిణామాల ద్వారాకాక కేవలం, తన వివేకవంతమైన మనస్సు సహాకారంతో అట్టి

అవకాశాలను పరిశోధించి సాధించాలని అతడు సంకల్పించుకొన్నాడు. పుట్టిన రోజు పండుగనాడు కుర్రవాడికి ఒక బాకు బహుమతిగా ఇస్తే దానితో వాడికి పులిని ఎదిరింపగల ఆయుధం లభించింది. ఈ సౌకర్యమే పూర్వపరిణామపద్ధతిలో సహజాంగంగా అతనికిలభించాలంటే, లక్షలాది సంవత్సరాలు పట్టి ఉండేది. అది అతనికి అనవసరంగాను, ప్రమాదకరం గాను పరిణమిస్తే, తిరిగి దానిని వదిలించుకొనడానికి మరి కొన్ని లక్షల సంవత్సరాలు పట్టేది. మానవుని మనస్సు యుగాలలో జరుగవలసిన ఈ పరిణామాన్ని కొన్ని సంవత్సరాలలోనే సాధించి ఈ ఉక్కు గోళ్లను తయారు చేసింది. అయితే, ఈ ఉపకరణము, దానిని ఉపయోగించే వారి తీరూ సక్రమ సామరస్యంతో సాగవేమో నన్నదొక్కటే ఆందోళన. వ్యాఘ్రంలో దానిగోళ్లూ, అది వాటిని ఉపయోగించే తీరూ క్రమబద్ధంగా రూపొందినవి. ఏ వ్యాఘ్రంలోనూ గోళ్లకు దాని వ్యాఘ్రత్వానికి పొత్తుకుదరక పోవడమనేది ఉండదు. బాకు రూపంలో ఉక్కుగోరును అమర్చుకొన్న కుర్రవాడు మాత్రం కేవలం మానవత్వానికి అనుగుణమైన తీరులోనే ఆ బాకును ఉపయోగించే ధోరణిని అలవరచుకొనలేకపోవచ్చు. ఇదివరకు ఉన్న అంగబలానికి తోడుగా నేడు మానవుడు కొత్తగా అమర్చుకొంటున్న సాధనసంపద అతివేగంగా, అపరిమితంగా పెరిగి పోతూంది. అతని అంత

రంగిక స్వభావంకూడా అంత వేగంగాను ఆ సాధన సంప త్తితో సామరస్యం కుదుర్చుకోగలిగితే బాధలేదు. కాని, అదే సాధ్యం కావడంలేదు. అందువల్ల, మానవులు ఈ సాధనసంపదతో తమ జీవితాలకు, తమ ఇరుగు పొరుగు వారి జీవితాలకు ముప్పు తెచ్చుకొనే విధంగా వివేకరహితంగా ప్రవర్తిస్తూ ఉండటం మనం చూస్తున్నాం. ఈ కత్తులకు, కటారులకు మానవత్వం అలవరచటానికి తగిన వ్యవధి మాన వునికి ఇంకాలభించలేదు.

ఇప్పుడు, ఒక్క విషయం మీరు గమనించి ఉండాలి. అసలు నాటకంలో మొదటి ఘట్టంలోని తీరే ఇప్పుడు మారి పోయింది. మాతృమూర్తి అయిన జీవశక్తి ఇప్పుడు యవ నిక వెనుకకు తప్పుకున్నది. ఈ మూడవ అంకంలో ఆమె మానవశక్తికే సంపూర్ణ ప్రాముఖ్యం ఇచ్చివేసింది. తాను సిద్ధాంతంలోనే ఉండి, రాజసంరక్షకి అయిన వృద్ధరాణిగా అవసరమైన సహాయం మాత్రం చేస్తూంది. జీవన సామ్రా జ్యంలో మానవుని సృజనాత్మక ప్రతిభ స్వయంగా సింహా సన మధిష్ఠించి శాసించడ మారంభించింది. ఇక, అప్పటినుంచి మానవుడు తన ప్రభుత్వాన్ని స్థాపించడంలోను, తాను చేసిన శాసనాలు నిరాఘాటంగా సాగేటట్టు కట్టుదిట్టాలు చేసు కొనడంలోను నిమగ్నుడయ్యాడు. భారతదేశంలో యోగులను ఎరుగుదుము. వారు తమ శరీరాలలో కూడా ప్రకృతిమాత

ఆధిపత్యం సాగిస్తూ ఉండడానికి సమ్మతించక ఆత్మశక్తులను ఏకాగ్రం చేసుకుని తమ శరీరంలోని ముఖ్య మండలాలను స్వసంకల్పానికి వశం చేసుకుంటారు. ఆ మండలాలు మన మేధావులకు అపరిచితాలు.

అయితే, ఈవిధంగా మన పరిణామ ప్రగతిలోవచ్చిన ఈ మార్పుతో పాటుగా మరొక ప్రధాన సంఘటనకూడా జరిగింది. మానవునిలోని పాశవిక జీవనావసరాలకు కావల సిన దానికన్న అత్యధికంగా మానవుణ్ణి ఆకర్షించే ఒక నవీన దృక్పథం ఏర్పడింది. ఆ సర్వవ్యాపకశక్తి మనం మన బ్రతుకు పొలిమేరలను అధిగమించేటట్టు చేసింది. మానవుని భావనలకు, మధుర స్వప్నాలకు విశ్రాంతి విహార భూమిగా ఉపకరింపగల విశాలావకాశాన్ని మనకు చూపించింది. నిజానికి సృష్టిచేయడంలో ఆనందం అనుభవించే దేవతలకే విశ్రాంతి విహారం. కేవలం జీవించడమే లక్ష్యమైన ఆదిమ జీవుల స్వర్గంలో జీవుల అదృష్టం ఆకస్మిక సంఘటనలు ప్రసాదించే అకారణ వరప్రసాదాల రూపంలో వాటికి ప్రాప్తించేది. ఆ జీవరాశి బ్రతుకులు నిరంతరం అట్టి దయా ధర్మ భిక్ష మీాదనే ఆధారపడి ఉండేవి. అప్పుడప్పుడు భౌతిక విధి వాటిని అకారణంగానే దారుణంగా శిక్షిస్తూ ఉండేది. యాచకులకు, యాచకులతో పొత్తు కుదరదు. ఒకరిని చూచి ఒకరు అసూయపడడం, అనుమానపడడం, యజమాని దయ

వల్ల బ్రతికే కుక్కలలాగ పళ్ళికిలిస్తూ, మూలుగుతూ, మొరుగుతూ పరస్పరం చీల్చి చెండాడు కొనడానికి ప్రయత్నిస్తూండడం పాశవలక్షణం. దీనినే విజ్ఞానశాస్త్రం "జీవనసంగ్రామం" అంటుంది. అట్టి యాచక స్వర్గంలో శాంతికి తావులేదు. ప్రత్యేక భద్రత, సౌకర్యాలు కోరే జీవులు నిరంతర జాగరూకతతో, వివిధ నవీనాయుధాలను అపారంగా తయారు చేసుకుని, ఎప్పటికప్పుడే యుద్ధానికి సంసిద్ధులై ఉండాలి.

అయితే, ఈ అరుపులూ ఆందోళనలమధ్య "అనుభవించు! ఆనందించు!" అంటూ మానవులకు ఒక హెచ్చరిక వినిపించింది. అది దేవతావాణి. ఆమె భౌతికావసరాల ప్రాబల్యంనుండి విడివడిన ముక్తికాంత; విశ్రాంతి దేవత; విశేషి లేక అధిశేషి అనే దివ్యకామిని. జీవరాశిలో ఒకడుగా మానవునకు ప్రాప్తించిన బానిసతనంనుండి అతడు ఉద్గతుడై స్వతంత్రుడయాడు. ఇదివరకు అతని ఆత్రమంతా సంపాదనకే అంకితమై ఉండేది. ఇప్పుడతడు దాత అయాడు. లోగడ నిరంతరం అతడు భగవంతుని కరుణకోసం అంగలారుస్తూ ఉండేవాడు. ఇప్పుడా భగవంతుడే వచ్చి అతని తలవాకిట నిలిచి, పూజాపురస్కారాలు అర్థిస్తున్నాడు. జంతువులలో ఒక జంతువుగా మానవుడు ప్రకృతిమీద ఆధారపడకతప్పదు. మానవుడుగా అతడు తన ప్రపంచాన్ని తానే నిర్మించుకొని పరిపాలించుకునే సర్వతంత్ర స్వతంత్రుడు.

ఈదశలోనే, మతం అనేది రూపొందడం, దానివల్ల మానవుడు అనంతశక్తికీ తనకూగల బాంధవ్యాన్ని గ్రహించగలగడం సంభవించింది. అధర్వవేదంలో ఒక సూక్తి ఉంది. దాని అర్థం ఇది. "ఆర్జవం, సత్యం, మహోద్యమాలు, సామ్రాజ్యం, మతం, వ్యాపారం, శౌర్య ప్రతాపాలు, అభ్యుదయం, భూత భవిష్యత్తులు ఆ విశేషి అతీతశక్తిలోనే అంతర్భూతములయి ఉన్నవి."

కేవలభౌతికమైన సర్వానికి పరిమితులు ఉన్నవి. ఈ పరిమితి గ్రుడ్డుమీది పెంకువంటిది. అనిర్వచనీయము, అదృశ్యము అయిన అపారావరణలోనే ముక్తి ఉన్నది. కేవల భౌతిక ప్రయోజనకుహరంలోనే మతానికి అర్థంలేదు. ఆ విశేషిలోనే మనం వ్యక్తిత్వాన్ని రూపొందించుకుంటూ ఆమెకు నిరంతర తేజో జీవనానంద వలయాలు కల్పిస్తాము.

పసిబిడ్డ మాతృగర్భంలోంచి బయటపడిన తరువాతనే తల్లికీ, తనకూగల యథార్థసంబంధాన్ని తెలుసుకొనగలుగుతుందనీ, అదేసత్యమనీ,—ఒక గీతంలో నేను వ్రాశాను. అలాగే మానవుడు ప్రకృతిగర్భకుహరంలోనుండి వెలువడిన తరువాత ఈవిశ్వంతో తనకు ఎంతవిస్తారమైన, గాఢతరమైన బాంధవ్యం ఉన్నదీ గ్రహించ గలిగాడు. తననైతిక జీవితంలో అతడు తన బాధ్యతను దానితో పాటు తన స్వాతంత్ర్యాన్నికూడా గుర్తిస్తాడు. అదే మంచితనము.

తన ఆధ్యాత్మికజీవితంలోనే ఏకతాభావనకు, స్వతంత్ర సంకల్పానికి సంబంధించిన అతని దృక్పథం ప్రేమగా పర్యవసిస్తుంది. తనశక్తిని ప్రకృతి శక్తులతో మేళవించడం ద్వారా అతడు ప్రాకృతిక రంగంలో అవకాశస్వేచ్ఛను సాధించుకుంటాడు. అలాగే స్వసంఘంపట్ల తనబాధ్యతలను నిర్వహించడం వలన సాంఘికానుబంధ స్వేచ్ఛను సంపాదించుకుంటాడు. ఆవిధంగా తన భద్రతకై తనజాతి సమష్టిశక్తిని కూడా సమీకరించుకుంటాడు. అంతరాత్మ స్వేచ్ఛద్వారా పరమాత్మతో తన ఐక్యభావాన్ని సాక్షాత్కరింపజేసుకుని, నిత్యవికాసంగల సత్యంలోను, నిత్యచైతన్యవంతమైన ప్రేమలోను తనపరిపూర్ణతను సిద్ధింపజేసుకుంటాడు.

మానవుడు సాధించిన ప్రప్రథమ స్వేచ్ఛ లేక ముక్తి భౌతికమైనది. అతడు తనపరిమిత శరీరంలోగల జ్ఞాన, కర్మేంద్రియాల శక్తిని వృద్ధిచేసుకోనవలసిన అగత్యంనుండి పొందిన విముక్తి మొట్టమొదటిది. ఈ స్వేచ్ఛ అపారమైన భూమిక కలిగి, అద్భుతంగా ఫలించింది. మానవుడు తనపరిసరాలను దాటి మరికొంతదూరం కూడా చూడగలిగేటట్లు అతని నేత్రశక్తిని అభివృద్ధి చేయాలని మొదట ప్రకృతి సంకల్పించుకొన్నది. అట్టి దూరదృష్టికోసం మన తల మీద పెద్దదూరదర్శిని మొలిచి ఉన్నట్లయితే, అది (ఇప్పుడంతరించిపోయిన) రాకాసి యేనుగు దంతాలకన్న ఎక్కువ భారవహంగా,

వినాశకరంగా తయారయి ఉండేది. నత్త తనయింటిని తన వీపుమీద మోసుకొని పోతూండాలి. అందువల్ల దానిఇంటి ఆకారం, బరువు దాని శారీరకశక్తికి లోబడిఉండాలి. అదృష్ట వశాత్తు మానవుని యిల్లు అతని అస్థికల పునాదిమీద పెరుగవలసిన అవసరంగాని, అతనికండరాలను ఆవరించుకొని ఉండవలసిన అగత్యంగానిలేదు. ఈ భౌతిక విముక్తివలన, అతడు నిరభ్యంతరంగా, యథేచ్ఛగా సువిశాలమైన, బలిష్ఠ మహాసౌధాలను నిర్మించుకోగలుగుతున్నాడు. తనభవనా లను తన మూపుమీద మోయవలసిన అవసరంలేదు గనుక అతడు సుఖంగా బ్రతుకుతున్నాడు. ఈ సంఘటన వలన మానవునిలో గొప్పపరిణామం కలిగింది. స్వగృహ నిర్మా ణంలో, ఆ సృష్టి క్రియలో అనంతతత్త్వాన్ని గురించిన భావం అతని మనస్సులో మొలకెత్తింది. ఈ విశేష కాలాపారతా భావమే మానవుని వాస్తుకౌశలాన్ని ప్రోత్సహించింధి. ఈ కౌశలం విశ్వజనీనమైన ప్రయోజనంగలది. దాని వలన తాత్కాలికావశ్యకతా ప్రధానమైన కృపణత పరాస్తమైనది.

జీవశక్తి పరిణామంలో అసంఖ్యాకమైన ఏకజీవకణాలు ఏకమై అంతకన్న పెద్దజీవులుగా రూపొందిన ఒకదశను గురించి లోగడనేను ప్రస్తావించాను. ఇది కేవలం సమీకరణ వంటి పరిణామంకాదు; స్వరూప స్వభావాలలో ఎన్ని వ్యత్యాసాలున్నా అతి విచిత్ర ధోరణిలో అంతస్సామరస్య

మేర్పరచుకొన్న అద్భుత ఏకీకరణము. ఈ సామరస్య రహస్య మేమిటో మనం ఎన్నటికీ గ్రహించలేము. ఈ జీవకణాల మధ్య ఖాళీలున్నవి. అవి మొత్తం అంతట వ్యాపించిఉన్న సమాహారశక్తిని భంగపరచవు. సమాహారజీవికి భవిష్యత్తు ఉన్నది. అది ఎదుగుతూ ఉంటుంది. ఈ పెరుగుదల సాగడం కోసం ప్రతిజీవకణం కృషిచేసిచేసి, తానుమరణించి, తన వంటి మరొక సేవకునికి తనస్థానం ఇస్తుంది. ఇందులో ప్రతి జీవకణం, మొత్తం సమాహారజీవిశోభ అంతా తనదిగానే భావించవచ్చు. అయినా, వ్యక్తిగతంగా ఏ జీవకణమూ భావిచరిత్రకు సంబంధించిన ఆజీవి సౌభాగ్యమంతటికీ భాగ స్వామి కాజాలదు.

సకల జీవరాశిలో, మానవునిలోనే ఈ బహు జీవకణ సమాహారం పరిపూర్ణదశ నందుకున్నది; మానవుని శరీరం లోనేకాదు, అతని వ్యక్తిత్వంలోకూడా. వ్యక్తిగతమైన ఏకాకితానియమంనుండి విముక్తి పొందడానికి ప్రయత్నించే ఒకానొక చైతన్య పరిణామమే బహుశతాబ్దులుగా మానవుని పరిణామంగా కనిపిస్తుంది. ఆ చైతన్యం తన అంతస్సంబంధ సామరస్యాలలో ఒక పరిపూర్ణతను సాధించాలని యత్నిస్తూవచ్చింది. తత్ఫలితమే మానవుడు. అస్ఫుటమైన పాశవిక ప్రవృత్తిగాఉంటూ వచ్చిన ఈ సంబంధం సమగ్ర స్వస్వరూప జ్ఞానంకోసం తంటాలు పడుతున్నది. భౌతిక పరి

ణామలక్ష్యం భౌతిక జగత్తుతో సముచిత సంబంధ సామరస్యాలను సాధించడం. మానవచైతన్య పరిణామం మాత్రం వ్యక్తిత్వ జగత్తుతో సంపూర్ణ సామరస్యాన్ని సాధించడానికి ప్రయత్నిస్తూ వచ్చింది.

మానవత్వ భావన ఊహా కల్పితమనీ, వ్యక్తిగతాభిప్రాయమనీ వాదించేవారున్నారు. ఔను, ఈ సజీవసత్యాన్ని మానవతాంతర్గతులకు ప్రత్యక్ష ప్రమాణాలతో నిరూపించడం సాధ్యం కాదని ఒప్పుకోనక తప్పదు. వారు అందులో ఐక్యమై ఉండటంవలన, బయటినుండి వారా సత్యాన్ని చూడలేరు. మన శరీరంలోని ప్రతిజీవకణానికి ప్రత్యేకంగా ప్రాణం ఉన్నది. కాని, అందులో ఏదీ శరీరంలోనుండి విడివడి బయటికివచ్చి ఆశరీరాన్నంతటినీ, దాని భూతభవిష్యద్వర్తమానాలతోసహా దానిపూర్ణ రూపంలో చూడలేదు. ఆ జీవకణాలకు హేతు వివేకం ఉంటే (మనకు తెలిసినంతలో ఉన్నదనే అనుకోవచ్చు), అసలట్టి శరీరమంటూ ఉన్నదనే భావన ఊహాకల్పితమనీ, వాస్తవంగా అట్టిదేమీ లేదనీ, తమ మధ్య ఏదో విచిత్రమైన ఆకర్షణా, పరస్పర ప్రభావ పారవశ్యం ఉన్నప్పటికీ అవి పూర్తిగా వాస్తవమైన వనడానికి వీలులేదనీ, ఆ జీవకణాలన్నీ తమ మధ్య అధిగమించరాని అభ్యంతరాలతో విడి విడిగా ఉండడమే ప్రత్యక్ష ప్రమాణాలతో నిరూపించదగిన సత్యమనీ — ఆజీవకణాలు కూడా ఇలాగే సిద్ధాంతీకరించవచ్చు.

ప్రేలే పరమాణువులుకొన్ని కొన్ని ఉన్నాయనీ, అవి తమ పరిమాణం దృష్ట్యా అపారంగా కనిపించే వాతావరణంలో, ఒక క్రమాన్ని అనుసరించి తిరుగుతూ ఉంటాయనీ మనకు తెలుసు. అయినా అవిగట్టి ప్రకాశవంతమైన ఘన పదార్థంగా ఎలాకనిపిస్తాయో మనకు తెలియదు. అలాగే, అఖండ చరిత్రను నిర్మించడంలో నిమగ్నులై మానవ వంశావళితో కూడిన అనంతకాలానగాలను ఒకేసారి చూడగలిగిన ద్రష్ట ఎవడైనా ఉంటే, అతనికి వాటి ఘనిష్ఠమైన ఏకరూపతతప్ప, తద్విరుద్ధగుణములైన వాటి వ్యక్తిత్వ భిన్నత్వాలు గోచరించవు.

మన యెదుట కనిపించే ఇనుపముక్కను ఆణవిక దృష్టితో పరిశీలిస్తే, అసలు ఇనుపముక్క-అనేది లేదనవలసి వస్తుంది. మనకు ప్రత్యక్షంగా ఇనుప ముక్క కనిపిస్తున్నది. అది మన మనస్సులకు ఒకవిధంగా అర్థమవుతూంది, ఇదే మనకుగల ప్రత్యక్షసాక్ష్యం. ఏ (మృగశీర్ష) నక్షత్రలోకం నించో దిగివచ్చిన ఒకవ్యక్తి అందులోని అణువులనుతప్ప, ఆ ఇనుపముక్క రూపాన్ని చూడలేకపోతే, భూలోకంలో ఉండే మానవులంతా అనాదిగా మాయలోపడి కొట్టుకుంటున్నారని అతడు అనవచ్చు. మనం ఆ వ్యక్తితో వివరించడం అనవసరం. కాని, ఆ యినుపముక్కగా మనకు కనబడుతున్న దానిని మన అవసరానికి ఉపయోగించు

కుంటూండటమే వివేకవంతమైనపని. "వేదాహ మేతమ్" (అతనిని నేను తెలుసుకొన్నాను) అని ప్రకటించిన మహర్షులు ఉన్నారు. వారు ఆదివ్యదృష్టితోనే జీవించారు. వారితో పోల్చిచూచినప్పుడు మనం అంధులమే కావచ్చు. అయినా, వారిని మనం దైవసములుగా ఆరాధించాము.

మానవ ఐక్యభావానికి తార్కికులు ఏమని పేరు పెట్టినా, ఇతరులలో మనను మనం దర్శించుకొన్నప్పుడు మనకు అపారమైన ఆనందం కలుగుతున్నది. ఇదే ప్రేమకు నిర్వచనం. మానవునిగురించి పరిపూర్ణ అంతిమ సత్యమైన ఆ మహాత్ముని గ్రహించడానికి ఈ ప్రేమే మనకు ఆధారం. తీరని ఆకలి, మొరిగేకంఠం, కొరికేపళ్లు, చీల్చేగోళ్లు, మన మీద చెలాయించే నిరంకుశాధిపత్యన్నుంచి, క్రూరమైన అసూయకు అసహ్యాకరమైన వంచనకు హేతువగు పరిమిత భౌతికసంపదల ఒత్తిడినించీ విముక్తులమై విహరించడానికి ఈ ప్రేమే మనకు ఆధారము, అనంతారామముకూడా అవుతూంది. ఆ ఆరామంలో మానవాత్మ భోగింపదగిన అపారమైన సంపద కేవలం సానుభూతి సహకారాలద్వారా ఉత్పత్తి అవుతుంది; చిరకాలాచారాలుగా వస్తున్న నిషేధాలకు భీతి చెందక ఏ విధమైన పరిమితులను పాటించకుండా చేసే అనాసక్త విజ్ఞానకృషిద్వారా అది సాధ్యమవుతుంది. వర్ణ వాతావరణ విచక్షణలు పటించకుండా మానవసేవ చేయడానికి

తగిన ఉపజ్ఞను కష్టపడి సాధించడం ద్వారా అది పొనుపడు తుంది. విశేషి అనంత సామ్రాజ్యంలో విహరించే ప్రేమశక్తి మనచైతన్యానికి భిన్నాత్మతా వ్యామోహ బంధనంనుండి విమోచనం కలిగిస్తుంది. ఆ ప్రేమశక్తి నిరంతరం తన తేజస్సుతో ఈ మానవ జగత్తును శోభాయమానం చేయాలని ప్రయత్నిస్తూంది. ఇదే నాగరకతా ప్రగతి. సత్యపథంలో పురోగమనం సుగమంచేసే ఐక్యభావాన్ని మాత్రమే నాగరకతా ప్రగతిశక్తి మనకు ప్రబోధిస్తున్నది.

"య ఏకో వర్ణో బహుధా శక్తియోగాత్
వర్ణాన్ అనేకాన్ నిహితార్థో దధాతి
విచైత్తి చాంతే విశ్వమాదౌ స దేవః
స నో బుద్ధ్యా శుభాయ సమ్యునక్తు."

"తానొక్కడు, వర్ణాతీతుడు, బహుశక్తులు గలవాడై సర్వవర్ణముల ప్రజలకు సహజమైన కోర్కెలన్నీ తీర్చువాడు, ఈ విశ్వానికి ఆదిలోను, అంతమందును ఉండువాడు అగు దేవదేవుడు మనలను శుభకరమైన సద్భావ సామరస్యాలతో ఏకము చేయుగాక."



# ౩. మానవునిలోని విశిష్టత

అథర్వవేదములోని కొన్ని మంత్రాలలో కవి మానవుణ్ణి గురించి అత్యుదాత్తంగా అభివర్ణించాడు. ఆమంత్రాలలోని భావమిది :

"మానవునకు స్వరూపము, ఆభిజాత్యము, సంచారశక్తి, అభివ్యక్తి, శీలము సమకూర్చినవారెవ్వరు? అతని విజ్ఞానమును, గానమును, నృత్యమును ప్రోత్సహించినవారెవరు? అతని శరీరము నిటారుగా నిలుపబడినప్పుడు అతడు ప్రక్క భాగాలను, తనలోని మిగిలిన అన్నిదిశలను కూడా చూచుకున్నాడు. అతడే అనంత తత్వానికి ఆస్థానపీఠమైన మహామానవుడు."

"తస్మాద్వై విద్వాన్ పురుషమిదమ్ బ్రహ్మేతి మన్యతే"

"కనుకనే విద్వాంసులా పురుషుడే బ్రహ్మ అని తెలుసుకుంటున్నారు."

"సనాతనమేనమాహురుతాద్య స్యాత్పునర్నవః."

మానవుడు తన అవతార ప్రారంభదశలోనే తన శరీరాకృతిలోనే అనాదిగావస్తూన్న ప్రాకృతిక విషయాల నుండి విముక్తిపొందాలనే తన సంకల్పం తొలిసారిగా ప్రకటించాడు. పరిణామపథంలో ఒక మలుపుదగ్గరకు వచ్చే

సరికి, మానవుడు చతుష్పాద జంతువుగా ప్రవర్తించడానికి నిరాకరించాడు. తన శరీరానికి అతడు కొత్తగా అలవరచుకొన్న భంగిమమే అతని ప్రబలమైన అవిధేయతకు శాశ్వత నిదర్శనం. భూమిమీద తిరిగే జంతువులన్నిటికి వాటిదీర్ఘ దేహాలకు ముందూ వెనుకా తూకం సమంగా కుదిరేటట్టు రెండు జతలకాళ్ళు ఏర్పాటుచేయడం ప్రకృతి నియమమని వేరుగా చెప్పనక్కరలేదు. ఇది ఎన్నడూ మార్పుకూర్పులు లేని భూమ్యాకర్షణశక్తితో ప్రకృతిచేసుకొన్న భద్రతా సంధి. ఇట్టి క్షేమకరమైన ఏర్పాటును మానవుడు తిరస్కరించాడు. ఇది మానవునిలోని విధిశాసనోల్లంఘన తత్త్వానికి, నిరంతర సంస్కరణల కండూతికి నిదర్శనం.

మన యింట్లో ఉన్న నాలుగుకోళ్ళబల్ల రెండుకాళ్ళమైన నిటారుగాలేచి నిలబడి, మిగిలిన రెండుకోళ్ళను ప్రక్కన ఊగులాడిస్తూనడచివస్తూన్నట్లు మనకు కనిపిస్తే, అది ఏభూతమో అని భయపడతాం. లేక, దానిని సృజించిన వ్రడంగి పనితనాన్ని పరిహసించడానికి ఆబల్లచేస్తూన్న అల్లరి అనుకుంటాము. సరిగా అల్లాంటిఅసమంజసప్రవర్తనే శారీరకంగా మానవునిలోకూడా కనిపిస్తూండటం చూస్తేఅతడు ఏ విపరీతగ్రహకూటమిలోనో జన్మించడంవల్ల ఈవిధంగా తలతిక్కగా ప్రకృతిసూత్రాలను ఉల్లంఘిస్తున్నాడేమో అని పిస్తుంది. పైగా, ఈవిధంగాపశుసంచరణనియమాలను ప్రతిఘ

టించడంవల్ల ఎన్నిసారులు ఎన్ని ఎదురుదెబ్బలుతిన్నా మానవుడు తనమూర్ఖపుపట్టుదలవదలడంలేదు. అతనికండరాలు సులభంగా సమతౌల్యం కుదుర్చుకునేఅవకాశంలో సగం భాగంఅతడీవిధంగా చేజేతుల వదులుకున్నాడు. ఆలాగే చాలీ చాలనిపట్టుతోనే నిలబడి శైశవదశలో తరచుపడుతూ లేస్తూ ప్రమాదకరమైన పద్ధతిలో నడక నేర్చుకుంటాడు. జీవితం పొడుగునా అలాగే ఎన్నోసార్లు తూలిపడుతూ ఒక్కొక్కప్పుడు ప్రమాదకరమైన అంగవైకల్య కరమైన దెబ్బలు తింటాడు. అయినా లెక్కచేయడు. జంతువులకు ఈ ప్రమాదాలేవీ లేవు. అడుగడుగునా భూదేవతకు సలాములుచేస్తూ జీవయాత్ర సాగించడానికి ఇష్టపడితే మానవుడుకూడా ఆ అవయవ భద్రస్థితిని యథాతథంగానే ఉంచుకొని సుఖంగా బ్రతికేవాడు. అది ఇష్టంలేకనే ఈమహాసాహసానికి పూనుకొన్నాడు.

నిటారుగా నిలబడగల శక్తి అలవరచుకొనడంవల్ల మన శరీరం సులభంగా ఎటుపడితే అటుతిరగడానికి, వంగడానికి అవకాశం ఏర్పడింది. చుట్టూ తిరిగిచూస్తూ, భౌతిక జగత్తులో మన కేంద్రస్థితిని మనం గుర్తించగలుగుతున్నాం. తత్ఫలితంగా, జంతువులన్నీ భౌతికంగా ఏక సంకుచిత మార్గంలో ముందుకు సాగగలిగి ఉండగా, మానవ సంచార రంగం విశాలవృత్తం అయింది. కేంద్రస్థుడైన మానవుడు విశాలతర దృష్టిగలవాడై, తనపరిధియొక్క వైశాల్యంలో స్వస్వరూప దర్శనం చేసుకొనగలుగు తున్నాడు.

ఒక స్వాతంత్ర్యం మరొక స్వాతంత్ర్యానికి మార్గదర్శి అవుతుంది. ఆ విధంగా మానవుని నేత్రదృష్టికి కూడా విస్తృతావకాశం లభించింది. అతని భౌతికదృష్టి శక్తి వృద్ధి అయినదనిగాదు; నిజానికి, కాంతికి అనుగుణంగా మారగల శక్తి వేటాడి జీవించే కొన్నిజంతువుల దృష్టికే విశేషంగా ఉంది. అయితే, ఎత్తునుంచి చూచే వీలువల్ల మనదృష్టికి విలక్షణమైన సౌకర్యం ఏర్పడింది. ఈ సౌకర్యం వివిధవస్తువుల స్థానాన్ని గురించిన భోగట్టా తెలుసుకొన డానికేగాక, ఆయావస్తువుల పరస్పర సంబంధాలను, సామరస్యాన్ని గ్రహించడానికి కూడా ఉపకరిస్తున్నది.

నిటారుగా నిలబడ గలగడానికి మానవుడు సంపాదించుకొన్న భౌతిక స్వాతంత్ర్యంవల్ల అతని చేతులకు ముక్తి లభించింది. ఇదే దీనివలన కలిగిన అత్యుత్తమ ప్రయోజనం. మన శరీరనిర్మాణంలో చేతులే నైపుణ్యానికి, సౌందర్యానికి, పనిపాటులకు, సర్వప్రయోజనాలను మించిన ఇతర విషయాలకు ప్రఖ్యాతమైనవి. మన అవయవాలన్నిటిలో చేతులేఎక్కువ విశృంఖలతగలవి. ఒకప్పుడు ఇవి మన శరీరభారాన్ని మోసే కంభాలుగా ఉండేవి. ఆ శూద్ర వృత్తినుండి ఉద్ధరింపబడిన వెంటనే మనకు సహాయకుల హోదా సంపాదించు కొన్నవి. మన దిగువను స్తంభాలుగా ఉంచడంమాని మన పార్శ్వాన వాటికి స్థానమియడంతో, మనం పశుత్వ సీమలను అధిగ

మించడానికి ఉపకరించిన అపూర్వ సామర్థ్యాలను అవి ప్రదర్శించినవి.

ఈ దృష్టి స్వాతంత్ర్యం, ఈ కార్యస్వాతంత్ర్యం సాధించడంతో, మానవునిలో అతని భావనల ద్వారా మన స్వాతంత్ర్యం కూడ సిద్ధించింది. మన ప్రజ్ఞలన్నిటిలోకి ఈ భావనా స్వాతంత్ర్యమే పూర్తిగా మానవతా విశిష్టమైనది. శిల్పిచే కొంతవరకు రూపొందింపబడి, నిర్వస్త్రాలంకారంగా, కవచాయుధ రహితంగా వదలివేయబడి, పైగా చాలావరకు అసంస్కృతమైన, అశిక్షితమైన 'మనస్సు' చెప్పుచేతలకు అప్పగించబడిన మానవునికి నాటినుండి ఈ భావనాశక్తే దిక్కు అయింది. కళాకారులందరివలెనే తప్పులు చేయడానికి తన మనస్తత్వానికీ శారీరక సుస్థితికీ విరుద్ధమైన; బాధాకరమైన సాహసాలు చేయడానికి కూడా భావనాశక్తికి స్వాతంత్ర్యంఉన్నది. అశిక్షితులు, అసంస్కృతులు, అయిన మర్త్యులకు ఈ స్వాతంత్ర్యం దివ్యమైన వరంగా లభించింది. అందువల్లనే, మర్త్యుల నిర్మాణాత్మకమైన అభ్యుదయ మార్గమంతా దారుణ శిథిలావశేష మయంగా కనిపిస్తుంది; వారి విజయదశలుకూడ భయంకరమైన వైకల్యాలతో కూడినవి. అయినప్పటికీ, అసలు సృష్టి శిక్షణే ఒక లక్ష్యాన్ని స్పష్టంగా ప్రకటిస్తున్నది. ఆ లక్ష్యం హఠాత్తుగా ఏదో ఒక వ్యక్తి మనస్సులో ఫలించేదికాదు; కేవలం జీవనావశ్యకతలకు పరిమితమై ఉండేదీకాదు.

మన చుట్టుప్రక్కల దృశ్యంలో వైయక్తిక సత్యమైన మనసుకూడా చేర్చుకొనడానికి మన నేత్రదృష్టి మనకు ఉపయోగపడినట్లే, మనం జీవించవలసిన జీవన విధానాన్ని మన భావనాశక్తి మనకు స్ఫురింపజేస్తూంది. ఈ జీవన విధానం వ్యక్తిగత జీవనాన్ని అధిగమించినది; స్వసంరక్షణ ప్రవృత్తి యొక్క పాశవికార్థానికి విరుద్ధమైనది. అదివిశిష్టావరణవంకకే పరుగులు పెడుతుంది. మనదైనందిన జీవనసీమలను దాటిపోయి, అచట విశ్వమానవశక్తికి సాదరాతిథ్య మిచ్చేందుకుగాను, అమూల్యమైన ఆతిథేయ మందిరం నిర్మిస్తుంది. మన ఆత్మ పాశవికాత్మతో బంధింపబడని విముక్తాత్మ అయినప్పుడు అట్టి ఆతిథ్యమిచ్చే గౌరవాధికారాలు మనకు ఉన్నవి. విముక్తాత్మకు దివ్యత్వం ఉన్నది. భగవంతునితో బాంధవ్యం కలుపుకొనగల అర్హత విముక్తాత్మకే ఉన్నది.

ఏ రంగంలో నయినాసరే మనం సాధించే ప్రతి విముక్తి,మనఆత్మ సాక్షాత్కార పథాన్ని విస్తృతంచేస్తుంది. ఈ ఆత్మ సాక్షాత్కారం ఆత్మాహంకారాన్ని చంపుకొనడం ద్వారానే సిద్ధించవలసిఉంది. భద్రతకోసం ప్రకృతి విధించిన ఆంక్షలతో ఒకేవిధమైన, మార్పుకూర్పులు లేని బ్రదుకు జంతువులకు శ్రేయస్కరమైనదే కావచ్చు. శుద్ధ సత్యజీవనంకోసం తన జీవనాన్ని అధిగమించి బ్రదుకవలసిన బాధ్యతగల మానవునకుమాత్రం అది ఎంతమాత్రం శ్రేయస్కరం కాదు.

సృజనాత్మకమైన విముక్తి, తన ప్రయోజనాలను అతిశయించిన నూతన సూచనలేవో సదా అంకురింపజేస్తూ ఉంటుంది. విముక్తిలక్ష్యమే అనంత తత్త్వావిష్కరణం. ఆమె తన క్రియలలో పరిమితులను ఏర్పరుస్తుంది. కాని ఆ పరిమితులను శాశ్వతంగా నిలిపిఉంచదు. ఎప్పటికప్పుడు వాటిని భంగపరుస్తూ, ఆనిరంతరాద్భుత క్రియలలో అనంత తత్త్వాన్ని అభివ్యక్తం చేస్తుంది. దీనివలన. నిరంతపునరుజ్జీవనంతో, ఎప్పటికప్పుడు నూతనారంభాలతో, మౌలికమైన ఏదో ఒక ఆదర్శసత్యంతో పూర్ణతర సామరస్యం సాధించుడానికిగాను పదేపదే ప్రాచీనాచారాలను అధిక్షేపిస్తూ, వీటికి స్వస్తిచెపుతూ సాగే నూతన చరిత్ర ప్రారబ్ధమయింది.

విశిష్టమహత్తును సాధించడంకోసం నిరంతర కృషిలో నిమగ్నమైన మన నాగరకతలో ఏ అధ్యాయానికి ఆ అధ్యాయం ఆకస్మిక విపరిణామాలతోనే ప్రారబ్ధంఅవుతూ వస్తూంది. ఈనాగరకతలో పరిణామాలు, ఋతువుల క్రమంలోవలె కొత్త కొత్తపూలు కొత్త కొత్తపండ్లతో పాటుగా అంకురించే నవీనభావాల పర్యవసానంగా కలిగేవి కావు. అందువలన ఇంచుమించు ఈనాగరికతా చరిత్రలో ప్రతియుగము మహాసంరంభంతో మొదలవుతూంది. ఆమహాసాహసాలన్నీ రహస్యంగా పొంచిఉండి ఒక్కసారిగా బయట

పడి, విప్లవాత్మక సంస్కరణలను తెచ్చిపెట్టిన మహాశ్చర్యకరసంఘటనలు. సజీవాదర్శాలనే రాజవంశాలను తారుమారుచేసిన పరిణామాలు. ఆ ఆదర్శాలు భౌతికమానసికాచారాలు, చిహ్నాలు, ఉత్సవాలు, భూషణాలు మొదలైన ఏర్పాటులతో తమ సామ్రాజ్యాన్ని ఎంతకట్టుదిట్టంచేసుకొన్నప్పటికీ ఇట్టి సంఘటనలు జరుగుతూవచ్చినవి. ఇట్టి విప్లవాలు ఏ దేశంలో ఏ యుగంలో జరిగినా, అవి వాటి ఏకైక కేంద్రానికి సంబంధం లేకుండా పూర్తిగా వ్యస్తంగా జరిగినవికావు. చరిత్ర ఒక్కటే; అట్టి సంఘటనలన్నిటికీ చరిత్రలో స్థానం ఉన్నది.

ఇండియా చైనాలలోగాని, పర్షియా జుడాయియాలలోగాని, గ్రీస్ రోములలోగాని వర్ధిల్లిన నాగరకతలన్నీ భిన్న భిన్న ఔన్నత్యాలు, శీతోష్ణస్థితులు, వృక్షజంతుజాతులు కలిగిన ఒకేపర్వతశ్రేణిలోని వేరు వేరుపర్వతశిఖరాలవంటివి. వాటినడుమ పరస్పరసంబంధాలను అసాధ్యంచేసే అవరోధాలేమీ లేవు. అన్నీ ఒకేపునాదిపైన పెరిగినవి. వాతావరణంలో అవికలిగించే మార్పులన్నీ మనందరికీ సమంగానే అనుభవమవుతున్నవి. "మానవులందరికీ ముక్తికలిగితే తప్ప, నాకుముక్తి అవసరంలేదు" అన్న మహాప్రబోధకుని వాక్యంలోని తాత్పర్యానికి ఇదే ప్రాతిపదిక. మనమందరం ఒకే దివ్యతత్త్వానికి బంధువులము. ఆ దివ్యతత్త్వమే మనలోని

మహాత్ములను ఆవేశిస్తున్నది. ఆ దివ్యతత్వాన్ని వారు తమ వ్యక్తిత్వంలోనే సదా దర్శిస్తారు. "ఆ పరమాత్మకు, ఆ అమృత తత్వానికి, ఆ పరిపూర్ణతకూ నాకూ భేదములేదు," అని వారు ప్రకటిస్తారు.

మానవుడు తననుతాను సృజించుకొనే ఉద్యమంలో, తాను విశ్వజనీన మనుకుంటూన్న ఒక భావాన్ని అనుసరించి, తన సత్యస్థితికి ఒకప్రతిబింబాన్ని తనమనస్సులోనే రూపొందించు కొనడానికి ప్రయత్నిస్తున్నాడు. దానిని ఏ విధంగా వ్యక్తీకరించినా, అది శాశ్వతసత్యంగా నిలిచి పోతుందని కూడా అతని నిశ్చయం. ఇది జంతుప్రపంచానికి పూర్తిగా అనవసరమైన మనస్తత్వం. తన భౌతిక దేహానికి పరిమితంకాని జీవితంకోసం మానవుడు పడుతూన్న ఆరాటం ఇందులో వ్యక్తమవుతూంది. మనభౌతిక జీవితసూత్రం మన భూతకాల స్మృతులకు ముడిపెట్టుకొనిఉంది. మన ఆదర్శ జీవితమంతా భవిష్యత్తును గురించిన మనభావి స్మృతులపై ఆధారపడిఉన్నది. భూగర్భంలో పూడ్చిపెట్టబడిన ప్రాచీన నాగరకతా సీమలలో ఇటీవల త్రవ్వితీసిన శిథిలాలనుబట్టి ఎన్నియుగాలైనా తమస్మృతులను నిలిపి ఉంచడానికి నాడు పాపం వారుచేసిన దయనీయమైన ప్రయత్నాలు మనకు బోధపడుతున్నవి. ఈ ప్రయత్నాలు దూరాన ఎక్కడో ఉన్న అజ్ఞాతతీరాన్ని చేరాలనే తనకాంక్షను తన కాగితప్ప

పడవలో ఎక్కించి నీటిలో వదిలేబాలుని చేష్టను పోలినవి. మరి ఈ కాంక్ష దేనికి? నిత్యమైన, విశ్వజనీనమైన సత్యాన్ని వ్యక్తీకరించడం ద్వారా సర్వమానవులను, సర్వకాలాలను స్పృశించాలనే సహజప్రేరణ ఒకటి మనలో ఉండడంవలన దానిని వ్యక్తీకరించడానికి గాను మనం అద్భుతమైన పదార్థ సంపత్తిని సేకరించాము. శాశ్వతమైన విలువగల కార్యాచరణ విధానాన్ని రూపొందించుకున్నాము. ఇక, మర్త్యులమైన మనం అమరుడైన ఆ మహామానవునికి కప్పం కట్టాలి గద! అందుకోసం, జీవితంలో మనకు అవసరమైన దానికంటె అధికంగా మనమీ కప్పం చెల్లించాలి. ఆ ప్రయత్నంలో తరచు మనశక్తియుక్తులన్నింటిని, చివరకు మన ప్రాణాన్నికూడా బలిపెట్టడం సంభవిస్తుంది.

ఆటవిక మానవుడు తనను గురించి తాను ఊహించుకున్న ఆదర్శచిత్రానికి మెరిసేరంగులు, ఆడంబరమైన దుస్తులు, భీషణ భూషలు, అత్యుద్వేగ జన్యములైన వికృత వైకల్యాలూ కూడా కావాలి. ఆదర్శమానవుని ఘనతకు అవసరమని తాను విశ్వసించే విధంగా వ్యక్తిగతంగా తనను తాను రూపొందించుకోవాలని ఆటవిక మానవుని ప్రయత్నం. ప్రాకృతిక పరిమితులలోని తనస్థితితో అతనికి సంతృప్తిలేదు. తననుగురించి తనకు స్పష్టంగా తెలిసినదాని నంతటినీ మించిన విశిష్టత ఏదో తనలో ఉన్నదనే ప్రబలమైనభావం

అతనిలో ఉన్నది. ఆ విశిష్టతే తనకు విలువను, ఘనతను ఈయగలదనికూడా అతనితలంపు. అదేశక్తిసూత్రం. అతని ప్రస్తుత మానసిక దశననుసరించి అదే విశ్వసత్యపదార్థం — తాను దానికి బంధువుడుగనుక, స్వసుఖాన్ని త్యాగంజేసి అయినా సరే ఆ సత్యాన్ని తనలో ప్రదర్శించడమే తన పవిత్రకర్తవ్యమని అతనిభావం. దానిద్వారానే అతడు భగవంతునితో ఐక్యంకాగలడు. ఆటవిక మానవుడు అమితంగా శ్రమపడ్డాడు. తరచుదారుణమైన బాధలు అనుభవించాడు. అతని భగవంతుడు శక్తే; తదతిరిక్తుడుకాడు. ఆశక్తిని చిత్రవిచిత్రవర్ణాలతో, వికృతాకృతులతో, నిష్ఠురక్రూర విశృంఖల సాహసకృత్యాలతో తనలో ప్రతిభాసింపజేసుకొనడం కోసం ఆటవిక మానవుడు విపరీతంగా శ్రమపడ్డాడు. అందులో అనేకదారుణ వేదనలకు గురిఅయాడు. ఆ ముష్కర దర్పాడంబరాలు చూచిన స్వసంఘీయులందరికి అతనియందు గౌరవప్రతిపత్తులు ఏర్పడినవి. దానితోపాటుగా కలిగిన భయం వారికి ఒకవిధమైన రసానందం, సంతృప్తి కలిగించింది. వారికి తెలిసినంతలో ఆదర్శమానవుణ్ణి గురించిన ఒక చిత్రాన్ని అతని భయంకర దర్పంలో వారు సందర్శింపగలగడమే ఈ సంతృప్తికి హేతువు. అట్టి సాహసికునిలో అతని వ్యక్తినిగాక, తమకందరికీ ప్రాతినిధ్యం వహించే మహాపురుషుణ్ణి వారు చూశారు. తామెన్ని బాధలు పడు

తున్నా సహించారు. అద్భుతమైన అతని పరపీడన తృష్ణలో భయంకరంగా వ్యక్తమయే అసాధారణ సంకల్ప శక్తికి పరవశులై అతని అత్యాచారాలకు తాము గురిఅవుతున్నా హర్షించారు. అపరిమిత సంకల్పశక్తిని గురించి తమభావాలను వారు తమదేవతలకు సంకేతాలుగా చేసుకున్నారు. ఆ దేవతలు భౌతికంగా వికృతాకారులనీ, నైతికంగా అతి ప్రమాదకరులనీ, రక్తతృష్ణతో తమకు బలులుకావాలంటూ భయంకరమైన కోరికలు కోరతారనీ, వరాలు శిక్షలు ప్రసాదించడంలో విచక్షణలేకుండా యథేచ్ఛగా ప్రవర్తిస్తారనీ విశ్వసించారు. ఈ దేవతలు ఆధునికులైన అతివివేకులు కేవలం మనోదౌర్బల్యమని తిరస్కరించే జాలితో కూడిన మనసు పట్టింపులతో అక్రమంగా ప్రవర్తించారని నిందించడానికి వీలులేదు.

ఈ విధానమంతా ఎంత మొరటుగా కనిపించినా, ఒక్క విషయం మాత్రం మనం గ్రహించవచ్చు. మానవుడు తనకన్న విశిష్టమైన వ్యక్తిత్వంలో తన ప్రతినిధిని సందర్శిస్తున్నాడు. తాను అసమగ్రుడేకాని, అపరిపూర్ణుడు మాత్రం కాడనే చైతన్యం మానవునకు ఉన్నది. తనలోని ఏదోరహస్యార్థాన్ని తానింకా గ్రహించవలసి ఉన్నదని నిరంతరం మానవుడు అనుకుంటున్నాడు. ఇందులో మనం ఆశ్చర్యపడేదేమీ లేదు. మానవునిలోని మొరటుతనం నిత్యమైనది కాదని

దాని పరిమితులు దిక్చక్రపు సరిహద్దులవంటివనీ మనకు స్పష్టంగా తెలుసు. మానవునిలోని అంతస్సత్యం యొక్క ఆదేశం ప్రబలంగా వినిపిస్తూంది. ఆ సత్యం మన ప్రత్యక్ష జ్ఞానానికీ, మన హేతువాద వివేచనకూ అతీతమైనది. ఈ మానవోత్తముని గురించిన సత్యాన్ని సర్వాత్మనా విశ్వసించిన వ్యక్తు లనేకమంది జన్మించారు. మన చైతన్యం ఆవిషయాన్ని గురించి పర్యాలోచించిన కొలది మనలో ఉదాత్త నూతన ప్రమాణాలు, విలువలు రూపొందుతున్నవి. అగాధసీమలు, సున్నితకోణాలూ విశదమవుతున్నవి; ఆడంబరతను, ఉన్మత్తోద్వేగాలను, రూపవర్ణ వచః ప్రవర్తనలలో దౌర్జన్యమునూ, కూక్లక్స్ క్లాన్ (అమెరికాలో వర్గవిద్వేషులైన హంతలరహస్య సంస్థ) ధోరణినీ పరిత్యజించడంద్వారా వివేక వంతమైన ఉదాత్త ప్రవర్తన అలవడుతున్నది.

ప్రతియుగము ఏవో కొన్ని కలలు కంటూ, కొన్ని ఉదాత్తభావాలను వ్యక్తీకరిస్తూంది. ఈ భావాలలోనే ఆ యుగపు వ్యక్తిత్వం వ్యక్తమవుతూంది. ఆ భావాలే దానిని శతాబ్దులనే అభ్యంతర గిరి శృంగాలను అధిగమింపజేసి, ఖండమధ్యస్థమైన శాశ్వతమానవ చరిత్ర అనే పీఠభూమికి చేరుస్తవి. ఈ భావాలు కేవలం మతసంబంధులే కానవసరంలేదు. అయినా పరోక్షంగా వాటికి మానవుని మతంతో సంబంధం ఉన్నది. అవి ఆయాజాతుల వ్యక్తుల ముఖతః ఆ

మహామానవుని చైతన్యంలోనుండే వెలువడినవి. ఈ చైతన్యం విజ్ఞాన శాస్త్రాలలోగాని, తత్వశాస్త్రంలోగాని, కళలోగాని, సాంఘికధర్మాలలోగాని, తమంత తాముగా శాశ్వతమైన, ప్రయోజనకారులైన ఇతర విషయాలలోగాని వ్యక్తం కావచ్చు. ఇవన్నీ ఆధ్యాత్మికమైనవే. వాటినన్నిటినీ ఒకే విశ్వమానవుని మహామతంగా గుదిగుచ్చుకోవాలి. ఆ విధంగా, మానవుడు భావనలలోను, కర్మలలోను, కలలలోను, శాశ్వత కళాచిహ్నాలలోను తన అస్తిత్వ గౌరవాన్ని వృద్ధిచేసుకోవాలనే ఆసక్తిని వ్యక్తంచేస్తూ ఆపరిపూర్ణతత్వాన్ని అందుకొనడానికి నిరంతరం చేస్తున్నకృషి అట్టి విశ్వమానవమతంలో అభివ్యక్తం అవుతుంది.

నేను ఒక పర్యాయం ప్రాచీన రోమునగర శిథిలాలను చూడాలని వెళ్ళాను. అపరిమితత్వం కోసం మానవుడు పడే తపనకు చిహ్నాలైన ఆశిథిలాలు నామనస్సును స్తంభింపజేసినవి. విశాలమైన రోమకమహాసామ్రాజ్యాన్ని గురించి భావన ఆనాటి ప్రజల సృజనాత్మకభావాలను రంజింపజేసింది. కారణం: ఆ మహా మానవతావ్యక్తిత్వంలోకి వారావిధంగా తొంగిచూడగలగడమేనని నిస్సందేహంగా చెప్పవచ్చు. ఆ సామ్రాజ్యవిస్తరణకాంక్ష కేవలం జనాభావత్తిడిని తగ్గించుకొనడానికి, లేదా వ్యాపార సౌకర్యవిస్తృతికి సాధనం అనడానికి వీలులేదు. అది రోమక జాతీయ

వ్యక్తిత్వ ఘనతకు మూర్తిమంతమైన నిదర్శనం. ఆదర్శ మానవునకు అర్హమైన నివాసస్థలంగా ఈ ప్రపంచ మంతటినీ పునఃసృష్టి చేయాలని ఆ జాతీయాత్మ పడిన తపనకు అది నిదర్శనం. మానవుని వాస్తవ స్వరూప మేమిటి? అన్న చిరంతనప్రశ్నకు జవాబు చెప్పడానికి అది రోమకజాతి చేసిన భీమప్రయత్నం. ఈప్రశ్నకు చెప్పబడిన ఏ ప్రత్యుత్తరమైనా దాని స్వభావం ఎట్టిదైనా, మత పరిధిలోకే వస్తుంది. ముఖ్యంగా ఈ ప్రత్యుత్తరం పరమార్థతః, ఏదో ఒకేజాతికి వర్తించేది కాదు; మన కందరికీ వర్తిస్తుంది. మానవ ప్రపంచ చరిత్ర నిర్మాత కావడానికి కృషిచేసిన రోము ఈప్రశ్నకు పరిపూర్ణమైన ప్రత్యుత్తరం ఇచ్చి ఉండకపోవచ్చు. అయినా "ఘనతయే సౌఖ్యము" (భూమైవ సుఖమ్) అని చెప్పగలిగిన అకుంఠిత మానవశక్తియొక్క అద్భుత సామర్థ్యాలను రోము ప్రదర్శించింది. ఆ మహాసామ్రాజ్యం ఏనాడో తునాతునకలై విచ్ఛిన్నమైపోయింది. కాని, మానవుని మహనీయతలో రోమనుల విశ్వాసం మాత్రం మానవమనోంతరాళాలలో శాశ్వతమైన ముద్రవేసింది. ఈ విశ్వాసమే రోమనుల వాస్తవమైన మతదృష్టి. రోమనుల తత్వశాస్త్రంలో ఈ దృష్టి అస్ఫుటంగా ఉండి, అది వారి విరామ సమయ రంజక క్రీడగా ఉపయోగపడుతూఉండవచ్చు. కాని అదివారి వ్యక్తిత్వాలను ఉత్తేజపరచలేదు. నిజానికి రోమక తత్వశాస్త్రం

ఆ జాతి వ్యక్తిత్వానికి తగినంత విరివిగా వికసింపలేదు. అందువల్ల, అది వారి జాతీయాభిమతానికి కొంతవరకు విరుద్ధంగా కూడా పరిణమించింది. అనంత తత్వ రంగ స్థలంలో తన మానవత్వ శక్తిని వ్యక్తం చేయడమే ఆమత లక్ష్యం. ఒక జాతి మతాన్ని మనం అర్థం చేసుకోవాలంటే వాళ్ల దేవుళ్లను గురించి తెలుసుకొని ప్రయోజనం లేదు. తన అనంతత్వాన్ని గురించి కలలు కని, విపత్తులను వినాశాన్నీ కూడా లక్ష్యపెట్టకుండా దానికోసం సగర్వంగా సదా కృషి చేసిన ఆ జాతీయ మానవుణ్ణి గురించి తెలుసు కోవాలి.

జీవజగత్తులో అస్పష్టమైన తేజో మేఘ శకలం వలె ఉండిన చైతన్యం, మానవునిలో ఘనీభవించి, కేంద్రీకృతాత్మగా రూపొందిన నాటినుండి మానవ చరిత్ర ప్రారంభమయి అతి త్వరితగతిని తన అధ్యాయాలను నడుపుకొని పోతూంది. మానవుడు తన ఆత్మచైతన్యంలోనుండి ఉద్భవించే "నేను ఎవడను?" అన్న ప్రశ్నకు నానా రకాలుగా చెప్పుకునే కష్టసాధ్యములైన సమాధానాల చరిత్రే నిజానికి మానవ చరిత్ర. జంతువులకువలె మానవునకు సంతృప్తి లేదు. అతని సౌఖ్యం, అతని శాంతి ఈ ప్రశ్నకు తాను చెప్పుకునే ప్రత్యుత్తరంలోని వాస్తవికత మీదనే ఆధారపడి ఉన్నది. పశుస్వభావాన్ని సంతృప్తి పరచగల భౌతిక పర్యాప్తియే జంతువులు సాధించగల విజయం.

మొసలి తన బ్రతుకు తాను బ్రతకడానికి అభ్యంతర మేదీ కలగకపోతే, హాయిగా పళ్లికిలించి నవ్వుతూ ఒళ్ళు పెంచుకుంటుంది. దాని కింక లేదనుకోవలసిం దేమీ లేదు. అలాగే మానవుడుకూడా మానవుడుగా ప్రవర్తించ గలిగితే, అతడు తన సత్యాన్ని తాను తెలుసుకొన గలుగు తాడని చెప్పవచ్చు. కాని, మానవుడు ఆందోళనతో "మానవుడుగా ప్రవర్తించడం అంటే ఏమిటి? అసలు నే నెవణ్ణి?" అంటూ కంగారుగా ప్రశ్నించుకుంటున్నాడు. పులిగా తన స్వభావమేమిటో తాను తెలుసుకునే అవకాశం పులికి లేదు. నిజానికి, తన శరీరాన్ని అలంకరించే ఉన్ని అంగీ రంగును తన అభిరుచికి అనుగుణంగా మార్పు చేసు కొనడమే పులికి చేతకాదు.

అయితే, మానవుడు అనేక శతాబ్దులుగా స్వస్వభావా న్నిగురించి తర్కించుకుంటున్నాడు. ఇంతవరకు నిర్ణయ మేమీ తేల్చుకోలేదు. తనను తాను సమాధాన పరచు కొనడానికి బ్రహ్మాండమైన మతాలను స్థాపించుకుంటున్నాడు. తనకన్న తాను అధికుడనని మానవుని అభిప్రాయం. విపరీతమైన ఈ సహజభావానికి విరుద్ధంగా, వివిధమత సిద్ధాం తాలతో తననుతాను సమాధాన పరచుకోవాలని ప్రయత్ని స్తున్నాడు. ఈ ప్రయత్నాలలో ఒక విశేష మేమిటంటే, మానవుడు తనను తాను వాస్తవంగా తెలుసుకొనడం కోసం

నిజంగా తనకంటె అన్నివిధాలా అత్యధికుడై తనతో బాంధవ్యంగల ఒక మహావ్యక్తిని భావిస్తున్నాడు. ఈ మతాలు వివరాలలోను, తరచు నైతిక ధర్మాలలోను కూడా భేదిస్తున్నవి. కాని, అన్నింటిలోను ఒక సామాన్య ధోరణి మాత్రం ఉన్నది. అన్నిమతాలలోను మానవసాదృశ్యం గల మహావ్యక్తిలో తమపరమార్థాన్ని తెలుసుకొనడానికే మానవులు ప్రయత్నిస్తున్నారు. ఆ వ్యక్తికే మతాలన్నీ దేవుడని పేరుపెట్టినవి. అతి శాస్త్రదృష్టి గల బుద్ధికి ఇదంతా ఛాందసంగా, పరిహాసాస్పదంగా కనిపించవచ్చు. కాని, మతం కేవలం ప్రాకృతికం గాని, ఆరూపభావన గాని కాదని అట్టివారు గ్రహించాలి. మానవునిలో బ్రహ్మసాక్షాత్కారం లభించినప్పుడే మతం సార్థక మవుతుంది. లేనినాడు కేవలం నిరర్థకం.

మతం ఈ విధంగా మానవుణ్ణి దివ్యపథానికి ఎత్తడంవల్ల మూఢాచారాలకు, నైతిక పతనానికి, అసహ్యకరమైన కళాదృష్టికి దారితీయగల విపరీత సంప్రదాయాలు ప్రబలవచ్చునని ఒప్పుకొనక తప్పదు. కాని, ఇవి దుష్టసమాధానాలు. వాస్తవమానవతను ఇవి వికృతంచేస్తున్నవి. కనుక, సాంఘిక ఆర్థిక రాజకీయ రంగాలలో జరిగే అట్టి దోషాలను ఎదుర్కొనినట్టే వాటినీ ఎదురుకొని నివర్తించాలి. వాటి పాశ్చాత్యాలను మానవుని పరిపూర్ణతను బట్టి గ్రహించాలి.

గాని, మానవవివేకమనే న్యాయమూర్తి చెప్పే తీర్పునకు లోబడి నిరంకుశ మత శాసనాలదృష్ట్యా స్వీకరించ కూడదు. ప్రముఖ మతాలన్నీ ఇందుకోరకు జరిగిన ప్రబలమైన విప్లవాల ఫలితంగానే ఉద్భవించి, మన ఆచార వ్యవహారాలలో ప్రధానమైన మార్పులు తీసుకువచ్చినవి. ఇట్టి మతాలన్నీ అంతకుపూర్వం ఉండిన మతాల అమానుష విధానాలను ప్రతిఘటించడానికే అవతరించినవి. ఆ మతాలలో ఆచార వ్యవహారాలు, బాహ్యాడంబరాలు విపరీతంగా ప్రబలిపోవడం వల్ల అట్టి సంస్కరణ అవసరమయింది. అట్టి మతాలు, లోగడ నేను చెప్పినట్లు, శక్త్యారాధనప్రాధాన్యం కలవి. వాటివలన మనకు ప్రయోజనం కలుగకపోలేదు. కాని ఆ ప్రయోజనం సత్యమార్గాన మనం పరిపూర్ణత సాధించుకొనడానికి సహాయపడేది కాదు. భగవంతుని అనుగ్రహాన్ని సాధించడంద్వారా మనశక్తి సంపదలను వృద్ధి చేసుకొనడానికి మాత్రం అది ఉపకరిస్తుంది.

బహుశః నేను మనపూర్వులపట్ల అపరాధం చేస్తున్నానేమో! వారు శక్తిని ఉపాసించింది కేవలం తమ భౌతిక ప్రయోజనాల నాశించి కాదేమో! వారిదృష్టిలో, శక్తే పరమసత్యమని, ఆ శక్తితో తమ శక్తికి సంబంధం ఉన్నదని ఆ శక్తిలోనే తమ శక్తికి పరిపూర్ణత కలుగుతుందని కూడా వారు విశ్వసించి ఉండవచ్చు. ప్రకృతి వెనుకనుండి నాటక

మాడిస్తున్నది అవ్యక్తమైన వైపరీత్యం కాదనీ, సదా సక్రమ ఫలితాలు కలుగుతూండటం అహేతుకం కాదనీ, ఆ మహా సంకల్పశక్తే ప్రకృతివెనుక ఉండి దానిని నడుపుతున్నదనీ వారు భావించి ఉండవచ్చు. అలాకాక, మనస్సుగాని, హృదయంగాని, లక్ష్యంగాని లేని అరూపశక్తిని, తమ శక్తికన్న అతినికృష్టమైన శక్తిని వారు ఆరాధించారంటే, వారు జాత్తుగా మనస్స్వాస్థ్యంలేని మూఢులని మనం అంటున్నామన్న మాట.



# ౮. ఆధ్యాత్మికైక్యము

మానవుడు జీవనోపాధి కోసం తంటాలు పడవలసిన అగత్యం కొంత తగ్గిన మీదట, తన అద్భుతావహమైన ఆత్మను గురించిన విచారణకు పూనుకొనడానికి తగిన విరామం అతనికి లభించింది.

తన వాస్తవ వ్యక్తిత్వానికి అనంత మానవవిశ్వంతో సంబంధం ఉన్నదనీ, అందులోనే తన వ్యక్తిత్వానికి పరిపూర్ణత లభించగలదనీ అతడు ఆశించడ మారంభించాడు. ఆదిలో కేవలం ప్రకృతి శక్త్యారాధనే ప్రాతిపదికగా రూపొందిన అతని మతం క్రమంగా ఉన్నత స్థాయి నందుకొని, వ్యక్తి గతమైన మానవతా సత్యమునే ప్రాతిపదికగా జేసుకొన్నది. ఈ విధంగా మతం, అనంత తత్త్వాన్ని గురించిన మన చైతన్యావరణను సంకుచిత పరుస్తున్నదని కించ పడవలసిన పనిలేదు.

పదార్థాల పరిమితులను ఎడ తెగకుండా విస్తృతం చేసుకుంటూ పోవడమనేది అనంతతత్త్వాన్ని గురించిన అపసవ్య భావన; అనగా ఆ అనంతత్త్వాభిముఖమైన నిరంతర గమనం. మన ప్రపంచం పరిమితావరణలోనే ఉన్నదని గణితశాస్త్రజ్ఞులు తీర్మానించినట్లు చెప్తున్నారు. ఇందులో మనం ఆందోళన పడవలసిన దేమీ లేదు. అందువలన కలిగిన

లోపమూ ఆట్టే లేదు. ఋజురేఖ తన ఋజుత్వం నిలబెట్టు కొనలేదనీ, తిరిగి తాను పుట్టిన చోటుకి వచ్చి చేరే స్వభావం దానికి నిత్యంగా ఉన్నదనీ చెప్పినా, విశ్వావరణను గురించి మనం నూనభావం ఏర్పరచుకొనవలసిన పనిలేదు. హైందవ స్మృతులు ఈ విశ్వం అండాకారంలో ఉన్నదని చెపు తున్నవి. అనగా, మానవుని మనస్సు దృష్ట్యా దానిచుట్టూ గోళాకారంలో పరిమితి అనే పెంకు ఉన్నదన్నమాట. కాలం కూడా నిరవధికం కాదనీ, మన విశ్వం అప్పుడప్పుడు అంతమై పోతూ తిరిగి తన ఆవృత్తిని ప్రారంభిస్తూ ఉంటుందనీ హైందవ స్మృతులు చెపుతున్నవి. అనగా, కాలావరణల మండలంలో శాశ్వతత్త్వంలోనే నిరంతర పునరావృత్త్యాత్మక మైన అశాశ్వత తత్వం ఉన్నదని గ్రహించాలి.

అయితే, శాశ్వతత్వంయొక్క సవ్యభావన "అద్వైతం" – అనగా పరిపూర్ణైక్యభావన – లో ఉన్నది. ఆ ఐక్యము బహు వస్తు పూరితమైన బాహ్య భాండం వలన కలిగినదికాదు. అర విందసౌందర్యం ఆ పూవులోని విడిభాగా లన్నింటికన్న సహస్రధా విలువగలది అయినట్లే, ఈ విశ్వాంతర్భాగా లన్నింటినీ అతిశయించిన ఆంతస్సామరస్యం వలన సిద్ధ మయిన ఐక్యం ఇది. ఆ శాశ్వతతత్వంయొక్క సవ్యభావనను మనలో ఆనందంగా, ప్రేమగా వికసింపజేస్తున్నది ఈ గాథ

తైన సామరస్య గుణమేగాని, విశ్వంయొక్క అపార విస్తృతి కాదు. అద్వైతమే ఆనందం; అపరిమేయుడే అమృతానంద రూపుడు. ఆధ్యాత్మిక భావన మందగించిన వారిలో మాత్రమే అపార భౌతిక సంపత్సమీకరణం ప్రధానలక్ష్యం అవుతుంది. ఈ అపారతా తృష్ణకు లక్ష్యములు ఉదాత్తతా మహనీయతలు కావు. కేవలం పరిమాణ విస్తారతలు. యథార్థాధ్యాత్మిక వికాసం, పరిమాణతః కాని, సంఖ్యామానంతో గాని నాణెం చేయదగినదికాదు. శాశ్వతమైన సత్యం ఈ ప్రగాఢ సంబంధాలతో కూడిన ఐక్యభావాదర్శంలోనే ఇమిడి ఉన్నది. ఈ సత్య సాక్షాత్కారం విశ్వావరణలో కలిగేది కాదు; ఎవరి ఆత్మలో వారికి కలుగవలసినది.

"ఏకధైవానుద్రష్టవ్యమ్ ఏతత్ అప్రమేయమ్ ధ్రువమ్" ఈ అప్రమేయమైన అనంత తత్త్వం ఏకమని తెలిసికొనవలెను. "పర ఆకాశాత్ అజ ఆత్మా" అనాదియైన ఆత్మ ఆకాశావరణకు వెలుపల కూడా ఉన్నది. అదే పురుషుడు.

భారతీయ మతములలోని విలక్షణ దృక్పథం 'యోగ' మనే శబ్దంలో వ్యక్తమవుతున్నది. యోగమనగా ఐక్యము చేయుటం. ఐక్యభావమును కలిగి ఉండటంకాదు. ఐక్యమై ఉండటం. సత్యాన్ని సాధింపదగినది అని అంటే, సత్యము విడిగా నున్నదని అంగీకరించటమే. సత్యస్థితి అనగా సత్య

ముతో ఏకమై ఉండటం. భగవంతునితో మన సంబంధాన్ని నిర్వచించే కొన్ని మతాలు, ఆ సంబంధాన్ని సత్యమైనదిగా నిలిపి ఉంచుకుంటే, మనకు మేలు కలుగుతుందని హామీ ఇస్తున్నవి. ఈ ప్రతిఫలము బాహిరమైన విలువ గలది. విధ్యుక్తమార్గాన్ని అనుసరించడానికి ఈ ప్రతిఫలం మనకు బాహిరమైన అన్యహేతువును చూపుతున్నది. మన భారత దేశంలో కూడా ఇట్టి మతాలు ఉన్నవి. కాని, అంతకన్న ఉదాత్తస్థాయిని అందుకొన్నవారు పరమాత్మ అయిన నారాయణునితో ఐక్యానుసంధానం కోసమే తపస్సు చేస్తున్నారు.

ఈ పరమాత్మతో మన ఐక్యము మనస్సుచేత పొంద దగినది కాదు. మానవశరీరంలో మనస్సు స్వార్థసంరక్షణా శాఖాధికారి. మనచైతన్యాన్ని మనస్సు సదా తన విహా రావరణలోనే నిలిపి ఉంచుకొని, అందులోనే దృశ్య జగ త్తుతో మన సంబంధాలకు అవకాశం కల్పించాలని చూస్తూ ఉంటుంది. మనస్సు ఏర్పరచిన ఈ పరిమితులను మనం అధిగ మించడానికి తోడ్పడడమే యోగానికి లక్ష్యం. ఆ విధంగా అధిగమించ గలిగిన సమయంలో మన అంతరాత్మ పరమానం దానుభూతి పొందుతుంది. అనగా, అట్టి విముక్తి పొందడం వలన మనకు సత్యానుభూతి కలుగుతుంది. అదే పరమలక్ష్యం; అదే దివ్యానుభూతి.

ఒకనాడు మానవుడు ఆ అనంతతత్త్వాన్ని జగజ్జ్యోతిలో సందర్శించాడు; ఆదిత్యారాధన చేశాడు; హవిస్సులతో అగ్నిని ఆరాధించాడు. పిమ్మట, కాలముయొక్క సృజనాత్మక రూపమైన ప్రాణంలోనే అతడు ఆ అనంతతత్త్వానుభూతిపొంది, "యత్కించ యదిదం సర్వం ప్రాణ ఎజేతి నిస్సృతం" (ఇచట గల సకలము ప్రాణములోనుండియే బాహిరిలుచున్నది; అందే స్పందించుచున్నది), అని ప్రకటించాడు. ఆ విషయంలో అతనికి ఏవిధమైన సంశయంలేదు. తనలో ప్రత్యక్షంగా ఉన్న ప్రాణరహస్యమే సాధన సూత్రానికి, సువ్యవస్థిత సంకల్పానికి, సర్వక్రియాశక్తికి ఆటపట్టని అతడు గుర్తించాడు. సత్యముయొక్క పరమార్థానికి తన నిర్వచనం ఈ ప్రాణశక్తి తనకుచేసిన సూచనపైనే ఆధారపడి ఉన్నది గాని, నిర్జీవ మూక జగత్తుపై కాదని మానవుడు గ్రహించాడు. పిమ్మట, మరికొంత అంతర్వీక్షణం చేసుకొన్నమీదట, "రసోవైసః" (ఆ అనంతతత్త్వమే – ఆనంద హేతువైన – ప్రేమ) అని నిర్ధారణ చేసుకున్నాడు. ఆ అనంత తత్త్వాన్ని సాక్షాత్కరింప జేసుకొనడమే లక్ష్యంగా గల అతని మతం ఆదిలో అవ్యక్తికమైన, జ్యోతిర్నిలయమైన దివము (ఆకాశము) నుండి తనయాత్ర ప్రారంభించింది. క్రమంగా, కాలావరణలో ఆత్మసృష్టిశక్తికి ప్రతినిధియైన ప్రాణం వద్దకు చేరుకొన్నది. చివరకు ఆయాత్ర కాలాతీత

మైన ప్రేమమయుడైన "పురుషుని" లక్షించడంతో ముగిసింది. "తమ్ వేద్యమ్ పురుషమ్ వేద" (తెలుసుకోన దగిన ఆ పురుషుని తెలుసుకోనుము); "యథామావో మృత్యుః పరివ్యథాః" (ఆ విధముగా మృత్యువు మనకు దుఃఖహేతువు కాకుండ పోవును), అని ఆ మతం హెచ్చరించింది. ఈపురుషుడు అమరుడు; అతనిలోనే వ్యక్తిగతాత్మ తన శాశ్వత సత్యమును సాక్షాత్కరింప జేసుకుంటుంది. ఆ పురుషుని గురించి శ్రుతులు ఈ విధంగా చెప్తున్నవి: "ఏష దేవో విశ్వకర్మా మహాత్మా సదా జనానామ్ హృదయే సన్నివిష్టః", (ఈ దేవుడే విశ్వకర్త, మహాత్ముడు, సర్వమానవ హృదయాలలోను సదా నివసించువాడు).

"య ఏతద్విదు రమృతాస్తే భవన్తి", అతనిని తెలుసుకొన్నవారు అమరులగుదురు. ఈ అమరత్వ మాయుష్కాల సంబంధికాదు, పూర్ణసత్యసంబంధి.

సర్వమానవుల హృదయములలోను ఉంటూ, విశ్వకార్యకర్తయైన ఆ పురుషునితో మన ఐక్యంలో నిర్వ్యాపారతకు తావులేదు. ఆతనితో ఐక్యంకావాలంటే స్వార్థపరమైన కార్యకలాపాలను పరిత్యజించి మనం కూడా అందరికొరకు పాటుపడే విశ్వకార్యకర్తలం కావాలి "అందరికొరకు" అనగా, అసంఖ్యాకులయిన మానవవ్యక్తు లందరికొరకని కాదు నా అభిప్రాయం. కర్మ ఏదయినా, ఎంత

స్వల్పమయినదయినా స్వభావతః విశ్వజనీనమైనది. అట్టి కర్మ అందరికి శ్రేయస్కరుడైన విశ్వకర్మ సాక్షాత్కారానికి ఉపకరిస్తుంది. ఆ మహాత్మతో ఏకం కాగోరే వ్యక్తి ఆత్మోన్నతిని సాధించుకోవాలి. ఆ ఆత్మోన్నతి ఫలితంగా అతను తన ఆత్మతోనేగాక, మానవులందరి ఆత్మతో ఐక్యం పొందాలి. దీనివలన బుద్ధుడు బోధించిన "బ్రహ్మ విహారము"నకు (అనంత తత్త్వములో జీవించుట) తాత్పర్యం మనకు బోధపడుతుంది. దానిని బుద్ధుడు ఇలా వివరించాడు :

"ఒకరినొకరు మోసగించుకోనకండి. ఎన్నడూ ఎవరినీ కించపరచకండి. కోపంతో శారీరకంగాగాని, వాక్కుచేగాని, భావాలచేగాని ఎవరికీ వేదన కలిగించకండి. తల్లి తన ఏకైక పుత్రుని ప్రాణప్రదంగా సాకుకొన్నట్లు సర్వజీవులపట్ల అపరిమిత ప్రేమభావమునే ప్రసరింప జేయండి."

"మీపైన, మీక్రింద, మీకు అన్నివైపులగల విశ్వమంతటిపైన సానుభూతిని, అపరిమిత ప్రేమభావమును ప్రసరింపజేయండి. ఆ ప్రేమలో అభ్యంతరము లుండకూడదు, హాని కలిగించవలెననే సంకల్ప ముండకూడదు, వైరభావన ఉండకూడదు."

"నిలబడి ఉన్నా, నడుస్తూ ఉన్నా, కూరుచున్నా, పరుండిఉన్నా, నిద్రావివశులము యేవరకు ఈ భావములోనే ప్రవర్తించడం 'బ్రహ్మవిహారము."

అనంత తత్త్వాన్నిగురించి బుద్ధుని అభిప్రాయం, అపరిమిత విశ్వచైతన్యశక్తినిగూర్చిన భావనకాదనీ, సహృదయతా ప్రేమలతో గూడిన సవ్యాదర్శముగల అనంత తత్త్వమును గురించిన భావన అనీ ఇందువలన రుజు వవుతున్నది. సహృదయత, ప్రేమ మానవతా సంబంధులుగద! మంచితనము, ప్రేమ, ఔదార్యము కలిగి ఉండటం వలన మనకు అనంత తత్త్వ సాక్షాత్కారం కలిగేది మహాపర్వతాలలోను, నక్షత్రమండలంలోను కాదు; మానవునిలోనే అది మనకు లభ్యమవుతుంది. నిర్వాణమే పరమపదమని బుద్ధుని బోధనలు తెలుపుతున్నవి. దాని స్వభావాన్ని గ్రహించాలంటే, దానిని సాధించేమార్గాన్ని తెలుసుకోవాలి. కేవలం దురాలోచనలు, దురాగతాలు చేయనంతమాత్రాన సరిపోదు; ప్రేమ పరిమితులన్నిటినీ అధిగమించడం కూడా ఈసాధనకు అవసరం. అనగా, ఆత్మను సత్య సంశోధితం చేయడం. ప్రేమే ఆ సత్యం. ఆ ప్రేమ మన సానుభూతికి, సేవకు పాత్రులు కావలసిన వారందరినీ తన హృదయంలో ఐక్యం చేస్తుంది.

అస్తిత్వానికి ఆదిమకారణ మేమిటని బుద్ధదేవుని ఒకరు ప్రశ్నించారు. అట్టి ప్రశ్నలు ప్రయోజనరహితములనీ, అనవసరములనీ, ఆయన గట్టిగా మందలించాడు. ఆ విషయము మానవలక్ష్యానికి, తదావరణకు బాహిరమైన

చనేకదా ఆయన అభిప్రాయం! విశ్వతత్త్వశాస్త్రంలోగాని, విజ్ఞానశాస్త్రంలోగాని ఆ ప్రశ్న సమంజసమైనది కావచ్చు. కాని మానవుని ధర్మానికి, అంతరంగ స్వభావానికి దానితో సంబంధంలేదు. ఈ అంతస్స్వభావంలోనే ప్రేమ తన పరిపూర్ణతను సిద్ధింపజేసుకుంటుంది. అందులోనే మానవుని త్యాగాలన్నీ శాశ్వతమైన ప్రతిఫలంగా పర్యవసిస్తవి. సర్వవ్యాప్తమయిన సూర్యకాంతి ఉండగా, చిన్నదీపికను ఆర్పివేయడం వలన కలిగే నష్టమేమీ ఉండదు. ఆ మహాప్రవక్తబోధనలు విన్నవారందరు, కేవలం ఆయనమాటలు విని, ఆయన సిద్ధాంతాలను గ్రహించడానికి ప్రయత్నించారా? లేదు. ఆయన బోధనల లక్ష్యాన్ని వారు ఆయనలో ప్రత్యక్షంగా చూశారు. ఆ సిద్ధాంతాలన్నిటికీ ఆయన జీవితమే ప్రత్యక్ష సాక్షిగా వారికి గోచరమయింది. మానవతా పరమసత్యం ఆయనలో మూర్తిమంతమై వారికి సాక్షాత్కరించింది.

మహామతాలన్నీ వ్యక్తుల జీవితాలలోనే ఉదయించినవి; ఆ వ్యక్తులు తమ జీవితాలలో ఒకానొక సత్యానికి ప్రాతినిధ్యం వహించారు. కనుక, అవి విశ్వతత్త్వవివరణలుగాని, నైతికేతరములుగాని కావు: కేవల మానవత్వానికి, మంచితనానికి సంబంధించినవి – అని మనం ముఖ్యంగా జ్ఞాపకం ఉంచుకోవాలి. ఈ మానవతానైతిక ప్రవృత్తులే

మతాన్ని రాకాసిశక్తి ఐంద్రజాలిక హస్తాలనుండి విముక్తం జేసి, మానవుని అంతరంగంలోకి తీసుకువచ్చినవి. ఆపైన మతం కేవలం వ్యక్తుల అదృష్టైశ్వర్యసాధనకు పరిమితం కాక, సర్వమానవశ్రేయస్సాధకం అయింది. ఈ మతం లక్ష్యం ఏకాంతాత్మల ఆధ్యాత్మికానందం కాదు; సర్వజాతులకు, సర్వమానవకోటికి ఆధ్యాత్మిక విముక్తి. మహాత్ములు విశ్వమానవసందేశహరులుగా సర్వమానవసీమలలో అవతరించి, ఆ అమరపురుషునితో, దివ్యమానవునితో పరిపూర్ణమైన బాంధవ్యం ఏర్పరచుకొనడం ద్వారానే విముక్తి సాధ్యమవుతుందని బోధించారు, భగవంతుణ్ణి గురించి వారేమి సిద్ధాంతాలు చేసినా, లేక ఆ కాలంలో వాడుకలో ఉండిన సిద్ధాంతాలను, సంప్రదాయాలను స్వీకరించినా వారి జీవితాలు, బోధనలు ఒక మహావ్యక్తికి సంబంధించినవి. అతడే మానవునిలోని అనంతుడు, మానవజనకుడు, మిత్రుడు, ప్రేమికుడు. మానవజాతి అంతటినీ సేవించడంద్వారా అతనిని మనం సేవించగలం. మానవునిలోని భగవంతుడు తన ప్రేమను పరిపూర్ణంచేసుకొనడానికి మానవుల సేవా ప్రేమలే ఆధారం.

భారతదేశంలో సనాతనారణ్యచ్ఛాయలలో ఒక ప్రశ్న ఉదయించింది.

"కస్మై దేవాయ హవిషా విధేమ?"

'మనము అర్చించ వలసినది ఏ దేవుణ్ణి ?'

"ఈ ప్రశ్న ఇప్పటికీ మనను వేధిస్తున్నది. దానికి ప్రత్యుత్తర మీయడానికి, మనం మన ప్రేమగాఢతను, మానవత్వమును గురించిన విజ్ఞానపరిపక్వతను సాధించాలి. కారుణ్యదృష్టివల్లనే కాదు; శాస్త్రవిజ్ఞానసంపన్నను, సృజనానందంవల్లను, ధీరోదాత్తతలోని వేదనవల్లను దానిని మనం సాధించాలి. "తేన త్యక్తేన భుంజీథాః" (త్యాగము వలన అతని భోగించుము) – ఈ త్యాగము ప్రేమజన్యము. "మాగృధః" (ఆశపడకుము). ఈ ఆశే నీమనస్సును నీ వ్యక్తిగతాత్మ అనే మాయాజాలంలో కిలాగి, సత్యవిముఖం చేస్తుంది; పరమపురుషునకు నీవు ప్రతినిధివనే సత్యాన్ని నీవు గుర్తించకుండా చేస్తుంది.

ఆ విశ్వాత్మలక్షణమైన పరమ సత్యమునుండి ఆశే మన చైతన్యమును కేవల ఐహికప్రయోజనాల వంకకు మళ్ళిస్తుంది. ఆ విధంగా వెనుకముఖం పట్టిన ఆత్మవాహినిని అవిచ్ఛిన్న ఐశ్వర్య స్రవంతితో పూరించుకోవాలని ప్రయత్నిస్తాం. ఈ స్రవంతికి పూరింపగల శక్తి ఉంటే ఉండవచ్చు. కాని, ఐక్యం చేయగల శక్తిగాని, సృజనశక్తిగాని లేవు. అందువల్ల, ఆలోపం మధ్యలో వస్తుసంపద అనే మెరిసే ఇసుకఊబిదిబ్బల క్రింద కనపడకుండా ఉంటుంది. మనం గాఢనిద్రా వివశులమై ఉన్నప్పుడు ఆ వస్తుభారం వల్లనే ఆ ఊబి మనలను కబళించి వేస్తుంది.

మానవునకు సంభవించగల మహావిపత్తు వస్తుసంపద్వి నాశంవల్ల కలిగేది కాదు. మానవజగత్తులో మానవుడే మరుగైనప్పుడు కలుగుతుంది. మహామానవుడు తన ఆత్మ యొక్క సృజనాత్మక చైతన్యంలో తనపరిసరాలన్నిటినీ తన జీవనప్రేమలతో నిండిన తన విస్తృతాత్మగా గ్రహిస్తాడు. కాని దాక్షిణ్యరహితమైన పేరాసవలన దానిని వికృతం, అపవిత్రం చేసుకుంటాడు. అతని స్వప్రయోజన ప్రపంచం రాకాసి రూపందాల్చి, అతని అంతస్స్వభావాన్ని కూడా మార్చివేసి, చిత్రంగా ఈ విశ్వాన్నిగురించిన ఒక అమూర్త వ్యవస్థ అతనికి స్ఫురించేటట్టు చేస్తుంది. ఆ విశ్వంలో ముక్తి ప్రశంసేలేదు. అది కేవలం ఏకాకియైన స్థూలవిషయం; పైన ఆకాశంలేని పంజరం. స్థూలదృష్టికి మనప్రపంచం కేవలం స్థూల విషయాలతో కూడిన బందిఖానా; చుట్టూ గట్టిపెంకు గల గింజ వంటిది. ఈ పెంకులోపల ఆత్మ ముక్తికోసం ఆ క్రందనంచేస్తూంది; అవకాశం నీరవగాఢాంధకారమయంగా కనిపించినా ఈ ఆక్రందనం ఉపశమించదు. అపరిమితంగా ప్రబలిపోయిన ఆశాపిశాచి ఏదయినా ఈ సజీవాశయాన్ని కాలద్రొక్కితే, నాటితో – అంకురించవలెననే ఆశ నశించి పోయిన విత్తువలె – మననాగరకత అంతరించి పోతుంది. ఈముక్తి ఆదర్శమానవునిలో స్పందించే సత్యంలోనే ఉన్నది.



# ౫. మహా ప్రవక్తలు

ఐంద్రియ జ్ఞానం ద్వారాను, భావనా వివేకాల ద్వారాను మనతో అనుబంధం గల విశ్వమే మానవవిశ్వమని లోగడ నేనన్నాను. ఆ విశ్వం యొక్క భౌతిక రూపంతో వైజ్ఞానికంగాను, దినచర్యలలోను మనం సముచిత సామరస్యం సాధించడం వలన భౌతికంగా మనం బలపడతాము. ఈ విశ్వమందలి అద్భుత దృశ్యాలను, సన్నివేశాలను పరిశీలించి మానవుడు తన వివేకానికి అనుగుణమైన కొన్ని సూత్రాలను తయారు చేశాడు. చరిత్ర ప్రాథమిక దశలో, బాహ్య ప్రపంచంలో మానవుని భౌతిక వ్యవహారాలన్ని, అతని జీవనోపాధికి అత్యవసరమైనవిగా ఉండేవి. ఈ విషయంలో మానవుడుకూడా ఇతర ప్రాణుల వలెనే ప్రవర్తించేవాడు. అందువల్లనే, అతని ప్రాథమిక మతాభివ్యక్తి కూడా భౌతికస్థాయిలోనే ఉండి పోయింది. అతని మతచింత ప్రకృతిలో అభివ్యక్త మవుతూఉన్న అద్భుతశక్తులను చూచినప్పటి ఆతని నివ్వెరపాటులోనుండి, మంత్రతంత్రాలతో ఆశక్తులను తనవశం చేసుకుని తనకు, తన తోడిమానవులకు ఉపయోగపడేటట్లు చెయ్యాలనే ప్రయత్నం లోనుండి ఉద్భవించింది. అనగా, ప్రకృతిశక్తుల అద్భుతరహస్యాలతో సంపూర్ణమైన సంబంధం ఏర్పరచు

కోవాలని అతని మతం ప్రయత్నించింది అన్నమాట. ఇందుకు సాధనాలు మానవుని మంత్రతంత్రాలు. ఆత్వైన మానవుడు తన అంతరంగిక ప్రకృతి వంకకు దృష్టి మరల్చడానికి వ్యవధి, స్వాతంత్ర్యం లభించే సమయం వచ్చింది. తన వ్యక్తిత్వం లోని అద్భుతరహస్యాలు అతనికి అపూర్వ ప్రాధాన్యం కలిగించినవి. అతని వైయక్తికాత్మకు ఉదాత్త వ్యక్తిత్వంలో పరిపూర్ణత సాధించాలనే సహజప్రేరణ కలిగించి. మతచరిత్రలో దానిస్వభావాన్ని గురించిన మన అభిప్రాయం, భౌతికజగత్తును గురించిన మన అభిప్రాయాల వలెనే ఎన్నో మార్పులకు గురి అయింది. ఆ మార్పులకు అనుగుణంగా మన ఆరాధన విధానాలు కూడా మారుతూ వచ్చినవి. అయితే ఈ పరిణామం బాహ్య, ఐంద్రజాలిక దశలనుంచి నైతిక, ఆధ్యాత్మిక ప్రాముఖ్యం దిశకు సాగింది.

మనకు తెలిసినంతవరకు మానవుని మతపరిణామ క్రమంలో కలిగిన మొట్టమొదటి గొప్ప మార్పు - పర్షియా దేశపు మహాప్రవక్త జరతుష్ట్రుని సందేశాలలో కనిపిస్తుంది. మామూలు ప్రకారం ఆయన సందేశం కూడా విప్లవానికి కారణ మయింది. పిమ్మట కొంత కాలానికి, అదే సంఘటన భారత దేశంలో జరిగింది. ఈ మతసంఘర్షణ చరిత్రే మన మహాభారతేతిహాసంలో అభివర్ణిత మయింది. అందులో కృష్ణ ప్రోక్తమయిన భగవద్గీత ఒకభాగం.

ఇరాన్ దేశ చరిత్రలోని ప్రముఖ సంఘటన లన్నింటిలో ప్రముఖమైనది జరతుష్ట్రుని సంస్కరణోద్యమం. మానవెరిగినంతలో మతంలో, నైతిక శీల ప్రాధాన్యమును ప్రతిపాదించిన ప్రథమవ్యక్తి జరతుష్ట్రుడే. దానితోపాటు ఆయన ఏకేశ్వరారాధనకూడా ప్రబోధించాడు. పరిపూర్ణ మానవతకు సౌశీల్యమే శాశ్వతమైన ప్రాతిపదిక అనే ఆదర్శానికి ఈ ఏకేశ్వరారాధన దోహదం చేసింది. మానవునకు స్వాతంత్ర్య మార్గదర్శకులైన ఆది ప్రవక్తలలో జరతుష్ట్రుడు అగ్రగణ్యుడు. నైతిక వివేచనా స్వాతంత్ర్యం, అర్థంలేని మతనిష్ఠలను గుడ్డిగా పాటించ నవసరంలేదనే స్వాతంత్ర్యం, మాన ఏకాగ్రభక్తిని భంగపరిచే బహుదేవాలయాలకు పోయి మ్రొక్క నవసరం లేదనే స్వాతంత్ర్యం - ఆయన ప్రబోధించాడు. గాఢాంధకారంలో హఠాత్తుగా మెరిసిన మెరుపువలె ఒక్కసారిగా మానవునికి స్ఫురించిన సత్యం ఇది. ఈ సత్యం మానవజగత్తులో ఇంకా నలుమూలలకు వ్యాప్తం కాలేదు. హేతువాదవిరహితమైన ఆ అంధయుగంలో, నలుదిక్కుల మంత్రతంత్రప్రాబల్యం హెచ్చుగా ఉన్నా, జరతుష్ట్రుడు, ఎంతమాత్రం వెనుకాడక, నైతికప్రామాణ్యం మీదనే మతసత్యం ఆధారపడి ఉన్నదనీ, ఊహాజనిత ప్రామాణ్యబుద్ధితో అనుష్ఠించే యజ్ఞయాగాది కర్మలమీద కాదనీ నిర్భయంగా ప్రకటించాడు. వాఙ్మనఃకర్మలచే పవి

శుద్ధుడైన మానవునికి అర్హమైనస్థానం ఇచ్చినప్పుడే మతానికి మాన్యత ఏర్పడుతుందని బోధించాడు.

భగవంతుని కృపాపాత్రతను సంపాదించే ఉపాయ మెరిగి ఆయనను పూజించేవారికే భగవంతుడు వరాలిస్తాడనే ధోరణిలోనే మానవుడు భగవంతునితో వ్యవహరిస్తున్నంత కాలం, మానవుడు కేవలం స్వార్థపరుడుగాను, స్వజనపక్షపాతి గాను ఉండిపోతాడు. నైతిక ప్రామాణ్యాన్ని, అనగా భగవంతుని మానవతను, అంగీకరించే యెడల మానవుడు మత సాధనలద్వారా దివ్యత్వాన్ని సాధిస్తాడు. అప్పుడు భగవంతుడు బయట ఎక్కడో ఉండి తన పూజా పురస్కారాలను స్వీకరించి తాను కోరిన వరం ప్రసాదిస్తాడనే భ్రమ వీగిపోతుంది. భగవద్భక్తికి జాతి మత పరిధులు లేవు. మానవులంతా ఒకే ఆధ్యాత్మిక సమాఖ్యలో సమాన భాగస్వాములు. అటవీజాతుల సంకుచిత భావశృంఖలాల నుండి మతానికి విమోచనం కలిగించి, మతం మానవు లందరికీ చెందినదని చాటిన ప్రథమ ప్రవక్త జరతుష్ట్రుడు. మత చరిత్రలో ఇది మహనీయ సంఘటన; సత్యం నివురు గప్పిన నిప్పు వంటిది. గుప్తంగా ఉండిఉండి, ప్రవక్తల మనస్సుల లోను, జీవితాలలోను దేదీప్యమానంగా ప్రజ్వలిస్తుంది. ప్రవక్తవాణిలో సర్వమానవవాణి వినిపిస్తుంది. ఆ వాణి ఏదో ఒక కాలానికి గాని, జాతికి కాని పరిమితమై ఉండదు,

నీరవశూన్యదశలను, నిరాశా నిస్పృహాలను అధిగమించి ప్రసరిస్తుంది. జరతుష్ట్రుని వాణి నేటికీ సజీవమైన ప్రబోధం. "సత్యాదిత్యుడు సర్వజీవనప్రదాత. ఆదివ్యతేజస్సు దశదిశలను ఏకంగా ఆలింగనం చేస్తుంది." - అని ఆయన సందేశం.

మహనీయులైన ఆచార్యులు ఉదయించడం, మత సంస్కరణకు పూనుకోవడం, భారతదేశంలోను పెర్షియాలోను ఒకే పద్ధతిలో సాగినదని గ్రహించడం నాకు సంతోషం కలిగించింది. అంతకు పూర్వం పెర్షియాలో యజ్ఞమంటే బాహ్య కర్మకాండలతో కూడిన రక్తపాతమయమైన కర్మ. జరతుష్ట్రుడు ఆ పదానికి నవీనార్థం కల్పించి ఆధ్యాత్మికపరం చేశాడు. భారతదేశంలో కూడా అదే జరిగింది. భగవద్గీతలో యజ్ఞమనే మాట అతఃపూర్వార్థంలో కాక, ఉదాత్తమైన అర్థంలో ప్రయుక్తమయింది.

స్వప్రయోజనకాంక్షతో చేసిన కర్మ ఆత్మకు బంధం అవుతుందనీ, ఫలాపేక్షరహితమై ఆత్మత్యాగరూపమైన కర్మే నిజమైన యజ్ఞమనీ భగవద్గీత వివరిస్తుంది. బ్రహ్మ చేసిన ఆత్మత్యాగమే ఈ సృష్టికి కారణమనీ, అంతకన్న దానికి ప్రయోజనం లేదనీ, అందువల్ల మనం స్వార్థత్యాగపూరితమైన కర్మ చేయడం వల్ల బ్రహ్మసాక్షాత్కారం పొందగలమనీ కూడా గీత బోధిస్తుంది.

జరతుష్ట్రి మతావలంబి అయిన పెర్షియా స్పష్టంగా నైతికదృష్టి గలది. ధర్మరాజ్యాన్ని వ్యాప్తి చేయడం కోసము, దౌష్ట్యదండయాత్రల నుండి పరిరక్షించడం కోసం అనంతసచ్ఛక్తితో సహకరించి కృషిచేయవలసినదిగా ఆయన ప్రజలను ఉద్బోధించాడు. ప్రపంచానికి శుభాశీస్సులను ప్రసాదించే భగవంతుని కర్తవ్యంలో మనంకూడా సహకరించాలని ఈ సంప్రదాయ తాత్పర్యం.

భారతదేశ చరిత్రలో శౌర్యసాహసోపేతమైన ఒక దశలో సంస్కృత సాహిత్య స్రష్టలలో ఉత్తమోత్తముడైన మహాకవి ఈధర్మయుద్ధ ప్రబోధం చేశాడు. ఆయన యుద్ధ ప్రబోధం కేవలం జరతుష్ట్రుని ప్రబోధాలను పోలిఉన్నదంటే అందులో ఆశ్చర్యపడవలసిన దేమీ లేదు. దుష్టుల దండయాత్రలనుండి స్వర్గాన్ని కాపాడడానికి, దేవతలకు ఒక నాయకుడు కావాలి. ఈ సమస్యతో ఆయన కావ్యం ప్రారంభం అవుతుంది. ఇదే మానవుడు నిరంతరం ఎదుర్కొన వలసి వస్తూన్న క్లిష్ట సమస్య. సత్యానికి చిహ్నమైన సతీదేవికీ, సద్భావానికి చిహ్నమైన శివుడికీ ఎడబాటు కలగటంతో దౌష్ట్యం, దుష్టరాక్షసత చెలరేగినవి. సత్యానికీ, సద్భావానికీ పునఃకల్యాణం జరిగితేగాని సత్య సౌందర్య సీమలను సంరక్షింపగల ఉత్తమవీరుడు ఉద్భవించడు. కామప్రేరణతో ఈ సంధియోగాన్ని సాధించడానికి మొదట ఒక ప్రయత్నం జరి

గింది. దానితో భగవంతునికి ఆగ్రహం కలిగింది. ఫలితం నిరాశా నిస్పృహాలు. చివరికి తీవ్రమైన తపస్సంశుద్ధివలన ఆకల్యాణం, సంయోగం సాధ్యమైనవి. వీరుడు ఉద్భవించాడు. దుష్టశక్తులన్నిటినీ నిర్జించి పునఃస్వర్గరాజ్యస్థాపన చేశాడు. ఇదే ధర్మయుద్ధాన్ని గురించిన ఆ మహాకావ్యానికి వస్తువు. ఈ ధర్మయుద్ధాన్నే ప్రథమతః జరతుష్ట్రుడు ప్రవచించాడు.

మానవోద్యమాలన్నీ ఉదాత్తాశయప్రేరితములై ఉండాలని జరతుష్ట్రుని అమరవాణి మనను సదా హెచ్చరిస్తూంది. ఉదాత్తాశయానికి వేరే ప్రయోజనం ఉండదు. దాని కదే శాంతి. దాని కదే అమరత. అదే "కీర్తన మందిరం". అదే అసిధారావ్రతమైన సచ్ఛీలానికి ప్రతిఫలమైన "ప్రేమసిద్ధి".



# ౬. దివ్యానుభూతి

మతనిష్ఠలో విశ్వాసం, శ్రద్ధ గల వ్యక్తుల అనుభవాల వలన ప్రజలలో మతమంటే గౌరవము, ఆసక్తి ఏర్పడుతూ ఉండటం అదృష్టం. ఇక్కడ నా జీవిత కథ కొంత చెప్పవలసి వచ్చినందుకు క్షమించాలని కోరుతున్నాను. నా మతానురక్తి నా జీవితంలో క్రమక్రమంగా అంకురించి అభివృద్ధి అయినదేగాని, ఆనువంశికంగాగాని, ఉపదేశాల వలన గాని నాకు సంక్రమించినది కాదు.

ఉపనిషత్ప్రతిపాద్యమైన తత్త్వాన్ని అనుసరించి, ఏకేశ్వరారాధన విధానాన్ని రూపొందించడానికి ఆరోజులలో శ్రద్ధగా కృషిచేస్తున్న పండిత వంశంలో నేను జన్మించాను. ఎందువల్లనో మొదట కొన్నాళ్ళు నాకు ఏమతమన్నా ఇష్ట ముండేది కాదు. ఆవిధంగా నా మనస్సు ఒక విధమైన స్వేచ్ఛా వాతావరణంలో పెరుగుతూ వచ్చింది. అనగా ఏదో ఒక మతగ్రంథమో, లేక కొందరు మతాచార్యుల బోధనలో అనుల్లంఘనీయమైన పరమప్రమాణాలని విశ్వసించే మతాలకు వేటికీ నాపైన ఏవిధమైన అధికారం లేదు. అయితే ఇప్పుడు ఆరోజులను గురించి తలుచుకుంటే నాకు తెలియకుండానే నేను నా పూర్వుల వైదిక మతాన్ని అనుసరించానని, ఈ ఉష్ణమండలాకాశములో

ఉజ్జ్వలించే ఆ పరాత్పరతత్వాన్నే నేను ఉపాసించానని అనిపిస్తూంది.

ఇంతలో నాకు ఉపనయనం చేశారు. గాయత్రి ఉపదేశించారు. ఆ మంత్రానికి వారు నాకు చెప్పిన అర్థం ఇది. "ఈ భూమిని, వాయు మండలాన్ని, నక్షత్ర మండలాన్ని సృజించిన ఆ మహామహుని, నా బుద్ధికి ప్రసారశక్తి ప్రసాదించే ఆ మహోజ్జ్వలుని ధ్యానింతును గాక."

నా మనస్సును బాహ్యప్రపంచాన్ని ఒకే సృజనాత్మక మహావాహినిలో ఏకంచేసే ఆ అపరిమితుని అనుదిన ధ్యానం నాలో ఏదో ప్రశాంతమైన ఉత్తేజం కలిగించింది. ఈ మంత్రం నామనస్సులో ఉదయింప జేసిన భావపరంపర వాయుగమనంవలె అస్పష్టమై ఉండేది. అది పూర్ణప్రసారం పొంది, నాకు సంతృప్తి కలిగించడానికి విస్ఫుటమైన ఒక జగత్తు కావాలి.

పద్దెనిమిదేళ్ల వయస్సులో నాజీవితంలో ప్రథమతః వసంతమారుతంలాంటి ఒక దివ్యానుభూతి నాకు ఎదురై వెంటనే వీగిపోయింది. ఆ అనుభూతి నా స్మృతిపథంలో ప్రత్యక్షమైన ఒక ఆధ్యాత్మిక సత్యసందేశాన్ని శాశ్వతంగా ప్రతిష్ఠించి పోయింది. ఆ నాడు అప్పుడప్పుడే ఉదయిస్తూన్న సూర్యభగవానుణ్ణి చూస్తూ నిలబడ్డాను. సూర్యదేవుని కిరణాలు చెట్ల సందులలోంచి దూసు

కొని వచ్చి నాపైన వాలుతున్నవి. ఆ సమయంలో హఠాత్తుగా నాకు ఏదో చిత్రమైన, అద్భుతమైన అనుభూతి కలిగింది. చిరకాలంగా నా కనుల ఎదుట ఉన్న భాగమంచు తెర యేదో ఒక్కసారిగా జారిపోయి నట్లయింది. ప్రపంచ ముఖమండలాన్ని ఉద్దీపింప జేస్తూన్న ఆ ప్రభాత కాంతి, నాలో ఏదో ఆంతరంగిక ఆనందాన్ని వెల్లివిరియ జేసింది. సర్వవస్తువులను, సర్వమానవులను ఆచ్ఛాదించి ఉంచిన "సాధారణత" అనే అదృశ్య యవనిక తొలగి పోయింది. ఆ దృశ్య పరమార్థం, నా మనస్సులో గాఢమైన ముద్ర వేసుకొన్నది. ఇదే సౌందర్యానికి నిర్వచనం. ఈ అనుభూతి నా కొసగిన మానవతా సందేశం, - నా ఆత్మకు కలిగిన మానవుని వ్యక్త్యతీతమైన మానవవిశ్వదర్శనం నా స్మృతిపథంలో శాశ్వతంగా నిలిచి పోయింది.

నేను మరికొంచెం పెద్దవాణ్ణి అయ్యాను. నన్ను గ్రామసీమకు పోయి, అక్కడ పనులు తణిఖీచేయమని పంపారు. కాలచక్రం మెల్లగా, చల్లగా తిరిగే ఆపల్లెసీమలో, సుఖాలూ, దుఃఖాలూ కూడా సౌమ్యంగా సంరంభరహితంగా దొగలి పోయేచోట నాబస ఏర్పాటు చేసుకున్నాను. పిమ్మట నాజీవితంలో చిరస్మరణీయమైన మరొకదృశ్యం ఆ సాధారణ గ్రామసీమలో నాకు సాక్షాత్కరించింది. సామాన్యంగా నేను ప్రతిదినం చేయవలసిన ఉదయ కార్యక్రమమంతా

పూర్తిచేసుకున్నాను. ఇక స్నానానికి వెళ్ళబోతూ ఒక్క క్షణం నాగవాక్షం దగ్గర నిలబడ్డాను. పూర్తిగా ఎండి పోయి, ప్రథమవర్షావాహినికై పరితపిస్తూ నిరీక్షిస్తూన్న ఒక నది ఒడ్డున వరసగా ఉన్న సంతదుకాణాల దృశ్యం ఆ గవాక్షం లోంచి కనిపిస్తూంది. అకస్మాత్తుగా నా ఆత్మలో ఏదో సంచలనం కలిగింది. నాకు అనుభవ వేద్యమైన జగత్తు ఒక్కసారిగా ఉజ్జ్వల వికాసం పొందినట్లు కనిపించింది. పాంతస లేకుండా వ్యత్యస్తంగా, అస్పష్టంగా ఉండిన పదార్థాలన్నింటిలో అద్భుతమైన సామరస్యం, పరమార్థం, హఠాత్తుగా నాకుసాక్షాత్కరించినవి.

ఇలాంటిదే ఒకసంఘటన నా బాల్యంలో అక్షరా భ్యాసం అయిన తొలిరోజులలో జరిగింది. అర్థం, అపార్థం తెలియని మాటలతో నోటబట్టరాని వర్ణక్రమాలతో ఉన్న వాక్యాలూ, మాటలూ పల్లించలేక నేను సతమత మవు తూండగా ఆ పాఠాల మధ్య ఒక రమ్యమైన, లయాన్విత మైన వాక్యం చదివాను. ఆ వాక్యానికి అర్థం ఇది "వాన కురియుచున్నది. ఆకు లాడుచున్నవి." ఈ వాక్యం చదవ గానే నాకనులయెదుట నూతన ప్రపంచం వికసించినట్లు, అందులో నా సార్థకత నాకు సంపూర్ణంగా బోధపడినట్లు అనిపించింది. వాన చినుకులు వచ్చి మీద పడుతూంటే వయ్యారంగా నాట్యమాడుతూన్న ఆకులు నా మనోనేత్రం

మొదట గోచరించినవి. ఆ మనోహరదృశ్యమును నాకు సాక్షాత్కరింపజేసిన జగత్తు కేవలం వస్తుతత్వ ప్రదర్శక మైన సామాన్యజగత్తు కాదు; నా అస్తిత్వంతో సంపూర్ణ సామరస్యంగల రమణీయ జగత్తు ఇప్పుడు నాకు నిరర్థకమైన, అస్తవ్యస్తమైన అంశాలేవీ కనిపించడం లేదు. నా మనస్సు ఆమనోహరదృశ్య సామరస్యంలో మునిగి తేలుతూంది. అదేవిధంగా ఆ గ్రామంలో ఆ రోజున నా జీవితసత్యాలన్నీ హఠాత్తుగా నాకు అఖండసముజ్జ్వల సత్యంగా గోచరించినవి. చంచలతరంగాలవలె కనిపించినవస్తువులన్నీ ఒకే అపార సాగరాంతర్గతములై ఉన్నవని గ్రహించాను. నన్ను, నాజగత్తును తనలో ఇముడ్చుకొన్న మహాతత్త్వ మేదో నా అనుభూతులలో తననుతాను సువ్యక్తం చేసుకొన గోరుతూందన్న దృఢమైన విశ్వాసం నాకు కలిగింది. ఆ మహాతత్త్వం అట్టి నాఅనుభూతులన్నింటినీ ఏకంచేసి నిత్య విస్తృతమైన వ్యక్తిత్వంగా రూపొందిస్తున్నదనీ ఇదే ఆధ్యాత్మికశాస్త్రసృష్టి అనీ నేను తీర్మానించుకున్నాను.

ఈ మహాతత్త్వానికే, ఆ పరబ్రహ్మకే, నేను విధే యుడనై ఉండాలి. నాలోని సృజనాత్మకబుద్ధి కేవలం నాది కాదు; ఆయనదికూడాను. ఈ విశ్వాన్ని తదనంతభావంగా రూపొందిస్తూన్న సృజనాత్మకబుద్ధికూడా ఇదే అయిఉండ వచ్చు. కాని, వ్యక్తిగతంగా నాలోమాత్రం ఆమహాతత్త్వం

యొక్క ప్రత్యేక కేంద్ర మేదో ఉన్నట్లు, మా వ్యక్తిగత బాంధవ్యం క్రమంగా గాఢమైన చైతన్యంగా వృద్ధిపొందు తున్నట్లు నాకు అనిపించింది. చివరకు నా మత మేమిటో నాకు బోధపడింది. విశ్వమానవుని మతమే నా మతం. ఈ మతంలో ఆ అనంతమహాతత్త్వం మానవతదృష్ట్యా నిర్వ చింపబడి, నాకు అత్యంతసన్నిహితమై, నా ప్రేమను, నా సహకారాన్ని అపేక్షిస్తున్నది.

నా దృష్టిలో ఈ విశ్వం సజీవమైనది. నా జీవితానికి అత్యంత సన్నిహితమైనది. ఈ బాంధవ్యం నా జీవిత మంతటా వ్యాపించి, నా జీవనపు విలువను హెచ్చిస్తున్నది.

ఈ ప్రపంచం విషయంలో కూడా అప్రత్యక్షసత్య మనేది ఉన్నదని, అప్రత్యక్ష జ్ఞానవంతుడైన మానవుడే దానిని గ్రహింపగలడనీ చెప్పేమాట వాస్తవమే. తండ్రికి కొడుకుతో వ్యక్తిగతమైన సంబంధం ఉన్నది. కాని, తండ్రి వైద్యుడుకూడా అయినప్పుడు ఆ సంబంధాన్ని దూరంగా ఉంచి, ఆ కుర్రవాడు తనకు ఏమీ కానట్టే ప్రవర్తించ వచ్చు. కాని, ఆవిధంగా నిరంతర వైద్యదృష్టితో ఆతడు కుమారునితో తనకుగల వ్యక్తిగత సంబంధాన్ని విస్మరిస్తే, తండ్రిగా కంటె వైద్యుడుగా అతడు అధికంగా సత్యదర్శనం చేశాడని చెప్పడానికి వీలులేదు. ఆ కుర్రవాడు శాస్త్రరీత్యా తన కొడుకని గుర్తించడం కేవలం ఒక సంఘటనను గురిం

చిన భోగట్టా తెలుసుకొనడమే అవుతుంది. కాని, ఆ కుచ్ర
వానిపట్ల తండ్రికి గల గాఢమైన వాత్సల్యంలో ఈ జగ
ద్బాంధవ్యంలోని సత్యం, విశ్వసామరస్యంలోని సత్యం ఈ
సృష్టియొక్క ప్రాతిపదికసత్యం అతనికి గోచరంకావచ్చు.

ఒక పదార్థాన్నిగురించినసత్యం అంపలి అణువులలోని
ప్రోటాన్లను, ఎలక్ట్రాన్లను లెక్కించి తెలుసుకొన్నంత మాత్రాన
బోధపడదు. వాటికిగల అద్భుత సంబంధంలోని వైచిత్రిని
గ్రహించాలి. అది శాస్త్రజ్ఞులవివేచనకు లొంగేవిషయం
కాదు. ఈ సంబంధసత్యం మనకు మన ప్రేమలలో, మన
ఆనందాలలో సులభంగా మన అనుభవానికి అందుబాటు
లోకి వస్తుంది. ఈ అనుభవాన్ని పురస్కరించుకొని, సర్వ
వస్తువులకు సంబంధం కల్పిస్తూ సర్వవిశ్వాన్ని తనలో
ఇముడ్చుకొనే ఆ పరమాత్మ ప్రేమమయుడనీ, సర్వోత్తమ
మైన సంబంధాలకు హేతుభూతమైన ఆ ప్రేమే పరమసత్య
మనీ సిద్ధాంతం చేయగల స్వేచ్ఛ మనకు ఉంది.

చేతనాచేతనాత్మకమైన ఈ సృష్టికి మానవుడు
కిరీటము వంటివాడని నా విశ్వాసం అన్న సంగతి మళ్లీ
ఒకసారి జ్ఞాపకం చేస్తున్నాను. సృష్టిలో అంతర్భాగమైన
మానవుడు సృష్టికర్తకు ప్రతినిధిగా రూపొందాడు. అందు
వల్లనే మానవుడు తన జ్ఞానంలో, తన అనుభూతిలో, తన
భావనలో ఈ విశ్వాన్ని ఇముడ్చుకొనగలగడం, సర్వవ్యాపి

అయిన పరమాత్మతో తన వ్యక్తిగతాత్మను ఐక్యం చేయ గలగడం సాధ్యమవుతూంది.

వాస్తవ స్థితిగతులను గురించిన భోగట్టా, శాస్త్ర విష్కరణ కేవలబాహ్యజ్ఞానసంబంధులు. వాటికి ఆంతరంగిక రహస్యంతో సంబంధం లేదు. సత్యానికి లక్షణం ఆనందం. సత్యంలోంచి వెలువడే సన్నని సంగీతమును బట్టి, మనలోని సత్యానికి అది పంపే అభినందన హర్షాన్ని బట్టి సత్యస్పర్శను మనం వెంటనే గుర్తు పట్టగలం. అన్ని మతాలకూ అదే వాస్తవమైన ప్రాతిపదిక. కాంతిని మనం గ్రహిస్తున్నది ఈథరు తరంగాలు గ్రహిస్తున్నట్టు కాదుగద! ఉషస్సు ఎవరో శాస్త్రవేత్తలు వచ్చి తనను మనకు పరిచయం చేసేవరకు వేచి ఉండదు. అదేవిధంగా, ప్రేమకు, మంచి తనానికి సంబంధించిన స్వచ్ఛమైన సత్యం మనకు గోచరించిన వెంటనే మనలోనే ఆ అనంత సత్యస్పర్శ మనకు అనుభూత మవుతుంది. తత్త్వవేత్తల ఉపదేశాలవల్ల గాని నైతికసిద్ధాంత రాద్ధాంతాలవల్ల గాని ఇది సాధ్యంకాదు.

నా మతం కేవల కవిమతం. నా మతాన్నిగురించిన నా అభిప్రాయాలన్నీ స్వానుభూతిదర్శనప్రామాణ్యంతో నేను ఏర్పరచుకున్న వేగాని, వైజ్ఞానికంగా నేర్చుకొన్నవిగావు. దౌష్ట్యాన్నిగురించిగాని, మరణానంతరం ఏమిజరుగుతుందని గాని నన్నుప్రశ్నిస్తే, నేను సంతృప్తి కరమైన జవాబు చెప్పలే

వని ఒప్పుకుంటాను. అయినప్పటికీ, నా ఆత్మ పరమాత్మకు సన్నిహితమై, ఆనందాతిరేకంలో ఆ పరమాత్మానుభూతి పొందిన సందర్భాలు చాలా ఉన్నవని మాత్రం మనవి చేస్తున్నాను. మనమాటలు, మనస్సులు ఆ పరమ సత్య దర్శనం కోసం అన్వేషించి, అన్వేషించి నిస్సహాయములై తిరిగివస్తాయని ("యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసాసహ") మనకు ఉపనిషత్తు తెలుపుతూంది. అయితే, ఆత్మానందానుభూతి ద్వారా సత్యదర్శనం చేసేవానికి ఏ భయసంశయాలేవీ ఉండవు.

రాత్రివేళ చీకటిలో ఏదైనా వస్తువు కాలికి తగిలి తడబడి నప్పుడు, ఆ వస్తువు విలక్షణాస్తిత్వాన్ని మనం స్పష్టంగా గుర్తిస్తాము. కాని, సర్వవస్తువులను ఆలింగనం చేసుకునే అద్భుతసామరస్యం పగటివేళ మనకు గోచరిస్తుంది. ఆత్మచైతన్యశోభాన్వితమైన అంతరంగదృష్టిగల వ్యక్తి ఈ అనేకత మధ్య ప్రస్ఫుటంగా భాసించే ఐక్యసామరస్యాలను వెంటనే గ్రహించ గలుగుతాడు. అతని మనస్సు మానవ ప్రపంచములోని అనేకతలను, అస్తవ్యస్తతలను చూచి వెర్రిగా తడబడదు. అవి పరమసత్యాలని అతడు అంగీక రించడు. సత్యపీఠంమీద ప్రతిష్ఠితమైన ఆంతరంగిక సామ రస్యం లోనే శాంతి ఉన్నదనీ, బాహ్యసంస్కారాల వల్ల ప్రయోజనం లేదనీ అతడు గ్రహిస్తాడు. సత్యంతో మనకు

ఆధ్యాత్మిక సంబంధం ఉన్నదని సౌందర్యం మనకు పదేపదే హామీగా ఇస్తున్నదనీ, మన ప్రేమతో తాను పరిపక్వదశ పొందడానికి ఆ సత్యం నిరంతరం ఎదురు చూస్తూ ఉంటుందని అతనికి తెలుసు.



# ౭. నా హృదయాధిష్ఠాత

మతజగత్తులో గాని కళారంగంలో గాని ఒక వర్గం లోని సర్వసామాన్యలక్షణానికి గౌరవం లేదు. అది తరచు పరస్పరానుకరణమనే అంటువ్యాధి వలన సాధ్యమవుతుంది. మా నాయనగారి నాయకత్వాన నడుస్తూ ఉండిన ఏకేశ్వరారాధన విధానం (బ్రహ్మసమాజ మతం)లో నాకు కలిగిన అనుభవం వల్ల నా కీవిశ్వాసం కలిగింది.

ఒక నాడు వంగదేశం లోని బౌల్ జాతికి చెందిన ఒక బిచ్చగాని పాట నన్నాకర్షించింది. నిరాడంబరమైన ఆ పాటలోని వాస్తవ మతదృక్పథం నన్ను ఆకర్షించింది. అతని మతంలో సిద్ధాంత రాద్ధాంతాలు లేవు; ఉదాత్తాశయాలను సులభంగా చెప్పడమూ కనిపించదు. కాని, ఆ గీతం వాస్తవావేశ పూరితమై సజీవంగా స్పందిస్తూంది. దేవుని కోసం భక్తుని హృదయం పొందే వాస్తవికమైన గాఢ పరితాపం అందులో వ్యక్తమవుతూంది. ఆతని దేవుడు దేవాలయాల లోను, పవిత్రగ్రంథాల లోను, విగ్రహాల లోను, దివ్యచిహ్నాల లోను పీఠం వేసుకుని ఉండే దేవుడు కాడు. ఆతని దేవుని మందిరం మానవుడు. ఆ భక్తుడు తన లక్ష్యమైన మానవుణ్ణి ఉద్దేశించే ఆ గీతం పాడుతున్నాడు. దాని భావమిది.

"దేవాలయాలు, మసీదులు నీ మార్గానికి అవరోధాలు.
అక్కడ నీ ఆహ్వానం నాకు వినిపించదు,
నాకు అటు ముందుకి అడుగు పడదు.
పూజారులు ప్రబోధకులు ఆగ్రహావిష్టులై వచ్చి
నన్ను దుయ్యబట్టుతున్నారు."

ప్రేమనే ఆతడు విశ్వసిస్తాడు. ప్రేమ తన దివ్య స్పర్శతో పేరాసను త్యాగంగా మార్చగలదనీ, ఈ ప్రేమ కోసమే స్వర్గసీమ భూలోకంగా మారాలనీ, దేవతలు మానవత్వం పొందాలనీ కోరుతున్నారని అతని నమ్మకం.

అప్పటినుంచి నేనా బౌల్ జాతి బిచ్చగాళ్ళను కలుసుకుని, వారి పాటలన్నీ విని, అందులో వ్యక్తమయే వారి మతతత్త్వాన్ని అర్థం చేసుకొనడానికి ప్రయత్నించాను. కేవలం ఆ పాటలే వారి మతసాధనాలు. మానవునిమతాన్ని గురించి పెద్ద పెద్ద గ్రంథాలు వ్రాయక పోయినా, తీవ్రమైన మతాభినివేశం, సాధన కలిగి సిద్ధి పొందినవారు భారత దేశంలో ఎందరో ఉన్నారు. సర్వమానవుల లోను ఉన్న పురుషోత్తమునితో – మానవ రూపాలన్నింటిలోను ఉన్న అరూప మానవునితో – వారికి గల సన్నిహిత సంబంధం వారి జీవితాలలో అడుగడుగునా కనిపిస్తుంది. భారతదేశ చరిత్రలో మధ్యయుగానికి చెందిన భక్తకవిరజ్జబ్ మానవుణ్ణి గురించి ఇలా అంటాడు.

"నరనారాయణా! (భగవన్మానవా!) నీ పేరు సార్థక మైనది. అది మిథ్యకాదు, సత్యం. నీలో అపరిమితత్వం పరిమితత్వమును, పూర్ణజ్ఞానం ప్రేమను కోరుతున్నవి. సరూపుడు రూప రహితునితో సంయోగము పొందినప్పుడు భక్తిరూపంలో ప్రేమ పరిపక్వదశనందుకుంటుంది."

ఆ యుగానికే చెందిన రవిదాస్ అనే మరొక కవి ఇలా గానం చేశాడు.

"నీ నిరీక్ష నా కోసము నా ప్రతీక్ష నీ కోసము
నరహరి హే పరమ పురుష !
పరస్పరము మన ప్రేమము !"

ఈ భగవన్మానవుణ్ణి గురించే వంగదేశంలో ఒక గ్రామీణకవి –

"మనలోనే ప్రభు వాసము,
ఇదే అగాధమగు సత్యము.
హృదయ కవాటముల దెరచి
ఎల్లర నాహ్వానించిన
అతని దర్శనము లభించు
నందే మనకే వేళను," –అంటాడు.

మరొక కవి–

"మానవుడు నా లోని
మానవునికై వెదకు

పరవశుడనై నేను
పారిపోవుదు నెటకొ !"–అన్నాడు.

వేరొక కవి ఆదర్శ మానవుని ఇలా కీర్తించాడు :-

"నర రూపములం దాలిచి
నాట్యమాడు నాస్వామిని
వేదమేమి వర్ణించును
వెర్రితమ్ముడా ! నరుడా !
పరసత్యము నరుడే యని
పలుకడె చండీదాసుడు !"

మన చైతన్యాన్ని మహనీయమైన మానవత అంతటికీ వ్యాపింప జేసుకొనడం ద్వారా ఉదాత్తమైన అస్తిత్వం సాధించాలని మన ఆశయం. భక్తి, కీర్తనముల ద్వారా, ప్రత్యేకావధులను అధిగమించి పోగల ఆశా భావనల ద్వారా దానిని మనం సిద్ధింప జేసుకుంటాం. మన ఆశాభావనలు మనజీవిత సీమలను కూడా దాటిపోయి అనంతమైన కాలావరణంలోకి చేరగలవు. అక్కడ మానవకోటి జీవితాలలో మనం జీవిస్తాము.

ఇదే మానవ వ్యక్తిత్వం యొక్క అపార రూపం. ఇక్కడే మానవుడు తన మతాన్ని గుర్తిస్తాడు. నక్షత్రమండలాన్ని, దానికి ఆవల ఉన్న విశ్వాన్ని కూడా విజ్ఞాన శాస్త్రం తన జ్ఞానావరణ లోనికి తెచ్చు కొనవచ్చును;

సర్వ వస్తువులకు మూలమైన ప్రధాన తత్వాన్ని గురించి తత్వశాస్త్రం సిద్ధాంతీకరించడానికి ప్రయత్నించవచ్చు. మతం మాత్రం విధిగా ఈ మానవత్వాన్ని గురించే మనకు చెపుతుంది; మన వివేకాన్ని భాసమానం చేస్తుంది. మన విజ్ఞానాన్ని ఉద్దీప్తం చేస్తుంది. మన ప్రేమను రగుల్కొల్పి మన వివేకయుతమైన సేవను కోరుతుంది. మనం ప్రకృతి అని పేర్కొంటున్నది అరూపమైన తత్త్వవేత్తల భావన కాదు; ఈ విశ్వమూ కాదు. ప్రకృతిగా మానవునకు గోచరిస్తున్న దానినే మనం ప్రకృతి అంటున్నాము. నిజానికి ఈ ప్రకృతి మానవునిలోనే ఉన్నది. అందువల్ల అతని మనస్సు, ఆ ప్రకృతి కలిసిపోయి ఉంటవి. అట్టి ప్రకృతితో మానవుడు తన అస్తిత్వాన్ని గ్రహిస్తాడు.

అంతరి హృదయాల లోను ఉన్న ఆ పురుషుని సాక్షాత్కరింప జేసుకొనడమే మన మందరం చేయవలసిన పని. విముక్తి పొందిన మన చైతన్యం ద్వారా దీనిని మనం సాధించాలి. ఈ విశ్వమంతటినీ మానవ విజ్ఞానంతో పరివృతం చేయడమే విజ్ఞానశాస్త్రం పరమ లక్ష్యం. మానవుని విశ్వరూపాన్ని, అనగా కాలావరణాల పారము ముట్టి, సర్వ ప్రపంచమును తనలో ఇముడ్చుకొన గలిగిన అతని మనఃకాయాన్ని దర్శించడానికే విజ్ఞాన శాస్త్రం కృషి చేస్తుందని మనకు తెలుసు. ఈ ఆత్మలోనే మానవుని అస్తిత్వానికి

ఉత్తమ సార్థక్యాన్ని సాధించడానికి మతం పాటు పడు తున్నది. మానవునికి ఆంతరంగికంగా పరిచితమైన ఏకైక సత్యం కూడా ఇదే.

"మానవునికన్న ఇతరమైనది ఏమీ లేదు. అతడే పరాత్పరుడు; అతడే పరమ లక్ష్యము; ('పురుషాన్న పరా కించిత్, సాకాష్ఠా సాపరాగతిః') ఈపురుషునితో గల సంబంధములోనే ఈ విశ్వానికి అస్తిత్వం అని వంగదేశ గ్రామీణ కవి అంటాడు. పరమానంద సహితమైన సమ్యగాత్మ చైతన్యానుభూతి మన దేశంలో అనాదిగా వస్తున్న సంప్రదాయం. దాని యాథార్థ్యాన్ని గురించి నేను వివరించను. కాని, అది గొప్ప మానసికానుభూతిగా ఉపయోగపడినప్పటికీ, అది మతము మాత్రం కాదని నా అభిప్రాయం. పరమాణువుల స్వరూపాన్ని గురించిన జ్ఞానం చిత్రకారునికి ఏవిధంగాను ఉపయోగపడదు. ఆ పరమాణువుల సమాహార రూపాలతోనే అతనికి సంబంధం. అణువుకన్న అణుసమాహారరూపమే సమగ్రమైనది; దర్శనీయ మైనది. సంపూర్ణ మానవ స్వరూపంలోనే మానవుని పరిపూర్ణత. మానవుడు అస్పష్టమైన జీవాణుసమాహారమని భావించేయెడల మానవుని విశిష్టతే అస్ఫుటమైపోతుంది.

కనుక పరమ లక్ష్యమైన పరిపూర్ణత స్థావరమైనదే; కాని, వాస్తవికరూపంలో అది క్రమంగా పరిపూర్ణతవంకకు

పురోగమిస్తూ ఉంటుంది గనుక, జంగమమైనదిగా ఉంటుంది. పురుషోత్తముడు అపరిమితుడే; అయినా, అతడు మనలో వ్యక్తమయినప్పుడు పరిమితుడవుతాడు. ఈశోపనిషత్తులో చెప్ప బడినట్టు, "మానవుడు పూర్ణాయువై జీవించి, ఆశోప హతుడు కాకుండా ప్రవర్తిస్తూ, సర్వాంతర్యామియైన పురుషునిలో తనను తాను సాక్షాత్కరింప జేసుకోవాలి. అనగా, అతడు అనాసక్తితో కూడిన తన ప్రవర్తన వలన తన వ్యక్తిత్వంలో పురుషోత్తముని వ్యక్తం చేయాలి.



# ౮. సంగీత స్రష్ట

ఈ భౌతిక విశ్వ రంగంలో అత్యల్పమైన ఇసుక రేణువుకూడా ఒక పాత్ర. ఈ భౌతిక జగత్తనే రంగస్థలం లేకపోతే ఇసుక రేణువుకి అర్థం లేదు. జ్ఞానేంద్రియాలద్వారా మనకు గోచర మవుతూన్న ఈ బహువస్తు మయమైన విశ్వంలో ఒక అంశంగానే ఇసుక రేణువు మనకు పరిచిత మవుతున్నది. ఈ ఇసుక రేణువు ఉన్నది అని నేను అన్నప్పుడు, ఈ భౌతిక జగత్తు యావత్తు ఆ ఇసుక రేణువు వ్యక్తీకరణకు ఆధార భూతమైన సత్యానికి సాక్ష్యమిస్తుంది.

ఈ ఇసుక రేణువు తన అస్తిత్వాన్ని గుర్తించ వలసినదిగా నా విజ్ఞానానికి దరఖాస్తు చేసుకుంటుంది. ఇట్టి అద్భుత విజ్ఞానంతో కూడిన నా వ్యక్తిత్వానికి ఆధారభూతమైన సత్యాన్ని రుజువు చేయడానికి కూడా అట్టి సాక్ష్యం ఉండాలిగద ! నా వ్యక్తిగతాత్మను గురించిన సత్యానికి ఆధార భూతమైన మహా వ్యక్తిత్వం ఉన్నది. ఆ మహా వ్యక్తిత్వం యొక్క విజ్ఞానం ఇతర విజ్ఞానాలవలె గాక నిత్య ప్రత్యక్ష మైనది; స్వయం వ్యక్త శక్తి గలది.

మానవునిలో అతని వ్యక్తిగత జ్ఞానానికి, అనుభూతికి, ఆశయానికి, సంకల్పానికి, కర్మకు సంబంధించిన భిన్న భిన్న సత్యాలన్నింటిలో సమగ్రమైన ఏకత్వాన్ని చూడగల

ఆత్మచైతన్యాన్నే నేను వ్యక్తిత్వం అంటున్నాను. అది వ్యతిరేకార్థంలో వైయక్తిక భిన్నతకే పరిమితమై ఉంటుంది. వాస్తవార్థంలో జ్ఞాన ప్రేమ ప్రవర్తనల నిత్య వికాసం ద్వారా నిరంతరం అమరత్వం వంకకు పరిక్రమిస్తూ ఉంటుంది.

మనమందరం మనకు అసాధ్యములైన అపార విషయాలను గురించి తరచు కలలు కంటూ ఉండటానికి ఇదే కారణం. ఈ కలలు మనం సాధించిన విషయాలను కూడా శోభాయమానం చేస్తాయి. సర్వ జీవకోటిలో మానవుడే అనంత భవిష్యత్తులో జీవించే జీవి. మన వర్తమానం ఆ భవిష్యత్తులో ఒక భాగం. అస్ఫుట భావాలు, అరూప శక్తులు మన భావనాశక్తిని నిరంతరం పీడిస్తూ ఉంటవి. అందువల్ల, అవి మన చుట్టూ ఉన్న వస్తువులకంటె కూడా వాస్తవమైనవిగా మన మనస్సుకు గోచరిస్తున్నవి. మన వర్తమానాన్ని సజీవంగాను, అమరతా సూచకంగాను చేయడం కోసం మనభవిష్యత్తు సదా దాన్ని ముసురుకొని ఉండాలి. మానవతాశక్తి పుష్కలంగా ఉన్న ఆరోగ్యశక్తి మంతుడైన మానవుడు పరమార్థతః తాను అపరిమితుడనే అనుకుంటూ ఉంటాడు. ఇది మానవుని సహజ ప్రవృత్తి. అందువల్లనే, మన మహాత్ములందరు ఆ భగవదంశ సంశోభితులుగా గుర్తింప బడుతున్నారు.

ఈ విధంగా వారు పురుషోత్తముని సేవిస్తున్నారు. మనం ఉదాత్తులను అవడానికి, నిర్వక్ర పరాక్రమంతో కృషి చేస్తూ, ఆ విధంగా ఆ పురుషోత్తమునికి ప్రాతినిధ్యం వహించగల అర్హత సంపాదిస్తూ, అసాధ్య లక్ష్యాల వంకకు కొనిపోయే స్వతంత్ర పథాన్ని సుగమం చేస్తూ ఉండడమే మనం చేయగల ఉత్తమమైన, నివేదనాత్మకమైన కృషి.

అఖండమైన భవిష్యత్తే ఈ సహస్రాబ్దిలో ప్రధాన రంగస్థలం. మన స్వప్నాలలోను అదే; పరిపూర్ణతకు మార్గ దర్శకమైన మతంలోను అదే. వేయి సంవత్సరాలుగా మానవుడు కన్న కలలను గురించి మనకు తెలుసు. చరిత్ర లోని, విస్మృత జాతులు తమ అభిరుచులకు, ఆశయాలకు, ప్రేమకు, అనుగుణంగా తమ జీవితాలను తీర్చి దిద్దుకొని, ఉన్నతాశయాలలో ఉదాత్తతను, కార్య కలాపాలలో సౌందర్యాన్ని ప్రదర్శిస్తూ, ఆ పరతత్వాన్ని అనుభూతి లోకి తెచ్చుకొనడానికి చేసిన ప్రయత్నాలు వారి నాగరకతావశేషాలలో మనకు కనిపిస్తున్నవి. ఈ జాతులు ఒకటి వెంట ఒకటి అస్తమించి పోయినా, అవి సాధించిన ఘనమైన విజయాలను మాత్రం మనకు వదిలి పోయినవి. లౌకిక సామ్రాజ్య విజేతలుగా కాక, స్వర్గసీమారచయిత లుగా వారు కన్న కలలకు అవి శాశ్వత చిహ్నాలుగా నిలిచి ఉన్నవి.

మానవుడు తనను తాను సృజించుకునే కార్య

క్రమంలో ఏర్పరచుకొన్న ఆదర్శాలను, భావ లాలిత్యాలను మొత్తంగా, వాటి సంపూర్ణ రూపంలోనే మనం గ్రహించాలి. మన శక్తి సామర్థ్యాలలోను, ఉద్వేగాల లోను దేనినీ కేవలం చెడ్డదనిగాని, మంచిదనిగాని చెప్ప డానికి వీలులేదు. అవన్నీ ఆ మహా మానవ వ్యక్తిత్వంలోని అంశాలు. సందర్భశుద్ధిలేని స్థలాలలో అవి దుష్టమైనవిగా కనిపించవచ్చు. వాటి నన్నింటినీ సక్రమంగా శ్రుతిజేసి, మహా మానవుని దివ్య గానానికి మేళనం చేయడమే మన విద్యకు పరమార్థం. ఆటవిక మానవునిలోని పాశవిక ప్రవృత్తి నాగరక మానవునిలో సుసంస్కృతమై ఉదాత్త స్థాయి నందుకున్నది. నాగరక మానవుడు దివ్య మానవునికి మరింత సన్నిహితుడయాడు. ఈ నాగరక మానవుని విజయం ఆదిమ స్వభావాలను పరిత్యజించడం వలన గాక, వాటికి అద్భుత మైన సమన్వయం సాధించడం వలన, క్లిష్టమైన కళా శిక్షణ వలన, ఆయా చోట్ల వెలుగు నీడలను ఉచితమైన తీరులో సరిదిద్ది మన పరిపూర్ణ వ్యక్తిత్వానికి క్రొత్త విలువను కూర్చడం వలన సాధ్యమయింది.

ఈ విలువలో మనకు విశ్వాస మున్నంత వరకు మన ప్రజ్ఞ స్థిరంగా ఆ అమర మానవావిష్కరణోద్యమంలోనే నిమగ్నమై ఉంటుంది. మన సాహిత్యం, కళలు, గాథలు, సంకేతాలు, ఉత్సవాలు, ఆ అమర మానవుని తమలో మూర్తీభవింపజేసుకొన్న మహా పురుషుల చరిత్రలు — ఈ విశ్వాసానికి పుష్కలంగా దోహదం చేస్తున్నవి.

# ౯. కళాజీవి

ఈ వేద్య విశ్వవైశాల్యమంతటినీ మనస్సు చేత ఆవరించాలని విజ్ఞానశాస్త్రం మనను ప్రోత్సహిస్తూంది. సంచలనపరిణామాత్మకమైన ఈ విశ్వం యొక్క అంతరంగంలో నిక్షిప్తమై ఉన్న అనంతాత్మను స్వాత్మచే గ్రహించాలని మతాచార్యులు మనకు ఉపదేశిస్తున్నారు. ఈ సాకార జగత్తులో వ్యక్తమవుతూన్న పరమ పురుష వ్యక్తిత్వాన్ని మన అంతరంగసత్యంతో సామరస్యం గల ఆ అస్తిత్వ సత్యాన్ని-సాక్షాత్కరింప జేసుకోవాలని మనలోని కళాశీలత ఉత్సాహ పరుస్తూంది. ఈ సామరస్యమును గాఢంగా అనుభవింప లేనిచోట మనం కేవలం ప్రవాసులమై నిరంతరం స్వస్థానచింతోపహతులమై బ్రతుక వలసి వస్తుంది. మానవుడు స్వభావతః కళాశీలి. మానవుని చుట్టూ కనిపించే వస్తువుల భౌతిక రూపాలను మనస్సు యథాతథంగా, కేవలసాక్షీభూత దృష్టితో గ్రహించదు. ఆ వాస్తవిక సత్యాలకు నిరంతరం మానవ భావన, ఉద్వేగాలు క్రొత్త రంగులు దిద్దడం మూలంగా అక్కడ సదా సర్వ వస్తువులు ఆ మనస్సుకు అనుగుణంగా పరివర్తనం పొందుతున్నవి. జంతువుకి తన జన్మస్థాన పరిసరాలు ముఖ్యం. వాటిని గురించిన దర్శనానుభూతులు కేవలం భౌతికమైనవికావు; వాటిలో కళాత్మక సామరస్యం ఉన్నది. అది నిరంతర సృష్టి. స్వదే

శంలో మానవుని చైతన్యం విశృంఖలంగా ప్రవర్తిస్తుంది. అందువలన అతడు తన సంబంధ బాంధవ్యాలను విస్తరింప జేసుకుంటాడు. అవి ఆతని సృజనాత్మక వ్యక్తిత్వసంబంధులు. మానవుడు సమర్థమైన జీవనం గడపడానికి, వస్తుతత్వాలను, వాటిని గురించిన సూత్రాలను తెలుసు కోవాలి. స్వసుఖం కోసం తనకు అవసరమైన వస్తువులన్నిటితో అతడు సమరస సంబంధం ఏర్పరచుకోవాలి. మన సృష్టి ఈ సంబంధానికి సంస్కృత రూపం.

అంతస్సత్య సంబంధాలను నిరంతరం మననంచేయడం ద్వారా మనం సత్యాన్ని ఆత్మీయం చేసుకొనవచ్చు. ఇదే కళా సృష్టి. సత్యం వస్తుతత్వం మీద ఆధార పడినదికాదు; సంబంధసూత్రాలపై ఆధార పడినది. తత్వశాస్త్రం అనంత సత్యాన్ని అన్వేషిస్తుంది. విజ్ఞానశాస్త్రం అనంత వస్తుతత్వాన్ని అన్వేషిస్తుంది. పరమార్థం సత్యాన్ని పురుషునకు అనుబంధించే అనంత తత్వానికి నిర్వచనం. పరమార్థం మానవ సంబంధి; మనచైతన్య లక్షితం; అది మనను సంస్కరిస్తుంది; దానిని మనం వ్యక్తం చేస్తాం. మనం దానిని స్ఫుటంగా సాక్షాత్కరింప జేసుకొన్నప్పుడు, స్వాత్మ దర్శనం చేసుకొంటాం; అది మనకు ఆనంద హేతువు. దానిలోనే మన జీవనం; మనం దాని పరిధులను సదా విస్తృతం చేసుకుంటాం. మన కళలు, కావ్యసాహిత్యాలు మానవుని ప్రధాన లక్షణం అయిన ఈసృజన క్రీడనే అభివ్యక్తం చేస్తున్నవి.

మానవులు తమ సృజనాత్మక క్రియలన్నిటిలో ఆ పురుషోత్తముని, ఆ అనంతుని, ఆ సృష్టి కర్తను దర్శించాలి; అనుభవించాలి; ఆయనకు ప్రాతినిధ్యం వహించాలి. తన సృష్టిలో యథార్థమైన దానిపట్ల తన అనుభూతి అనంతమై అమరమై ఉండాలని మానవుని ఆకాంక్ష. ఆ యథార్థ సత్యం యొక్క ఆహ్వానానికి మానవుని ప్రత్యుత్తరమే కళ.

---

# ౧౦. మానవుని ప్రకృతి

మానవునకు స్వాత్మను గురించిన వాస్తవ చైతన్యం కలిగిన నాటినుండి అతనికి మరొక అద్భుత శక్తిని గురించిన చైతన్యం కూడా కలిగింది. అదే సామరస్యశక్తి. ఈ శక్తి మానవునిద్వారా మానవ సమాజంలో వ్యక్తమవుతున్నది. వ్యక్తికీ వ్యక్తికీ గల బాంధవ్యానికి ఇదే సున్నితమైన సాధనం. ఈ బంధుత్వం ప్రయోజనపురస్కృతమైనది కాదు, కేవలం తత్పరమసత్యాభివ్యక్తి మాత్రమే దానిలక్ష్యం. అది లెక్కకట్టి తేల్చే మొత్తంకాదు; కేవలం జీవనశోభ. ఈ సర్వవ్యాప్తసామరస్య శక్తి దివ్యమైనదనీ, మానవుడు తన లోని వ్యక్తిగత విషయాలన్నింటినీ త్యాగం చెయ్యాలని అది కోరుతున్నదనీ, పరిమితాత్మ అవధులన్నింటిని అతిక్రమించిన తన స్వాతంత్ర్యాన్ని వ్యక్తంచేయగల తన పరమార్థం ఆ సామరస్యంలోనే ఇమిడి ఉన్నదనీ ఎలాగో మానవుడు గ్రహించాడు.

ఈ సామరస్య శక్తిపట్ల మానవుని భక్తి విధేయతలే అతని మతంలో వ్యక్తమవుతున్నవి. అతని దేవతలు ఈశక్తికి సంకేతాలు. అందువల్లనే, ఆదిలో మానవుని దేవతలు ఆటవికదేవతలు అవటం, భిన్న భిన్నజాతులు ఒకేవిధమైన దేవతలను కొలవడం సంభవించింది. మానవ సామరస్యాన్ని గురించిన చైతన్యం విస్తృతమైన కొలది,

అతని దేవతలుకూడా ఐక్యమయి ఏకేశ్వరుడుగా అతనికి సాక్షాత్కరించారు. మానవైక్యమును గురించిన సత్యమే మానవదేవుని గురించిన సత్యమని ఆవిధంగా తేలిపోయింది.

సంస్కృతంలో మతాన్ని ధర్మమని వ్యవహరించడం కద్దు. మనను దృఢంగా పట్టి ఉంచే బాంధవ్యసూత్రం, అని ఈ పదానికి ఉత్పత్త్యర్థం. ఒక వస్తువుయొక్క స్వభావం, అని లాక్షణికార్థం. ఉదాహరణకు : ఉష్ణత అగ్నికి ప్రధాన ధర్మం. కొన్ని పరిస్థితుల్లో ఆగుణం కనిపించకపోయినా అదే అగ్ని ప్రధాన ధర్మం.

అమరమానవుడగు పురుషోత్తముని సహజగుణాలను తాను అలవరచుకొనడానికీ, అభివ్యక్తం చేయడానికీ, ఆయనలో సంపూర్ణ విశ్వాసం ఏర్పరచుకొనడానికీ మానవుడు సాగిస్తున్న ఉద్యమమే మతం. ఈ గుణాలు మానవ వ్యక్తులందరిలో సహజంగా ఉన్నట్లయితే మతం అనవసరం. మన తాత్కాలిక ముఖ్యావసరాలను తీర్చుకొనడానికి మనలోని పాశవికప్రకృతి కలిగించే ప్రేరణలతోనే మనచరిత్ర ప్రారబ్ధమయింది. మనలో అంతకన్న లోతుగా మరొక రకమైన ప్రేరణల వాహిని తద్విరుద్ధమైన దిశకు ప్రవహిస్తూంది. ఇది విశ్వమానవ జీవన వాహిని. ఈ విరుద్ధవాహినులను సమన్వయంచేయడమే మతలక్ష్యం. పాశవిక స్వభావమును మానవ పరతత్త్వానికి లోబరచడం ద్వారా మతం ఈ

లక్ష్యాన్ని సాధించాలి. మనం వేరు వేరు పేరులతో, వేరు వేరు రూపాలలో సంభావిస్తూన్న ఆ అనంత మానవునిలో మనకు విశ్వాసం (భక్తి) కుదిరితే ఈ లక్ష్య సాధన సులభం అవుతుంది. ఈ ఉభయప్రకృతుల మధ్య గల వైరుధ్యం ప్రబలమైనది. అందువల్ల, మతనైష్ఠికులు తమ ప్రధానావసరాలను కూడా పరిత్యాగంచేసి, ఆ పరమ పురుషుని గురించిన సత్యాన్ని ప్రతిపాదించే తమ ధర్మాన్ని అభివ్యక్తం చేయడంకోసం, ప్రాణాలనుకూడా తృణప్రాయాలుగా వదిలారు.

ఆ పరమ పురుషసాక్షాత్కృతి మన భావనాసాధ్యం; అంతేగాని మన మనస్సు చేయగల కల్పనకాదు. మానవ వ్యక్తులందరికన్న విశిష్ట సత్య స్వరూపుడైన ఆ పురుషోత్తముడు తన విస్తృత మహావ్యక్తిత్వంతో మననందరను అధిగమిస్తాడు. ఆయన మహాలక్ష్యానుగుణమైనభావ పరంపర వాస్తవ సంఘటనల నే అభ్యంతరాలన్నింటినీ అధిగమించి పరిపూర్ణ సత్యంవంకకు పురోగమిస్తున్నది. ఆయన విరాడ్రూపంలో వసించే మానవ వ్యక్తులమందరం ఆయన మహాలక్ష్యంతో బుద్ధిపూర్వకమైన సామరస్యం కలిగి ఉండవచ్చు; లేకపోవచ్చు. ఆయన మార్గానికి అవరోధాలు కల్పించి మన వినాశాన్ని మనమే కోరితెచ్చుకొననూవచ్చు. మనం బుద్ధిపూర్వకంగా ఆయనతో సహకరిస్తూ, బాధా త్యాగాలలో

ఆనందానుభూతి పొందగలిగినప్పుడే మనం నిజమైన మతానుభూతి సాధించగలుగుతాం. ఆయనయెడ మన ప్రేమ (భక్తి) ద్వారానే మనం ఆ మహాత్మలోనుండి ప్రసరించే ప్రేమాను గుర్తించ గలుగుతాం.

"చనిపోయిన పిదప కూడా నశించి పోనివాడు, చిరంజీవి"- ఇది చైనా దేశపు మహాయోగి లావోజే సూక్తి. అనగా "అట్టి వ్యక్తి ఆ అమరమానవుని జీవితంలో జీవిస్తూ ఉంటాడని అర్థం. ఆ చిరజీవనకాంక్షే మానవులను, యథార్థ జీవనంకోసం ఉద్యమించడానికి ప్రోత్సహిస్తూంది." "అధర్మంతో మానవుడు అభ్యుదయం సాధించవచ్చు, అందలా లెక్కవచ్చు, కోరినవన్నీ పొందవచ్చు, శత్రువులను జయించవచ్చు, కాని అతనిమూలం మాత్రం నశిస్తుంది," - అని మన స్మృతులు ఘోషిస్తున్నవి. అల్పకాలికమైన భౌతిక జీవితంకన్న యధార్థతరమైన జీవితం మానవునకు ఉన్నదని ఈసూక్తి సూచిస్తూంది. జ్ఞాన దయా క్రియా శీలాలలోను, సృజనాత్మక రచనలలోను అమర మానవతను అభివ్యక్తం చేయగలిగినప్పుడే మన జీవితం సార్థకం అవుతుంది. చరిత్ర ప్రారంభమైన నాటినుండి మనం తరచు తక్కినవన్నీ త్యాగం చేసి అయినాసరే ఈ జీవిత సార్థక్యాన్నే కాంక్షిస్తున్నాం. అనగా, మనం మరణానంతరంకూడా అంతరించకుండా ఉండడంకోసం, ఆ అమర మానవుని మనలో సాక్షాత్కరింప

చేసుకొనడానికి ప్రయత్నిస్తున్నామన్నమాట. ఉపనిష ద్వాక్యమిది: "తంవేద్యంపురుషంవేదయథామావోమృత్యుః పరివ్యథః"– "ఆ పరమపురుషుని సాక్షాత్కరింప జేసికొనుము; నీకు మృత్యువ్యథఉండదు."

ఈ మాటలో అర్థం విపరీతంగా కనిపిస్తూంది. ఇంద్రియజ్ఞానంచేతగాని, హేతువాద వివేకంవల్లగాని దానిని రుజువు చేయలేము. కాని మానవులపై ఈ సూక్తి ప్రభావం అతి ప్రబలమైనది. తమ జీవితం ఆ పురుషోత్తమూయత్త మైనదని గుర్తించి, దానిని నిలబెట్టు కొనడానికిగాను మాన వులు తమ భయాలను, పేరాసలను వదులుకొన్నారు; తమ పాశవిక ప్రకృతికి సంబంధించిన సహజప్రేరణలనన్నిటిని ప్రతిఘటించారు. వారిలో చాలామంది అట్టిజీవితంలో తమకు గట్టినమ్మకం లేకపోయినా, దానికొరకు తాము గట్టిగా యథార్థమని విశ్వసిస్తూన్న వాటినన్నిటినీ పరిత్య జించడానికికూడా సంసిద్ధులుగా ఉండడం మరీ చిత్రమైన విషయం.

దీనినే మనం "ఆధ్యాత్మిక సత్యం" అంటున్నాము. ఈమాట అస్పష్టంగానే ఉంది. అయినప్పటికీ, ఈ భౌతికా స్తిత్వ భిత్తికలను దూసుకొని వచ్చి మనకు కనిపిస్తూన్న ఈ మందకాంతే మనకు భౌతికమానవునిలోకన్న ఆధ్యాత్మిక మానవునిలో ఎక్కువ నమ్మిక కుదిరేటట్టు చేస్తున్నది.

ఇప్పుడేకాదు, చరిత్రలో ఆదినుండి, అస్తిత్వానికి సంబంధించిన ఈ బాహ్యావిషయాలు పరమసత్యాలు కావనే ఒక భావం మానవునకు ఉంటూవచ్చింది. తెరవెనుక ఉన్న అద్భుతాదృశ్యశక్తితో తాను సంపూర్ణ సామరస్యంతో జీవించగలగడమే తనకు పరమ శ్రేయస్కరమనీ, ఈ వస్తుమయజగత్తులోని భౌతిక జీవనవ్యాపృతికన్న విశిష్టమైన ఉదాత్తతను, తనకు కలిగించగల విస్తృత జీవనము దానివలన తనకు లభ్యమవుతుందనీ మానవుడు విశ్వసిస్తూ వచ్చాడు.

మన భౌతికశరీరంయొక్క సమగ్రవాస్తవికత ఈ భౌతిక జగత్తులో మనకు కనిపిస్తుంది. ఈ భౌతికజగత్తే నిజానికి మన విశ్వశరీరం అని చెప్పాలి. అదిలేకపోతే మన వైయక్తికశరీరం తన ధర్మాలను తాను నిర్వర్తించలేదు. మన భౌతికజీవితం ఈ భౌతికజగత్తుతో తనకుగల అనుబంధాలలో క్రమ క్రమంగా ఎక్కువస్వాతంత్ర్యాన్ని సాధించడం ద్వారా, తన సార్థకతను తాను గ్రహిస్తుంది. అలాగే, ఏదో ఒక ఆదర్శ పరిపూర్ణతను గురించిన చైతన్యం ద్వారా, మనకు ఆంతరంగిక సంపూర్ణతా భావమును కలుగచేయగల సుందరమైన ఉదాత్తమైన సత్యంద్వారా మన యాథార్థ్యమును గురించిన ఉదాత్తభావనద్వారా; – మనం కూడా మన ఆత్మపరమార్థాన్ని గ్రహించగలం. అది మాన

వుని విశ్వాసాన్ని, (అది అస్పష్టమైనదే కావచ్చు) మానవ జగత్తు అంతటికీ సంబంధించిన వాస్తవిక పూర్ణాదర్శంలో అతని విశ్వాసాన్ని బలపరుస్తుంది. దానిని గురించిన అతని భావన, అతని చైతన్యం సాధింపగలిగిన అభ్యుదయ దశ ననుసరించి రమణీయంగా గాని, అస్తవ్యస్తంగా గాని, తేజో వంతంగా గాని, అస్పష్టంగా గాని కనిపించవచ్చు. అయితే, ఆ మతముయొక్క నామ రూపాలెట్టివైనా, మానవ పరిపూర్ణతను గురించిన మానవుని ఆదర్శానికి వ్యక్తుల మధ్య గల ఐకమత్యానుబంధమే, అనగా మానవవ్యక్తిత్వా మరతకు సంకేతమైన పరమాత్మలో పర్యవసించే సామరస్యమే ప్రాతిపదిక. మానవ నాగరకతలో ఈ భావం ప్రస్ఫుటంగా వ్యక్తమయినప్పుడు సత్యసంపద వెల్లివిరుస్తుంది. అయితే దాని ప్రయోజనం మానవుని ఆత్మసాక్షాత్కారమేగాని, కేవల జీవన సౌఖ్య సంపాదన కాదు. అయితే ధర్మం అనబడే ఈ సృజనాత్మ కాదర్శం భంగపడి, బహు సంఖ్యాకులైన ప్రజలు ఉద్రేక వివశులైనప్పుడు, అతి విదగ్ధత అనే తన చితిని తానే రగిలించుకొన్న నక్షత్రము వలె నాగరకత భగ్గున మండి భస్మీభూతమైపోతుంది.

బాల్యంలో నేను ఏవో చింపిరివస్తువులను పోగుచేసి వాటితో బొమ్మలూ, ఆటవస్తువులూ తయారుచేసేవాణ్ణి. నేను ఆడే ఆటలుకూడా నేనే స్వయంగా ఊహించుకొని

తయారు చేసేవాణ్ణి. నా క్రీడోత్సాహంలో నాతో ఆడవచ్చిన సావాసగాళ్ళందరు పాలుపంచుకునేవాళ్లు. వాళ్ళంతా వచ్చి ఆ ఆటలలో పాల్గొనడంమీదనే నా ఆనందం ఆధారపడి ఉంది. ఆ మా శైశవ స్వర్గంలోనికి ఒకరోజున గొప్పవాళ్ల దుకాణాలనుంచి ఒక ఆకర్షణ వచ్చి పడింది. ఆంగ్లేయుల దుకాణములో కొన్న ఒక పెద్ద బొమ్మను నా సావాస గాళ్ళలో ఒకడికి ఎవరో బహూకరించారు. ఆ బొమ్మ అద్భుతంగా, జీవం ఉట్టిపడుతూంది. ఆ కుర్రవాడు తన బొమ్మను చూసుకొని మురిసిపోతూ మాతో ఆడటం మానేశాడు. ఖరీదైన ఆ బొమ్మను మమ్మల్నెవరినీ ముట్టుకో నివ్వకుండా దూరంగా కూచుని, అది కేవలం తన సొత్తు అని ఆనందిస్తున్నాడు. చవకరకం బొమ్మలతో ఆడే మిగిలిన కుర్రవాళ్ళందరికంటె తాను అధికుడనని అనుకుంటున్నాడు. అతనికే చరిత్రకారుల ఆధునిక భాష తెలిసిఉంటే చిరాకు కలిగించేటంత సంపూర్ణ సుందరంగా తయారుచేసిన ఆ బొమ్మ తనకి ఉన్నది గనుక, మా అందరికన్న తాను నాగరికుడనని అనేవాడు.

ఆ అమితోత్సాహంలో ఆ కుర్రవాడు ఒక్క విషయం మరచిపోయాడు. ఆ బొమ్మకన్న ఎన్నోరెట్లు ఎక్కువ పరి పూర్ణమైనదానిని, మానవహృదయంలో సదా ప్రత్యక్షంగా ఉండే పరిపూర్ణ శిశుత్వసాక్షాత్కారాన్ని లేక శిశు

ధర్మాన్ని ఈ నూతనాకర్షణ తనకు దూరం చేసిందన్న విషయాన్ని ఆ క్షణంలో ఆ కుర్రవాడు లెక్క చేయ లేదు. ఆ బొమ్మ కేవలం అతని భాగ్యాన్ని వ్యక్తం చేస్తుంది. అతనిని వ్యక్తంచేయదు; శిశువులోని సృజనాత్మక శక్తిని వ్యక్తం చేయదు; ఆటలో శిశువు పొందే అపారా నందాన్ని వ్యక్తం చేయదు; క్రీడా జగత్తులో తన తోడి వారైన మిగిలిన బాలురతో అతని ఐక్యభావాన్ని వ్యక్తం చేయదు. నాగరకత మానవుని ధర్మాన్ని వ్యక్తం చేయాలి; కేవల మతని తెలివి తేటలనూ, శక్తినీ, సంపదనూ కాదు.

ఒకసారి నేను నూరు మైళ్లదూరంనించి కలకత్తాకు మోటారులో ప్రయాణం చేయవలసి వచ్చింది. కారులోపల ఏదో యంత్రం చెడడంవల్ల, మేము అరగంటకొకసారి తప్ప కుండా ఆగి నీళ్లు పొయ్యవలసి వస్తూంది. బలవంతంగా ఆగ వలసి వచ్చిన మొదటి గ్రామంలో, మేం ఒకణ్ణి పిలిచి మాకు నీళ్ళు కావాలని అడిగాము. మాకు నీళ్లు సప్లయి చేయడానికి పాపం అతడు చాలా శ్రమపడవలసి వచ్చింది. అతని కష్టా నికి మేము ఏదో ఇవ్వబోయాం. అతడు నిరుపేదవాడు. అయినా, మాదగ్గర ఏమీ పుచ్చుకోనన్నాడు. తరువాత ఇంకా పదిహేను గ్రామాలలో ఇదే సంఘటన జరిగింది. ప్రయాణికులకు అడుగడుగుకీ నీరు అవసరమయ్యే – ముఖ్యంగా వేసవిలో నీరు దొరకడమే కష్టమయ్యే – ఉష్ణదేశంలో గ్రామ

వాసులు నీరు అవసరమైన వారందరికీ నీరు సప్లయి చేయడం తమ ధర్మంగా భావిస్తున్నారు. గిరాకీ, సప్లయిలకు సంబంధించిన అప్రతిహతమైన ఆధునిక సిద్ధాంతం ప్రకారం వారు అదొక వ్యాపారంగా పెట్టుకొని సులభంగా ధనార్జన చేయవచ్చు. వారు తమ ధర్మమనుకునే ఆ ఆదర్శం వారి జీవితాలలో జీర్ణమయిపోయి ఉంది. అదేదో గొప్పగుణమనికూడా వారు అనుకొనరు.

సాధుపురుషుని లావోజే ఈ విధంగా అభివర్ణించాడు. "అతడు వేగపడతాడు, కాని ఆశపడడు; కర్మ చేస్తాడు, కాని గర్వపడడు; ఘనతను సాధిస్తాడు, కాని తన ఘనత తాను చెప్పుకోడు; కనుక, ఆ ఘనత అతనిని విడిచి పెట్టదు." మనకు వెలుపల ఉన్నదానిని మనం అమ్మవచ్చు, కాని మన అస్తిత్వంతో ఐక్యమయిన దానిని మనం అమ్మలేము. సమగ్రసత్యదర్శనం పరిపూర్ణతా స్వర్గసంబంధి; అహంకారనరకానికి దూరమైన విషయం. దానిని చేరుకొనడానికి సుదీర్ఘ నాగరకతాభ్యుదయ యాత్ర అవసరం.

అపరిచిత వ్యక్తికి నీళ్లు సప్లయి చేయడానికి తాను కొంత శ్రమపడినా, దానికి ప్రతిఫలం నిరాకరించి, తాను ఏదో ఉపకారం చేసినట్లుకూడా భావించక పోవడం అల్ప విషయంగానే కనిపించవచ్చు. దానితో పోల్చినప్పుడు నిమిషానికి అసంఖ్యాక వస్తువులు ఉత్పత్తి చేయగల శక్తి

చాలా ఘనమైనదిగా కనిపించవచ్చు. ఆహారపదార్థాల వ్యాపారాన్ని స్తంభింపచేసి ప్రపంచంలో కృత్రిమమైన క్షామం కల్పించడం ద్వారా లక్షలార్జించే మహా సంపన్నుడు తన కారులో గంటకు అరవై మైళ్ళ వేగంతో మన గ్రామాలగుండా ప్రయాణించేటప్పుడు ఈ అల్పవిషయం తనంతవాడు పట్టించుకొనవలసినది కాదనుకోవచ్చు.

ఔను; అది స్వల్పమైన విషయమే, - పెద్దమనిషి పెద్ద మనిషిగా ఉండటమంత స్వల్పమైన విషయం. కాని ఆ స్వల్ప శీలం అనేక శతాబ్దుల సంస్కృతికి ఫలితం. దానిని అనుకరించడం కష్టసాధ్యం. ఒక చక్రం తిప్పడంతో కొన్ని వేల సూదులకు ఒకేసారి బెజ్జం పొడిచేపని కొన్ని సంవత్సరాలలో నేర్చుకొనడం సాధ్యం కావచ్చు. కాని, ఒకడు తన శత్రువును, లేక అపరిచితుని ఆదరించడం అనే గుణం అలవడడానికి బహు శతాబ్దుల శిక్షణ అవసరం. ఈ స్వల్పశీలం తన విలువను తాను ప్రకటించుకోదు; ప్రతిఫలం కోరదు. అందువల్ల ఆధ్యాత్మిక వ్యక్తీకరణకు సంబంధించిన ఈ స్వల్ప శీలం నాగరకతా తరువున బుట్టిన ఉత్తమ ఫలం అని అధికార వ్యామోహం గలవారు గ్రహించరు.

నాగరకాయుధాలు గల దురాశాశక్తివలన అపురూపమైన అంద చందాలు గల ఒక పక్షిజాతి పూర్తిగా నశించి పోయినట్టులు, ఒకానొక వికలన క్రమం ఈ ఉదాత్త

జీవనఫలాన్ని క్రమంగా కుళ్ళిపోయి నశించేటట్లు చేస్తుంది. మాకు సెళ్లుసప్లయి చేసిన గ్రామీణులు మావద్దనుండి ప్రతి ఫలమపేక్షించినది ఒకే ఒక్కచోట. అదీ, కలకత్తా సమీపంలోని ఒక శివారు గ్రామంలో. అక్కడ నీరు సులభంగా పుష్కలంగా దొరుకుతుంది. నాగరకతాభ్యుదయం అన్ని దిశలనుండి అక్కడకు వేగంగా వచ్చి పడుతూంది. ఆ ఉదాత్త జీవనఫలానికి పట్టే దుర్దశ అక్కడే నాకు ప్రత్యక్ష మయింది. ప్రజలలో ఒకప్పుడు ఉండిన శీలసామరస్యం నశించి పోతూందని దీని వలన రుజువవుతూంది. అది అంత రాత్మల సామరస్యం. విశ్వజనీనతాదృష్టిలో ఈ సామరస్యం వ్యక్తిగతావసరాలకు ప్రాధాన్యం ఇచ్చే సామాన్యాత్మకన్న సర్వవిధాల గొప్పది. సామాన్యాత్మ స్వలాభాపేక్షవల్ల సౌందర్యౌదార్యాలను నశింపజేసుకుంటుంది. అది కేవల స్వార్థపరతనే తప్ప, ఆ విశ్వమానవుని వ్యక్తం చేయలేదు.

"మానవ సంగీతమును అతనికి ప్రసాదించినవారెవరు?" ఈ ప్రశ్న అథర్వవేదంలోనిది. పక్షులు ఏక స్వర గానం లేక అత్యల్ప స్వర మేళన గానం చేస్తున్నవి. మానవుడు చిత్ర విచిత్రమైన బహుస్వర సమ్మేళన సామరస్యాలతో అపార సంగీత ప్రపంచాన్ని సృష్టించుకుంటున్నాడు. ఆ సంగీతం అద్భుత సృష్టి రహస్యాన్ని అతనికి సాక్షాత్కరింపజేస్తుంది. అది అనిర్వచనీయం. సంఘటనలను సత్యాలుగా పరిణమింప

జేసే ఒకానొక అంతర్లయను ఆ సంగీత భణితులు గాయకుని అనుభూతికి అందిస్తున్నవి. వాటి వలన అతనికి కలిగేది కేవల శ్రవణేంద్రియానందమే కాదు. సంపూర్ణ ఐక్య భావాదర్శంవల్ల కలిగే సంతృప్తి అతని అంతరాత్మకు లభిస్తుంది. అట్టి పరిపూర్ణతలోనే సత్యం అభివ్యక్తం అవుతుందని ఎలాగో మానవుడు తెలుసుకున్నాడు. తన అత్యుత్తమ స్వరూపాన్ని తాను అన్వేషించుకొనేటప్పుడు, సంగీతంలో వలె శ్రుతి సామరస్యాలనే అతడు సాధనంగా చేసుకుంటాడు. విశ్వమానవుని అభివ్యక్తం చేయాలన్న మనలోని ప్రేరణే కళలకు, సాహిత్యానికి మూలం. రేఖలు, రంగులు, కదలికలు, పదాలు, భావాలు అనిర్వచనీయమైన సామరస్యం పొందడంతో ఆ కళలన్నిటికి స్థూల దృష్టికి కనిపించే విలువకన్న ఉదాత్తమైన, గంభీరమైన ప్రయోజనం ఏర్పడుతుంది. అవి మన చిత్తగవాక్షాలను తెరచి, మానవునికి అనంతత్వంలోకి తొంగిచూచే అవకాశం కల్పిస్తున్నది. అవి విశ్వమనః ప్రేరితములు; కనుక మనం ఏదేశానికి, ఏకాలానికి చెందినవారమైనా మనకందరికీ వారసత్వంగా లభించే అక్షయ సంపదలవి. మానవ వ్యక్తి తన కళలోనే కాదు; తన ప్రవర్తనలో కూడా మానవు లందరికీ వర్తించే సత్యసంశోధితమైన ఆదర్శానికి ప్రాధాన్యం ఇవ్వాలి. అతని ఉదాత్తతకు ఇది అవసరం. అనగా, అతడు తన ప్రవర్తనలోను

పరిసరాలలోను, శ్రుతి సామరస్యాన్ని సృజించాలి. ఆ సామరస్యం అతడు తనలో పరమాత్మను సాక్షాత్కరింప జేసుకొనడానికి ఉపయోగపడుతుంది. కనుక నాగరకత ఒక జాతి సృష్టి; ఆ జాతి సాధించిన విశ్వమానవాభివ్యక్తి.

నేను ప్రథమతః జపాను వెళ్ళినప్పుడు, ఈ మానవ జగత్తులోని రెండు అర్థాలను ఏకత్ర చూచే అవకాశం నాకు లభించింది. ఒక అర్థంలో సాంఘికాదర్శం, సౌందర్య పిపాస, వ్యక్తిగత నైతిక ధర్మం అనే ఖండాలు వర్ధిల్లుతున్నవి. రెండవ అర్థంలో ప్రపంచంలోని అన్ని ప్రాంతాలనుండి ఐశ్వర్యాన్ని తన తీరాలకు చేరవేసుకునే నిరంతర కాంక్షా స్రవంతి ప్రబలింది. జపాను ఒక అర్ధ శతాబ్దిలో అద్భుతమైన అభ్యుదయాన్ని సాధించగలిగింది. హఠాత్తుగా కలిగిన ఆపత్తులు, అవమానాలు ఒక్కసారిగా జపానుజాతి అభ్యుదయ దృష్టిని వికసింపజేసినవి. చైనా దేశానికి కూడా ఈవిధమైన జాగృతి కలిగింది. ఆ దేశీయులు అనేక సంవత్సరాల పాటు నిస్సహాయులై ఉన్నప్పుడు వారి జాతీయాత్మ గౌరవం తీవ్రమైన ఆఘాతాలకు గురి చేయబడడం వల్ల ఈ జాగృతి సంభవమయింది. వారి హృదయాన్ని గాయ పరచిన ఆ ఆయుధ ప్రయోగంలో అచిరకాలంలోనే నిస్సం దేహంగా వారు కూడా సిద్ధహస్తులు కాగలరని నానమ్మకం. అయితే, జపాన్ నాగరకతకు తమ ప్రాణాల నొసగిన

ఆదర్శాలు మాత్రం, యుగ యుగాలుగా బహు తరాలుగా భక్తి ప్రపత్తులచే సాకి రక్షింపబడినవి. ఆ కాలంలో అవకాశాల కోసం నిరంతరారాటం వారికి లేదు. జీవిత రామణీయక సుమ వికసనానికి, విజ్ఞాన ఫల పరిణతికి అవసరమైన సువిశాల విరామారామాలు వారికి ఉండేవి.

జపానులో మనకు ఒకవంక, అసంఖ్యాక యాంత్రిక పరికరాలతో, అతి నవీనమైన ఉత్పత్తి యంత్రాలతో, విధ్వంసన యంత్రాలతో కూడిన ఆధునిక పారిశ్రామిక సంస్థలు కనిపిస్తున్నవి. మరొక వంక, వాటికి విరుద్ధంగా, తేలికగా చిట్లిపోయే లలిత సుమ గుచ్ఛ పాత్రలు, అందమైన చిన్న పట్టు గుడ్డలు, నిరాడంబరమైన శిల్పసంపద, శారీర విలాస రూపములైన మధుర భావ గీతాలు కనిపిస్తున్నవి. జపానుప్రజల సాంఘికమర్యాదలుకూడా ముఖ్యంగా గమనింప దగినవి. వాటి కోసం వారు దినదినం ఎంతో కాలహరణాన్ని కష్టాన్ని సహించవలసి ఉంటుంది. ఈ గుణాలు యథార్థ వస్తుతత్వజ్ఞానం వలన సిద్ధించినవి కావు. సత్యసంపదను గురించిన గాఢమైన చైతన్యంలోనుండి అంకురించినవి. ఆ చైతన్యం పరిపూర్ణ దశ పొందడానికి ఎంతో కాలం పడుతుంది. టెలిగ్రాఫ్ తీగలు, రైల్వేలైనులు, వస్తూత్పత్తి యంత్రాలు, మానవ మారణ యంత్రాలు తయారు చేసు కొనడంలో జపాను ప్రజ్ఞా నైపుణ్యాలు అట్టి శిక్షణావకాశాలు గల ఇతర దేశాల

ప్రజ్ఞలను బోలినవే. కాని జపానుదేశస్థుల కళామయజీవితం, వారి చిత్రశిల్పం, వారి సౌశీల్యం, మత సాంఘిక వ్యవహారాలలో వారు రూపొందించుకున్న సుందర విధానాలు జపాను వ్యక్తిత్వాన్ని, ఆ జాతిధర్మాన్నీ వ్యక్తం చేస్తున్నవి. వాటికి విలువ ఏదైనా ఉండాలంటే, అది విలక్షణమైనవిగానే ఉండాలి; అనంత మానవుని ప్రతిబింబించేవిగానూ ఉండాలి.

"అనంత తత్త్వాన్ని గురించిన అజ్ఞానమే ఆవేశోద్వేగాలకు మూలం," అని లావోజే సూక్తి. "మనం మరణించవచ్చు; కాని నశించి పోరాదు," అని కూడా ఆయన హెచ్చరించాడు. మనం మరణించినప్పుడు మన భౌతిక జీవిక అంతమవుతుంది. మనం మానవతను కోల్పోయినప్పుడు మనమే నశించి పోతాం. మానవతే మనుష్యధర్మం.

ఈ ప్రపంచంలో మనకు స్పష్టంగా కనిపిస్తున్నది నిరంతర సంచలనాత్మక పదార్థాల సంభ్రమణం. మనం కనుగొనవలసినది – ఈ ప్రపంచ పరివ్యాప్తమై ఉన్న మానవతా పరమసత్యం. కేవలం సంచలనానికి విలువ యేమీ లేదనీ, అది ప్రమాదకరమైన సోమరితనానికి చిహ్నం అయి ఉండవచ్చుననీ మనం ఎన్నడూ విస్మరించకూడదు. ఒకానొకప్పుడు భారతదేశంలో బుద్ధభగవానుడు కలిగించిన విస్తృతాత్మ చైతన్యం – మానవుని వాస్తవ గౌరవాన్ని గురించిన విశ్వజనీన వివేక వ్యాపనోద్యమం – కొన్ని

శతాబ్దుల పర్యంతం సాగింది. ఆ ఉద్యమ ఫలితంగా సాహిత్య శిల్ప విజ్ఞాన వికాసాలు, మానవోపయోగకరము లైన అనేక ఇతర ప్రయోజనాలు కలిగినవి. ఈ ఉద్యమం అదనంగా జ్ఞానం, అధికారం సంపాదించాలనే ఆశా ప్రేరణ వల్లగాని, ఇతర దారుణ ఉద్రేకాలనుంచిగాని, ఉదయించి నది కాదు. అది ముక్తి సాధనోద్యమం. స్వధర్మాన్ని, అనంత మానవుని గురించిన సత్యాన్ని సాక్షాత్కరింప జేసుకొన గలగడమే ఆ ముక్తికి ఫలితం.

లావోజే ఒకానొక ప్రసంగంలో ఇలా చెప్పాడు. "ధర్మబుద్ధి గలవారు తమ విధులన్నీ సక్రమంగా నిర్వర్తిస్తారు. ధర్మ బుద్ధి లేనివారు తమ జీవితావసరాలను గురించే ఆరాట పడతారు." ఆంతరంగిక ధర్మానుబంధి కాక కేవలం బాహ్యా కర్షణకు సంబంధించిన అభ్యుదయానికి అంతులేని మన అవస రాలను తీర్చడమే లక్ష్యం. కాని, నాగరకత ఆదర్శ సంబంధి. త్యాగశక్తి అనే అపారమైన శక్తిని నాగరకత మనకు కలిగిస్తూంది. ఆశక్తి అనంత తత్త్వాన్ని సాక్షాత్కరింపజేసు కొని సృష్టిని ప్రోత్సహిస్తుంది.

ఆ చైనాదేశ మహర్షే "జీవన విస్తరణం వరప్రసాదం" అన్నాడు. ఆ జీవన విస్తరణం అనంత జీవన సాక్షాత్కార సాధనం అయినా అది జీవన సామరస్య నియమాలను ఉల్లం ఘించదు. పర్వతాలమీద పెరిగే పైన్‌వృక్షం ఎత్తుగా విశా

లంగా పెరుగుతుంది. ఆ మహావృక్షంలో అంగుళం అంగుళం తన అంతస్సమతేల్యానికి సంబంధించిన లయను కాపాడు కుంటుంది. అందువల్ల అంతటి స్వరూప స్థౌల్యంలో కూడా దానిలో ఆత్మ నిగ్రహంతో కూడిన మాన గాంభీర్యం ఉంటుంది. ఆ వృక్షం, దాని అవయవాలూ కూడా ఒకే ప్రధానమైన శ్రుతికి మేళవింపబడి ఉన్నవి. దానిలోని కలప, పూవులు, ఆకులు, పళ్లు ఒకే మహా వృక్షంలో అంతర్భాగాలు. వాటి విస్తృతి అతి స్థౌల్య వ్యాధి కాదు; అది వాటి సౌభాగ్యం.



# ౧౧. జీవన్ముక్తి

మన దైనందిన జీవన వ్యాపారాలలోని సామరస్య మే మన భౌతిక శరీరానికి, ఈ భౌతిక జగత్తుకీ నడుమగల సామరస్యానికి ఆధారం. మన జీవితం అప్పుడప్పు కొన్ని ఆపదలకు గురి అవుతూ ఉంటుంది. ఆ ఆపదలు మన జీవన వ్యాపారాలలోని సామరస్యానికి భంగం కలిగిస్తున్నవి. అట్టి ఆపదలను మనం వ్యాధులంటున్నాం. అలాగే మన వివే కానికి భంగపాటు కలిగించే ఆపదలు కొన్ని ఉన్నవి. వాటి వలన మన మానసిక వివేకానికి, విజ్ఞాన విశ్వానికీ మధ్యగల సామరస్య సంబంధానికి దెబ్బతగులుతుంది. ఈ ఆపదలను మనం మూర్ఖత అనీ, అవివేకమనీ, ఉన్మాదమనీ వ్యవహ రిస్తున్నాం. అవి మన మనోనిగ్రహశక్తికి అతీతంగా పరిణ మించిన ఉద్వేగాలు. మన వ్యక్తిత్వంలోని సమతౌల్యాన్ని అస్తవ్యస్తం చేస్తున్నవి. ఆ ఉద్వేగాలు మానవాత్మకు, విశ్వమానవాత్మకు నడుమ గల సామరస్యాన్ని మాయం చేస్తున్నవి. వాటికి మనం పాపాలు అని పేరు పెట్టాం. ఈ అవాంతరాపదలు శారీరకంగాను, మానసికంగాను, ఆధ్యాత్మికంగాను ఆ విశ్వపురుషుని సాక్షాత్కారానికి అభ్యంతరకరాలు. వీటి వలన భౌతిక, మానసిక, ఆధ్యాత్మిక రంగాలలో మన యథార్థ ముక్తి అసమగ్రం అవడం, లేక అస్తవ్యస్తమవడం జరుగుతుంది.

భారత దేశంలోని ఉదాత్త మతాలన్నీ ముక్తి మార్గాన్ని అభివర్ణించి చెప్తున్నవి. ముక్తి అనగా ఆత్మ విమోచనం. మానవులందరికీ తమ వ్యక్తిత్వాన్ని గురించిన జ్ఞానం ఉన్నది. ఈ వ్యక్తిత్వం యొక్క కార్యకలాపాలన్నీ మన పరిమిత వ్యక్తిగత స్వభావానుభూతికి, వ్యక్తీకరణకు ఉద్దిష్టమైనవి. మన ఆత్మలకు మనలోని ఉదాత్త సత్యమును, విశ్వమానవుని, పరమపురుషుని గురించిన చైతన్యం ఉన్నది. వ్యక్తిగతాత్మను ఆ పరమాత్మకోసం త్యాగం చేయడంలోనే ఈ అంతరాత్మ యొక్క ఆనందానుభూతి ఉన్నది. ఈ త్యాగం స్వార్థపరతయొక్క అభావంకాదు. దానిని పరమాత్మార్పణం చేయడం. దానిని గురించిన ఆసక్తి అంతరంగ ప్రేరణవల్ల కలుగుతున్నది. దానిని దాని లక్ష్యంతో సహా వివరించే పదం లేదు. ఒకానొక పరిపూర్ణమైన ఆదర్శంతో, స్పష్టమైనఐక్యభావాన్ని సాధించడమే, అనగా వ్యక్తికి అమరమానవునకూ నడుమ సంబంధ సామరస్యం సిద్ధింపజేసుకొనడమే ఆ ప్రేరణ లక్ష్యం. "సర్వత్ర స్వాత్మ దర్శనం చేయగల పురుషునిలో ఆ సత్యం అవ్యక్తంగా దాగి ఉండజాలదు," అన్న ఉపనిషద్వాక్యం ఈ సామరస్యాన్ని గురించే చెప్తున్నది. అంతేకాని, నిరర్థక ఏకాంత వాసాన్ని గురించికాదు.

ఒకప్పుడు నేను వంగదేశంలోని ఒక మారుమూల

కు గ్రామానికి వెళ్లాను. ఆ గ్రామంలో ఎక్కువమంది రైతులు. వాళ్లంతా మహమ్మదీయులు. ఆ గ్రామస్తులు నేను చూడాలని ఒక వీధినాటకం ఏర్పాటు చేశారు. ఆ నాటకంలోని సాహిత్యం, కొన్ని శతాబ్దుల క్రిందట బహుళ ప్రచారంలో ఉండి, తరువాత నామమాత్రావశిష్టమైన ఒక గ్రామీణ మతానికి సంబంధించినది. ఆ మతం అంతరించి పోయినప్పటికీ, ఆ మతవాణి ఇంకా వినిపిస్తూనే ఉంది. ఆ మతం ఇప్పుడు తన సిద్ధాంతాలను ప్రచారం చేస్తూన్నది ఒక భిన్న సంస్కృతిగల ప్రజలకు. అయినా వారు విసుగు విరామాల్లేకుండా ఆ మతసిద్ధాంతాలను వింటున్నారు. మానవుని వ్యక్తిత్వంలోని ప్రధానాంశాలయిన శారీరక మానసిక ఆంతరంగిక వ్యాపారాలలో భౌతిక పారమార్థిక విషయాలు ఆ నాటకంలో చర్చించబడినవి. పిమ్మట ఆ నాటకంలో ఒక సంభాషణ వచ్చింది. అందులో ఒక మనోహరమైన సంఘటన వివరింపబడింది. ఒక వ్యక్తి దివ్యానందారామము అను బృందావన యాత్రకు బయలుదేరాడు. ద్వారంవద్ద కాపలావాడు అతణ్ణి అడ్డగించాడు. "ఆగు; నిన్ను లోపలికి వెళ్ళనివ్వడానికి వీల్లేదు; నువ్వు దొంగవు' అన్నాడు. విచారించగా, అతడు తన దుస్తులలో ఆత్మాహంకారాన్ని దాచుకొని దొంగతనంగా దానిని కూడా ఆ దివ్యధామంలోకి ప్రవేశపెట్టాలని చూస్తున్నట్టు రుజువయింది. ఆత్మా

ర్పణం చేసినవారికే గాని ఆ ఆనందధామంలోకి ప్రవేశం లేదు. దొంగ తన దుస్తులలో గుప్తపరచుకున్న నిందనీయార్థంతో సహా పట్టుబడ్డాడు. అతనికి పరమపదయాత్రాభాగ్యం లేకుండా పోయింది. ఇదీ ఆ కథ. వెదురుగడల పందిరిమీద కప్పిన చింకిపాతల చాందినీ క్రింద, పొగలుక్రక్కే కిరసనాయిలు దీపాల వెలుగులో, నడుమ నడుమ దగ్గరలో ఉన్న చేలలోని నక్కల వంతపాటతో సహితంగా తెల్లవార్లూ ఆడే ఆ వీధినాటకాన్ని గ్రామస్తులందరు అమితాసక్తితో చూస్తారు. ఆ నాటకంలో మొరటుగా కనిపించే నృత్యసంగీత హాస్య ప్రసంగాలమధ్య వివిధ వస్తువుల పరమార్థాన్ని గురించిన చర్చ జరుగుతుంది.

భారతదేశంలో ఆధ్యాత్మికవిచారం, కవిత్వం అవినాభావసంబంధం గలవనడానికి ఈ నిదర్శనం చాలుననుకుంటాను. మానవులు పూర్ణజీవిత పరమార్థాన్ని సాధించడానికి సక్రమమార్గదర్శి ఆధ్యాత్మికచింతనే అని ధ్రువపరచుకోవడం వల్ల ఇది సాధ్యమయింది. ఏమిటి ఆ జీవిత పరమార్థం? సత్యంలో సంచరించే స్వాతంత్ర్యం.

"అసతో మా సద్గమయ"

(అసత్యంలోనుండి మమ్మ సత్యంలోనికి గొనిపొమ్మ) అనేది అందుకోసం మనం చేసే ప్రార్థన. సత్యమే ఆనందం. కళాప్రపంచంలో మన ఆత్మకు స్వార్థపరత్వబంధవం

ఉండదు గనుక, అనంతానందమయమైన సత్యస్వరూపాన్ని ఆత్మ నిరభ్యంతరంగా దర్శింప గలుగుతుంది.

కళాప్రపంచంలోవలెనే, ఆధ్యాత్మిక జగత్తులోకూడా మన ఆత్మ అహంకారంనుండి విముక్తి పొంది ఆ అనాసక్తానందం పొందడానికి ఎదురు చూస్తూ ఉంటుంది. ఆ ఆనందమే సృష్టికి లక్ష్యం. అది తన ముక్తికోసం సత్యైక్యంలోని స్వేచ్ఛ కోసం ఆక్రందనం చేస్తుంది. ఈ ముక్తిచింతాప్రభావం భారతదేశంలో మన అందరి జీవితాలపైన ప్రసరించింది. మన పవిత్రాశయావేగస్రవంతికామూలాలను స్పృశించింది. ఆ ముక్తిచింత కవితాగరుత్తులపై ఊరేగుతూ స్వర్గోన్ముఖంగా ఎగిరిపోతుంది. విద్యాగంధం అట్టే లేని కొందరు కేవలభక్తిపరులు తార అనే ముక్తిదేవతను ఇలా ప్రార్థిస్తూ పాడుకుంటూ ఉంటారని చెప్తారు.

"దృశ్యజగత్తనే ఈ చీకటికోణంలో ప్రమగ్గవలసిన దుర్గతి పట్టడానికి నేను చేసిన పాతకమేమిటి ?" అని వారి ఆక్రందనం.

సత్యలోకానికి దూరమై పోతామేమో అని ఈ బహు వస్తు రూప ఫేన బుద్బుదాలలోబడి కొట్టుమిట్టాడుతూ ఉండి పోతామేమో అని, సుఖ దుఃఖాలనే భయంకరమైన ఆటుపోటులలో ఊయలలూగుతూ ఎన్నటికీ జీవితపరమార్థాన్ని చేరలేకపోతామేమో అని వారి భయం. ఇట్టి వారిలో

ఒకడు సంతకు కిరాయిబండి తోలుకునేవాడు కావచ్చు; మరొకడూ వల పన్ని చేపలు పట్టుకునే బెస్తకావచ్చు. వాళ్ళు పాడుతూన్న పాటలలోని అంతరార్థాలను గురించి ప్రశ్నిస్తే వాళ్ళు మనకు తెలివిగా జవాబు చెప్పలేక పోవచ్చు. అయితే, సర్వదుఃఖాలకు మూలకారణం భౌతిక జీవన సౌకర్యాలు లేకపోవడం కాదనీ, జీవిత పరమార్థాన్ని గ్రహించలేక పోవడమే అనీ వాళ్ళకు నిస్సందేహంగా తెలుసు. 'నేనూ, నాదీ' అనే భావాలకు అనవసరమైన ప్రాధాన్యం ఇవ్వకూడదని, అవి పరమార్థ సిద్ధిని అసంభవం చేస్తాయనీ ఆలాంటి వ్యక్తులు తరచు చెపుతూ ఉంటారు. జీవితంలో సాంఘిక స్థాయిలో గాని, వివేక విజ్ఞానాలలో గాని తమకన్న అధికులు కానివాళ్ళు సత్యాన్వేషణం కోసం తమ సర్వస్వం త్యజించి పోవడం వాళ్ళు స్వయంగా చూశారు.

ఆ సాహసికుల లక్ష్యం లౌకికమైన ఐశ్వర్యాధికారాల సంపాదన కాదనీ, కేవలం ముక్తి అనీ వాళ్ళకు తెలుసు. బహుశః ఆ గ్రామంలోనే తమ కులానికి చెందిన ఒక వ్యక్తి తన వృత్తి తాను చేసుకుని జీవిస్తూ, జీవన్ముక్తు డనే ప్రఖ్యాతి పొందటం కూడా వాళ్లుచూసి ఉండవచ్చు. ఒక జాలరివాడు పగలల్లా గంగానదిలో చేపలు పడుతూ అంతర్దృష్టితో తన్మయత్వంతో భక్తిగీతాలు పాడుకుంటూం డటంనేను స్వయంగా చూశాను. నా పడవ నడుపుతూన్న

వ్యక్తి అతనిని నాకు చూపించి, అతడు ముక్తి పొందిన మహానుభావుడని వినమ్రభావంతో నాకు చెప్పాడు. మానవ సంఘం వ్యక్తులకు కట్టే విలువ లన్నింటికీ అతడు అతీతుడు. ఈ విలువలు బొమ్మల దుకాణదారుడు బీరువాలలో బొమ్మలను ప్రదర్శించేటప్పుడు వాటికి బజారుధరను బట్టి కట్టే విలువల వంటివి.

ఈ దేశంలో ఈ జాలరివానిని బోలిన వ్యక్తులు ఇంకా ఎంతోమంది ఉన్నారు. వారి జీవితాలు నిత్యం ఆ విముక్తాత్మపురాణం గానం చేస్తున్నప్పటికీ, ఆ మహనీయుల పేర్లు చరిత్రలో ఎక్కడా స్మరింప బడవు. చక్రవర్తి అధికార అలంకార శృంఖలాలు గల ఖైదీ అనీ, అతడు తన రాజ్యానికి బానిస అనీ; అలాగే లక్షాధికారి తన ఐశ్వర్య సువర్ణ పంజరంలో కొరత వేయబడిన చిలక అనీ,— ఈ భారతీయ జానపదులకు స్పష్టంగా తెలుసు. ఈ జాలరివాడు మాత్రం నిరంతరం జ్యోతిర్మయ జగత్తులో జీవించే ముక్తజీవి అనికూడా వారెరుగుదురు. గాఢాంధకారంలో తారాడుతూ, ఏదో తగిలి పడబోతున్నప్పుడు చేతికి దొరికిన వస్తువే మనకు రక్షకమని గట్టిగా పట్టుకుంటాం. వెలుగు రాగానే ఆ పట్టు వదలివేస్తాం. మనకు సంబంధించిన 'సర్వస్వం'లో అవన్నీ భాగాలని గ్రహిస్తాం. కుగ్రామంలోని బడుగు మానిసికి ముక్తి అంటే ఏమిటో తెలుసు. స్వార్థపరతలోని ఏకాకితనుండి, మన స్వార్థ దృష్టికి భయంకర

గాఢతను కల్పించే వస్తు జగద్విభిన్నతనుండి విమోచన మది. ఈ మోక్షం కేవలం మన ఆస్తిపాస్తుల నగ్నరూపంలోని బంధనా భావమే కాదనీ, మన ఆత్మకు అకలంకమైన ఆనందాన్నిచ్చే సఫల సాక్షాత్కారమనీ కూడా అతడు ఎరుగును. కనుకనే, "పూర్తిగా లోతుగా మునిగినవానికి అసాధ్యమయినది ఏదీ లే"దని అతడు గానంచేస్తాడు. అతడే ఇలా ప్రార్థిస్తాడు :

"నా రెండు మనస్సులను కలిపి ఏకంచెయ్యి,
నన్నా అద్భుత నగరికి తీసుకు వెళ్లు."

భిన్నత్వంతో కూడిన బాహ్య రంగంలో వస్తు సంపాదనకై ఆరాటపడే మనస్సుకి, అంతర్దృష్టితో ఐక్య సామరస్యాలను అన్వేషించే మనస్సుకీ పరస్పర సంఘర్షణ అంతమైపోయినప్పుడు, మనం అద్భుతమైన, అనిర్వాచ్యమైన అఖండతను గ్రహించడానికి అవి మనకు సహకారులు. భక్తకవి కబీరు కూడా తన గీతాల్లో ఇదే హెచ్చరిక చేశాడు:

"పరమాత్మ అంతరంగంలోనే ఉంటుందనేవారు బాహ్యమైన వస్తుమయ జగత్తును అవమానపరుస్తున్నారు. అలాగే అతడు వెలుపలే ఎక్కడో ఉన్నాడనే వారు కూడా యథార్థ వాదులు కారు."

ఈ దివ్య గాయకుల అభిప్రాయానుసారం, ఐక్యభావంలోనే సత్యం ఉన్నది; దానిని సందర్శింప గలగడమే ముక్తి-

మన దైనందిన ప్రార్థనా ధ్యాన శ్లోకాలు, మంత్రాలు మన మనస్సు ఇతర జీవజగత్తుకి మనకు మధ్య కనిపించే అభ్యంతరాలను అధిగమించి, అనంతమైన అద్వైత సిద్ధి పొందడానికి తగినశిక్షణాభ్యాసాలు. భారత జనతా మనస్సు నుండి సర్వత్ర ప్రసరితమయే ఆ ఆధ్యాత్మిక వివేకమే మన అనుదిన ప్రార్థనలకు, ఆధ్యాత్మిక శిక్షణకు మూలప్రేరకము. ఈ దృశ్య జగత్తులోని వాస్తవ స్థితిగతులే, పాశ్చాత్య సంగీతం లోని ధ్వనులు లాగ మనకు వికృతంగా కనిపిస్తున్నవి. కనుక, ఈ రూపజగత్తును అధిగమించాలని ఆ వివేకం మనలను ప్రోత్స హిస్తూంది సర్వ వస్తువులలోను నిబిడీకృతమై ఉన్న అంత స్సత్యాన్ని దర్శించడం ద్వారా ముక్తి సాధించాలని ఆ వివేకం బోధిస్తున్నది. ఆ అంతస్సత్య దర్శనంవలన; అపరిమిత బహుత్వమంతా ఏకరూపత పొంది సాక్షత్కరిస్తుంది.

ఈ భౌతిక జగత్తులోని విమోచనానికి (లేక స్వాతం త్ర్యానికి) కూడా ఇదే అర్థం; శబ్దజాలం మాత్రమే వేరు. ప్రకృతిదృశ్యాలు మనకు అసమంజసంగా, వివేక రహిత మైన ద్వంద్వభావమయంగా కనిపిస్తున్నప్పుడు మనం "స్వారాజ్యము"ను గురించి కలలో కూడా ఆశించకుండా ఆపర ప్రపంచంలోనే బ్రతుకుతూ ఉండేవాళ్ళం. మన హేతు వాదానికీ ఆ ప్రపంచరీతికీ మధ్య సామరస్యమును కనుగొన డంతో, దానితో మన ఐక్యభావం, తత్పర్యవసానంగా మన స్వాతంత్ర్య భావం మనకు సాక్షాత్కరించినవి.

ఈ ప్రపంచరీతిని అపార్థం చేసుకుని, తమ విజ్ఞాన వివేకాలద్వారా దానితో తగు ఐక్యభావాన్ని గ్రహించ కుండా బ్రతికేవారు తమపై దారుణంగా దెబ్బతీసే మాయాంధ కారబంధురమైన విధి నిరంకుశత్వంపట్ల నిస్పృహతో కూడిన విశ్వాసంగల భీరువులవుతారు. తమ సామాన్య మానవస్వత్వాలను అన్యులు అపహరించినా, వారు ప్రతిఘటించరు. అర్థంలేని ఆకస్మిక విపత్తులతో తమను స్తబ్ధులనుజేసే ఈ ప్రపంచంలో వెలివేయబడిన జీవులైనట్లు భావిస్తూ బ్రతకడం వారికి అలవాటయిపోయింది.

సాంఘిక రాజకీయ రంగంలోని పారతంత్ర్యానికి కూడా ఈ స్వ పర భేదమే, ఏకత్వ జ్ఞానాభావమే ప్రాతిపదిక. అక్కడ ఐక్యభావ బంధవికలనమే మనకు శృంఖల అవుతుంది. తోడివారితో తెగతెంపులు చేసుకొని దూరంగా ఉండటమే నిజమైన స్వాతంత్ర్యమని, సంబంధ బాంధవ్యాలన్నీ ఇతరుల పట్ల తమకు బాధ్యతలను కట్టబెట్టే శృంఖలాలనీ కొందరు అపోహ పడవచ్చు. ఈ మానవ జగత్తులో ఒక విధమైన సువ్యవస్థిత పరస్పర పారతంత్ర్యమే స్వాతంత్ర్యానికి ఆలంబనం. ఇది విపరీతంగానే కనిపిస్తుంది; కాని యథార్థమని మనకు తెలుసు. ఏవిధమైన బాధ్యతలను స్వీకరించని అచ్ఛమైన ఒంటెత్తుగాళ్లు కేవలం ఆటవికులు మాత్రమే. వాళ్లకు జీవిత సార్థక్య దృష్టే లేదు. సరిగా రాజబెట్టని నిప్పు పొగలోపల ఎక్కడో అణగి ఉన్నట్టు వాళ్లు అంధకార మగ్నులైన అవ్యక్తులుగా బ్రతుకుతారు. పరస్పర సౌహార్దం,

సహకారం పెంపొందించుకొనగలశక్తి ఉన్న వాళ్లు మాత్రమే గ్రహణగతచంద్రునిబోలినబ్రతుకునుండి విముక్తిపొందగలరు. మానవ సంబంధసామరస్యాల చరిత్రే మానవ స్వాతంత్ర్య చరిత్ర.

అస్తిత్వరహస్యభేదనం చేయలేని మన అశక్తత వల్లనే, కొందరు అసలు అస్తిత్వమే పాపం అనగలగడానికి హేతువు. పక్షి ఒకే రెక్కతో ఎగరడానికి ప్రయత్నిస్తే ఒక్క గాలిదెబ్బతో వచ్చి నేలకు కొట్టుకుంటుంది. అర్ధ సత్యం దుష్టం. తాను ఇవ్వలేనిదానిని తాను సూచించడం వలన అర్ధ సత్యం హానికరం. మృత్యువు హానికరం కాదు; వ్యాధి హానికరం. వ్యాధి నిరంతరం మనకు ఆరోగ్యాన్ని గురించి జ్ఞాపకం చేస్తుంది; కాని తానే దానిని మనకు దూరం చేస్తుంది. అర్ధజగత్తు అసంపూర్ణమైనది; అయినా పూర్ణ సత్యంలాగ కనిపించి మనలను మోసగిస్తుంది. అది మనకు అందించే పాత్ర వట్టి ఖాళీది. కనుక, అర్ధజగత్తు దుష్టం. సంపూర్ణ వర్తులాకృతి పొందని ఖండసత్యాలే సర్వ విపత్తులకు కారణం. మానవ వ్యక్తి విశ్వాత్మదర్శనం చేసి, విముక్తుడైనప్పుడే సత్యం సంపూర్ణ వర్తులాకృతిపొందుతుంది.

అయితే, ఈ ముక్తి సత్యాంతర్గతమేగాని, సత్య భ్రాంతిలో కాదు; కనుక, అతి ఫలాపేక్షతో; బలవంతంగా ఆత్రంతో అనుసరించే విజయ యాత్రాపథమేదీ సత్యపథం కాదు. నాగరక లోక గౌరవాలతో పరిచయంలేని ఒక గ్రామీణకవి ఇలా గానం చేశాడు:—

"అత్యాశా, శీఘ్రఫలాశా ప్రేరితుడవైన నిష్ఠుర మానవ లేత మొగ్గగా ఉన్న మనస్సును మంటలలో మాడ్చకు. నువ్వు దానిని ఖండ ఖండాలుగా చేయ గలవు. నీ అసహిష్ణుతతో దాని సుగంధమును నాశనం చేయగలవు. నా ప్రభువు, పరమ గురువు ఆ పూవును రూపొందించడానికి యుగ యుగాలుగా ఎంత శ్రమపడ్డాడో! ఆయన ఎన్నడూ ఆత్రపడి ఆర్భాటం చెయ్యలేదు. దురాశా ధూర్తుడ వైన నువ్వుమాత్రం కేవలం నీ దౌర్జన్యం మీద నే ఆధారపడుతున్నావు. దురాశా ప్రేరితుడవైన నిష్ఠుర మానవ! — నీకు మిగిలిన ఆశ ఏమిటి? అయ్యో! నా పరమగురువు మనస్సును కష్టపెట్టకు. సరళ స్రవం తిని అనుసరించి పోతూ, తనను తాను లయంచేసుకున్న వాడే ఆయనవాణిని వినగలడని తెలుసుకోలేవా దురాశా ప్రేరితుడవైన నిష్ఠుర మానవ! — అని హెచ్చరిస్తున్నాడు కవిమదనుడు".

ముక్తిని బలవంతంగా పట్టి తెచ్చుకొనే ఉపాయమేదీ లేదని ఆ కవికి తెలుసు. అహంకార పరిత్యాగమనే ఆంతరంగిక ప్రక్రియే దానికి సాధనమార్గం. బంధనం ఏ రూపంలో ఉన్నా దాని ప్రభావం అంతా అంతరాత్మమీదే గాని, బాహ్యజగత్తుమీద కాదు. మన చైతన్యాన్ని మందగింపజేయడం, మన దృష్టిని హ్రస్వం చేయడం, వస్తు మూల్యవివేకాన్ని నష్టపరచడం అది చేసే ఘనకార్యాలు.

వంగ దేశంలోని 'బౌల్' జాతి వీధిగాయకుల గీతంతో ఈ అధ్యాయం ముగిస్తాను. నూరేండ్లనాటి ఆ గీతంలో పరిమిత, అపరిమితాత్మల నడుమ గల అనంత ఐక్య బంధనమును గురించి అతడు గానం చేశాడు. ప్రేమ అపరిమేయం గనుక, సత్యాన్ని సంపూర్ణం చేయగలది అంతస్సంబంధమే గనుక, అఖండ స్వాతంత్ర్యం కేవలం బానిసతాశూన్యదశ గనుక, ఆ బంధనంనుండిముక్తిలేదు. అతనిపాటకు అర్థమిది:—

"యుగయుగాలుగా వికసిత మగుచున్న
ఆత్మారవింద మది.
నేను నీవు అందు బంధితులం.
లేదు మనకు విమోచనం.
ఆ దళముల వికసనానికి అంతులేదు.
అందలి మకరందం మధురాతిమధురం.
మత్తభృంగలీల నీవు
వదలలేవు ఆ పూవును.
నీవు ఖైదీవి, నేను ఖైదీని.
ముక్తిలేదు మనకెక్కడ.



# ౧౨. నాలుగు ఆశ్రమాలు

కేవలం మానవతాసంబంధీ, మానవుడు తన స్వభావ శీలాలను సుశిక్షితం చేసుకొని, అమృతత్వాన్ని మానవ త్వోన్ముఖం చేసుకొనడానికి ఉపకరించగలదీ అయిన మతమే నా లక్ష్యమని లోగడ స్పష్టంగా వివరించాను. అయితే మతమే పరమావధి కాదని, అంతకన్న ఉన్నతమైన లక్ష్యాన్ని సాధించడానికి అది సాధనమార్గం మాత్రమే అనే ఉదాత్త వాదం వంకకు భారతీయుని మనస్సు మొగ్గుచూపుతూ ఉంటుందనే సంగతి విస్మరించకూడదు. వ్యక్తి నిత్యముక్తుడై మానవతా పరమావధులన్నిటినీ దాటి పరమాత్మలో చరించడమే ఈ లక్ష్యం.

ఈ అతిశయ రహస్యవాదము పాశ్చాత్య విజ్ఞానులకు బోధపడడానికి విజ్ఞానశాస్త్ర సాదృశ్యం చక్కగా ఉపకరిస్తుంది. భౌతికజ్ఞాన రంగంలో విజ్ఞానశాస్త్రమే ఇట్టి రహస్య వాదమని నిస్సందేహంగా చెప్పవచ్చు. రూపజగద్రహస్యా లను అన్వేషించి, వివిధ వస్తువుల అంతస్సత్యాలనుగ్రహించ డానికి విజ్ఞానశాస్త్రం ఉపకరిస్తుంది. ఆ సత్యాలు కేవలం అరూపసూత్రాలు. ఆ విధంగా విజ్ఞానశాస్త్రం మన మనస్సుకి కేవలం ఐంద్రియజ్ఞానరంగం లో నుండి వివేక స్వేచ్ఛావరణ లోకి ప్రవేశం కల్పించింది.

ప్రపంచాన్ని గురించిన సాధారణ దృష్టి, మన జీవితావసరాలకు అత్యవసరం. సామాన్య వ్యవహారాలన్నిటిలో భూమి చదునుగా ఉన్నదనేదే సత్యం. అలాగే సూర్యుడు పశ్చిమ దిక్చక్రం క్రిందికి దిగిపోవడమూ సత్యమే. గణిత శాస్త్ర మహావిద్వాంసులు కాలగమనంలో అసంబద్ధతను గురించి ఎట్టి సిద్ధాంతాలు చేసినా, గడియారాలను సవరించు కొనటానికి మనం వ్యావహారిక కాలమానాన్ని పూర్తిగా విశ్వసించక తప్పదు. కళల విషయంలోను, మన దైనందిన జీవిత వ్యవహారాలలోను వివిధ వస్తువులు మనకు ఎలా కనిపిస్తున్న వనేదే మనకు ముఖ్యం. వాటి మూలతత్త్వాలతో మనకు నిమిత్తంలేదు. శాస్త్రజ్ఞులు వెల్లడించే సత్యాలలో మానవుని సామాన్య దృష్టికి అగోచరమైనవి కూడా అతనికి స్వచ్ఛమైన, అనాసక్తమైన హర్షం కలుగజేసి, అతని ప్రపంచానికి ఐంద్రియజ్ఞానాతీతమైన ప్రాతిపదికను కల్పి స్తున్నవి. కనుక శాస్త్రం భౌతిక పదార్థాలతోలూకు రహస్య వాదాన్ని మనకు వివరిస్తూంది అన్నమాట. ఈ రహస్యజ్ఞానం తరచు మనభావనాపరిధికి అతీతమైనదిగా కూడా ఉంటుంది. అయినా, మారుమాటలేకుండా దానిని మనం అంగీక రిస్తున్నాం. సుశిక్షణ ఫలితంగా కేవల బాహ్యరూపజ్ఞాన బంధనాలనుండి, తమ అభిరుచులనుండి తమ వివేకానికి విముక్తి కలిగించుకున్న శాస్త్రవిజ్ఞానులు చెప్పినమాటలన్నీ

పవినయంగా మనం విశ్వసిస్తున్నాం. వారి మనస్సు వ్యక్తి గతం కాని అనంతావరణలో విహరిస్తుంది. అక్కడ్ సద సత్తులు, హెచ్చుతగ్గులు సౌందర్యాసౌందర్యాలు, ప్రయోజనాప్రయోజనాలు – ఏవీలేవు. అన్నివస్తువులకు సమానంగా ఒక్కటే హక్కు ఉంది. అది వాటి అస్తిత్వ పరిగణన.

భారతీయుల పరమ లక్ష్యమైన ఈ అంతిమ ఆత్మ విమోచనంకూడా దానిని పోలిన ఒక విలక్షణవికాసం. అది వ్యక్తిత్వ పరిమితులన్నిటినీ అతిశయించిన అనుభూతి. నైతిక ఔచిత్య విలక్షణత లేపీ దానికి లేవు. అది శుద్ధ సత్యం; అదే పరతత్వం; సచ్చిదానందం. శాస్త్రవిజ్ఞానం మన భావనను మన సామ్రాజ్యపు పొలిమేరలదాకా మాత్రమే తీసుకొని పోగలదు. కాని, తాను సృజించిన హేతువాద సంకేత సామరస్యాన్ని మాత్రం అతిక్రమించ జాలదు. అనగా కోడిపిల్ల గుడ్డులోనుండి బయటికి రాగలదు; కాని ఆ కోడిపిల్ల తననుండి తాను మాత్రం విముక్తి పొంద జాలదు. కాని, ప్రశాంత తపశ్చర్య వలన మన చైతన్యం ఒక అనంత తత్త్వాన్ని అందుకోగలదని, అక్కడ జ్ఞానం జ్ఞానంగా ఉండదనీ, అది సకల వస్తువులు ఐక్యమైపోయే ఒకానొక అనిర్వచనీయ స్థితి అనీ భారతదేశ యోగులు చెపుతున్నారు.

మనకు వ్యక్తిగతాత్మ ఉన్నది. దానికి కొన్ని కోరికలు ఉన్నవి. ఆ కోరికలు తాము యథేచ్ఛగా

నిర్నిబంధంగా విహరించడానికి వీలున్న ఒక లోకాన్ని సృష్టి చేసుకొనడానికి సతతం సతమతమవుతూ ఉంటవి. ఈ ప్రయత్నం జరుగుతూ ఉండగానే, మన ఆత్మాహంకార పరిత్యాగం వల్లనే మన ఆత్మసాక్షాత్కారం పరిపూర్ణం కాగలదనేసంగతి మనకు తెలివిడి అవుతుంది. వ్యక్తులందరిలో ఏకరూపత గల ప్రాతిపదికసత్యం లోనే వ్యక్తి తన పర మార్థాన్ని సాక్షాత్కరింపజేసుకొనగలడని కూడా పై విషయం మనకు తెలియజేస్తున్నది. ఈప్రాతిపదికసత్యమే మానవతా ప్రమాణాలకు నైతిక అధ్యాత్మికాధార భూమి. ఇది మన మతసంబంధి. విశ్వవివేకావరణలో మన జ్ఞానం చేసే విముక్త విహారమే విజ్ఞానశాస్త్రం. ఆ విశ్వవివేకం మానవ వివేకానికి అతిరిక్తమైనదికాదు. అలాగే విశ్వవ్యక్తిత్వంలో మనవ్యష్టి వ్యక్తిత్వం చేసే విముక్తవిహారమే మతం. ఆ విశ్వవ్యక్తిత్వం మానవవ్యక్తిత్వానికి అతిరిక్తమైనది కాదు.

ఈ ముక్తివలన ఆ అనంతతత్త్వం మానవత్వావధులతో పరిమితంకాని దివ్యధామానికి కూడా చేరుకొనవచ్చునని ప్రాచీన భారత మనస్తత్వవేత్తలు చెప్పారు. వారు దీనినొక సిద్ధాంతంగా రూపొందించడంతో సంతృప్తిపడరు. మానవుని సర్వోత్తమ లక్ష్యాన్ని సాధించడానికి దానిని సాధనంగా చేసుకోవాలని వారి ఉద్బోధ. అందుకోసం, జీవితంలోని వివిధ దశల్లో అలవరచుకొనవలసిన క్రమశిక్షణను వారు

ఏవరించారు. మనం మానవత్వాన్ని పరిపూర్ణంచేసుకోవ డానికి ఆ పైన దానినికూడా అధిగమించి చరమమోక్షం పొందడానికి ఆ క్రమశిక్షణ సహాయపడుతుంది.

మానవునిలోని పరిపూర్ణత ద్విముఖమైనది. ఆ రెండి టిని కొంతవరకు పృథక్కరించి చూడవచ్చు. ఇందులో ఒకటి ఆస్తిత్వ పరిపూర్ణత. రెండవది కర్మ పరిపూర్ణత. వ్యక్తిగతంగా సత్పురుషుడు కానివాడుకూడా కొంత శిక్షణ వలనగాని, బలవంతముగా గాని సత్కార్యాలు చేయవచ్చు. ప్రాణాంతకములైన ప్రమాదాలను తెచ్చిపెట్టే కార్యాలు తరచు భీరువుల చేతనే చేయబడుతూన్నవి. ఆ ప్రమాదాలు కలుగగలవని వారికి తెలిసి కూడా ఉండవచ్చు. అట్టి కార్యాలు సప్రయోజనములు కూడా కావచ్చు. తత్కర్తల జీవితానంతరం కూడా వాటి ప్రయోజనం ఉండవచ్చు. అయితే, ఉపయోగానికన్న నైతికపరిపక్వతకు ప్రాధాన్య మిచ్చే విషయాలలో మాత్రం వ్యక్తిగతమైన వాస్తవ శీల్యమే ప్రధానంగా పరిగణిస్తాం. అతడు బహిరంగంగా చేసే పనులన్నీ సత్ఫలితాలనే ఇస్తూ ఉండవచ్చు. అయినా, వ్యక్తిగతంగా అతని అంతరంగ పరిపక్వతకే విశేష ప్రాధాన్యం ఉన్నది. అది అతని ఆధ్యాత్మికముక్తి. అది మానవజగత్తుకి ఎనలేని గని. అయితే, ఆ సంగతి మనకు తెలియకపోవచ్చు. మన అహంకార పరిధిలోనుండి మన

ఆత్మకు కలిగిన విమోచనమే సచ్ఛీలంవల్ల వ్యక్తం చేయబడుతుంది. సచ్ఛీలం విశ్వమానవతతో మన ఐక్యానికి చిహ్నం. దానివలన మన తోడివారికి గలిగే స్వల్ప ప్రయోజనాలను బట్టి కాదు దానికి విలువ కట్టవలసినది. దాని సత్యమే దానివిలువ. మానవుడు వ్యక్తిగతోద్వేగాలకు, పాశవిక ప్రేరణలకు బద్ధుడైన జంతువు కాదనీ, బంధనరహిత మైన పరిపూర్ణత గల ఆత్మ అనీ ఆ సత్యం ద్వారానే మనం గ్రహించ గలుగుతున్నాం. మానవ ప్రపంచంలో ఆత్మ పొందే స్వాతంత్ర్యమే సౌశీల్యం. అదే ప్రేమ. మనం ఆంతరంగికంగా సత్యసంశుద్ధులమై ఉండాలి. ఇది ఐహిక కర్తవ్యాల కోసం కాదు. పరిపూర్ణతత్త్వంతో సామరస్యం (అనగా, అనంతతత్త్వంతో ఐక్యభావం గల ఆధ్యాత్మిక పరిపూర్ణతాసిద్ధి) కోసం. ఇది వాస్తవం కాకపోతే, ఆధ్యాత్మిక పరిపూర్ణత కన్న యాంత్రిక పరిపూర్ణతే విలువైనదని చెప్పవలసివస్తుంది. మానవ వ్యక్తికి విశ్వమానవతతో తన ఐక్యభావాన్ని సాక్షాత్కరింప జేసుకొనడానికి గాను పరిపూర్ణమైన జీవనం అవసరం. దానిని అధిగమించే స్వాతంత్ర్యమును కూడా అదే అతనికి ప్రసాదిస్తుంది.

ప్రకృతి ఏవో శారీరక ప్రయోజనాల కోసం, మానవునకు మరణాన్ని గురించి ఏమరపాటు కలిగించి, తద్వారా, జీవితంపట్ల అతనికి ప్రబలమైనవిశ్వాసం కదిరేటట్టు చేస్తుంది.

అయినప్పటికీ చివరికి మరణవిజృంభణక్షణంలో మన భౌతిక శరీరమే కాదు, అది తన చుట్టూ తాను సృజించుకొన్న పరిసరాలు కూడా మనకు దూరమైపోతున్నవి. మహా వైభవాలన్నీ ముహూర్తమాత్రంలో అంతరించిపోయి, శూన్యమే మిగులుతూంది. అనుపమ మహాసామ్రాజ్యం కూడా తన్మహోత్సవ దీపికల వెలుగులోనే హరించి చరిత్ర పత్రాలలోని చిత్రమైపోతుంది. మరణాన్ని గురించిన స్మరణ మనకు చిరాకు కలిగించినప్పటికీ, అది యథార్థమనే మాటమాత్రం నిజం.

మన మర్త్యసంబంధ బాంధవ్యాలన్నీ నశ్వరమైనవే అయినప్పటికీ, జీవించి ఉన్నంతవరకు వాటిని నిర్లక్ష్యం చేయలేము. ఆ స్నేహబంధాలు శాశ్వతంగా నిలచి ఉండేవి కావుగదా అనే భావంతో, అసలు అవి లేనే లేవన్నట్లు మనం ప్రవర్తించినా, మనం వాటికి చెల్లించవలసిన కష్టాలను అవి వడ్డీతో సహితంగా రాబట్టుకొనక మానవు. తాత్కాలికమైనవయినప్పటికీ, వాస్తవమైన ఆ బంధాలను నిర్లక్ష్యం చేయడానికి యత్నిస్తే అవి మరింతగా బలపడటం, దీర్ఘమవడం మాత్రమే సంభవిస్తుంది. ఆత్మప్రధానమైనదే, కాని దానిని చేరుకొనడానికి వ్యక్తిత్వపు సీమలను దాటి వెళ్ళాలి. మార్గాన్ని ధ్వంసం చేసుకొని మనం గమ్యస్థానాన్ని చేరుకొనలేము గద !

ప్రాచీన భారతదేశంలో మన పూర్వులు మానవాత్మ

మహత్తును గ్రహించారు. దాని ఘనత అసదృశమైనదని, పరబ్రహ్మమే దాని పరమస్వరూపమని వారు తెలుసుకున్నారు. కనుక మానవుని గురించిన ఇతర పరిమిత నిర్వచనాలన్నీ అసమగ్రమైనవి, అసంపూర్ణమైనవీ అనే చెప్పాలి, నాగరకుడుగా, దేశభక్తుడుగా అతడు పరిపూర్ణుడు అవడమనేది అసంభవం. ఒక నగరంగాని, దేశంగాని, ఈ ప్రపంచమనే బుద్బుదంగాని అపరిమితమైన మానవాత్మను తమలో ఇముడ్చుకొనలేవు.

"సకలవాంఛాఫలసిద్ధులు పొందితే నేమి? శత్రువు కంఠముపై నీ కాలువేసి త్రొక్కగలిగితే నేమి? నీ యైశ్వర్య బలంతో బహుమిత్రులను కూర్చుకొనగలిగితే నేమి? మర్త్య శరీరాలను కూడా యుగయుగాలుగా సజీవంగా నిలిపి ఉంచగలిగితే మాత్ర మేమి? ప్రయోజన మేముంది, (తతఃకిం)?" అంటాడు పూర్వాశ్రమంలో చక్రవర్తి అయిన భర్తృహరి.

అనగా ఈ వాంఛాఫలసిద్ధు లన్నిటికన్న జీవుడు ఉదాత్తుడని భావం. అతని సత్యం అతని ముక్తిలోనే ఉన్నది. కాని, ఆ ముక్తిసాధనక్రమంలో వ్యక్తి తన ఇచ్ఛను కట్టుకొని, దాని శక్తులు చీరువోయి వ్యర్థం కాకుండా కాపాడుకోవాలి. ఆవిధంగా నిర్బంధనలలోనుండి ఉత్పన్నమయే అమిత వేగం దానికి ప్రాప్తమయేటట్లు చేసుకోవాలి. కేవలం రాజకీయ రంగంలో ముక్తిని కోరేవారు కూడా

చానిని అణచుకొని, తమ భావనా కార్యాచరణ స్వాతంత్ర్యా లను కూడా కుంచించుకుంటారు. తరచు తమ అంతరాత్మ స్వాతంత్ర్యాన్ని కూడా లెక్కచేయకుండా తమ రాజకీయాధి కార సురక్షకోసం వారు కృషి చేస్తారు.

భారతదేశం సంఘ బంధనాలను అధిగమించడం కోసమే తన సాంఘిక వ్యవస్థాబంధాలను మొదట ఏర్పరచు కొన్నది. రౌతు తన గుర్రానికి కళ్లెం పెడతాడు. తన పాదాలు రికాబుల్లో మోపుతాడు. ఈ బంధనాలు గమ్యస్థానాన్ని శీఘ్రంగా చేరుకోవడానికి అతనికి ఉపకరిస్తున్నవి. మన సాంఘిక వ్యవస్థా నిబంధనలు అట్టివి.

వాంఛ అనేది ముగింపులేని అనంతమైన గీతంలాగ సాగిపోయే విధంగా ఈ విశ్వం సృజించబడినదని అనుకొన డానికి వీలులేదు. ఒకగీతాన్ని మధ్యలో ఆపుచేయడం ఎంత బాధాకరమో, దానిని చరమచరణందాకా పాడి ముగించడం అంత ఆనందదాయకం.

కర్మాచరణ ముమ్మరంగా సాగుతూ ఉండగా హఠా త్తుగా మధ్యలో ఆపుచేయమని మనప్రాచీన భారతాచార్యులు మనకు బోధించలేదు. ఈ ప్రపంచ మహోత్సవం సృష్ట్యాది నుండి నేటివరకు ఒకప్పుడు ఉచ్ఛదశ నందుకొంటూ మరొ కప్పుడు పతనమవుతూ. మొత్తంమీద నిరంతరంగా సాగు తూన్న మాట వాస్తవమే. ఆ మహోత్సవంతో మానవ

వ్యక్తి అనుబంధం అంతమయి పోతూండటం కూడా వాస్తవమే. అయినప్పుడు అతడు విధిగా ఏవిధమైన పరిపూర్ణత్వసిద్ధీ లేకుండానే అస్తమించడం యుక్తం కాదుగద!

కనుకనే, భారతదేశంలో మనకుగల ప్రాపంచిక జీవన విభాగాల్లో కర్మ మధ్యస్థంగాను, మోక్షం చిట్టచివర పేర్కొనబడినవి. దినమును ఉదయము, మధ్యాహ్నము, అపరాహ్ణము, సాయంకాలము అని విభజించినట్లే, భారతదేశంలో మానవుని జీవితం అతని స్వాభావావశ్యకతలను అనుసరించి నాలుగు ఆశ్రమాలుగా విభక్తమయింది. దినమణి తేజస్సుకి అభివృద్ధి క్షయములు ఉన్నట్లే, మానవుని శారీరక శక్తులకు కూడా వృద్ధిక్షయాలు ఉన్నవి. భారతీయులు ఈ విషయాన్ని గుర్తించి, మానవ జీవితానికి ఆదినుండి అంతమువరకు సుసంబద్ధార్థం కల్పించారు.

ఇందులో ప్రథమాశ్రమం బ్రహ్మచర్యం; అనగా విద్యాశిక్షణదశ. రెండవది గార్హస్థ్యము; ప్రపంచ ధర్మ నిర్వహణదశ. పిదప వానప్రస్థము; సంసార బంధములను సడలించుకొని, విశ్రాంతి తీసుకొనే దశ. చివరికి సన్యాసము. మృత్యుంజయమైన మోక్షమునకై నిరీక్షించే దశ.

జీవితమంటే మృత్యువనే నిర్హేతుకమైన శత్రువుతో, అసహజమైన అంతంతో సంఘర్షణ అనే మృత్యుప్రతిఘటన దృష్టి మనకు ఏర్పడింది. జీవితంలో ప్రతి దశను ఈ నిష్ఫల

సమరంతో గడవబెడుతున్నాం. యవ్వనం అంతమైపోయే సమయం వచ్చినప్పుడు, దానిని నిలుపుకోవాలని ప్రజలు కృషి చేస్తున్నాం. వాంఛాదీప్తి మందగించినప్పుడు, మరల కృత్రిమంగా దానిని రగుల్కొల్పడానికి ప్రయత్నిస్తాం. ఇంద్రియాల పటుత్వం తగ్గినప్పుడు వాటిని తిరిగి బలంచేసి అవి తమ కర్తవ్యాలను నిర్వహించేటట్టు చేస్తాం. ఒకవంక పళ్లు సడలిపోతున్నా, స్వార్థపు పట్టు వదలలేము. ప్రకృతి సిద్ధమైన సహజ పరిణామాలు అప్రతిహతమైనవని గుర్తించేందుకు తగిన శిక్షణ మనం పొందడంలేదు. అందువల్ల, పోవలసినది పోక మానదని నిబ్బరంగా ఉదాత్తంగా వదులుకునే నిండుతనం అలవరచుకోనక, అవి బలవంతంగా మన నుండి వేరయి పోయేదాకా వాటిని పట్టుకొని వేళ్లాడుతున్నాము. సత్యాన్ని అతిథిగా ఆహ్వానించే నైపుణ్యం మనం కోల్పోవడంవల్ల, ఆ సత్యమే మనను నిర్జింపవచ్చిన విజేత అవుతూంది.

పక్వమవుతూన్న పండు తొడిమ పట్టు సడలిపోతుంది, పండులోని కండ మెత్తపడుతుంది. కాని, దానిలోని గింజ మాత్రం గట్టిపడి, అనంతర జన్మకు సన్నద్ధమవుతుంది. అలాగే, వయః పరిపాకంవల్ల మనకు కలిగే లోపాలన్నిటికీ ఆంతరంగిక ప్రయోజనాలు ఉన్నవి. అయితే, మానవుని అంతరంగ జీవితంలో అతని సంకల్పానిదే నాయకపాత్ర.

కనుక, ఈ ప్రయోజనాలు అతని సుశిక్షితకృషి మీదనే ఆధారపడి ఉంటవి. అందువల్లనే, అనంతర జన్మకు తగిన సన్నాహం చేసుకోనలేకపోయిన అశిక్షిత మానవుడు మరణానంతరంకూడా తన సంకల్పశక్తిని ప్రాపంచిక విషయాలకే వినియోగించడానికి ఆరాటపడుతూ ఉంటాడు. తల ముగ్గుబుట్ట అవుతుంది. పళ్ళన్నీ ఊడి బోసినోరు అవుతుంది. కండరాలన్నీ కృశించి చర్మం ముడుతలు పడుతుంది. అయినా అతని జీవితఫలపు తొడిమ మాత్రం పట్టు సడలించుకొనడానికి ఒప్పుకోదు.

కనుక, మనం సన్యసింపక తప్పదు. ఆ సన్యాసం ద్వారానే మనకు పునః ఫలప్రాప్తి - ఇదే అంతర్విశ్వసత్యం.

పూవు రెక్కలు రాల్చివేస్తుంది. ఎందుకు ? ఫల పరిపక్వతకోసం. పండు రాలిపోక తప్పదు. ఎందుకు ? వృక్ష పునర్జీవనంకోసం. శిశువు సురక్షితమైన మాతృ గర్భంలో నుండి వెలువడుతుంది. ఎందుకు ? తాను శారీరకంగాను, మానసికంగాను విశృంఖలంగా ఎదగడానికి. ఆ విడబాటులోనే శిశుజీవన పూర్ణవికాసం ఉన్నది. పిమ్మట ఆ శిశువు ఈ స్వయంపర్యాప్త రంగస్థలంనుండి వెలువడి, పరిపూర్ణ జీవితంలోకి ప్రవేశించి బంధువులతోను, ఇరుగు పొరుగులతోను రకరకాల సంబంధాలు ఏర్పరచుకొని, వాటి అన్నిటితోను తన విశాలతరశరీరాన్ని సృజించుకుంటుంది. చిట్ట

చివరకు వాంఛలు క్రమంగా సన్నగిలిపోతూ శరీరక్షయం ప్రారంభమవుతుంది. అనుభవ సంపన్నమైన ఆ ఆత్మ అప్పుడు సంకుచిత జీవితంలోనుండి వెలువడి విశ్వజీవనంలోకి ప్రవేశించి, తాను కూడబెట్టిన విజ్ఞానమంతటినీ దానికి అంకితంచేసి తాను అమర జీవితంతో సంబంధం ఏర్పరచుకుంటుంది. ఆ విధంగా క్రమక్షైణ్యం పొందుతూన్న శరీరం తన కట్టు తాడు చిట్టచివరిదాకా బిగబిగిసినప్పుడు అది తెగిపోయినదని ఎంతమాత్రం విచారించకుండా తనకు అనంత తత్త్వంలో ప్రవేశం కలుగుతూన్నదని ఆనందిస్తూఉంటుంది.

వ్యక్తిగతాత్మనుండి సంఘానికి, సంఘంనుండి విశ్వానికి, విశ్వంనుండి అనంత తత్త్వానికి పరిక్రమించడం జీవుని సాధారణ ప్రగతి.

కనుకనే మన ఆచార్యులు ఈ ప్రగతి లక్ష్యాన్నే దృష్టిలో ఉంచుకొని జీవితంలో ప్రథమపాఠం బ్రహ్మచర్యమనీ, పుస్తక పఠనం కాదనీ సిద్ధాంతం చేశారు. బ్రహ్మచర్యం వల్ల సుశిక్షితమైన జీవనం అలవడుతుంది. దానివలన భోగమును, త్యాగమును కూడా సమబుద్ధితో స్వీకరించడం సుకరమవుతుంది. జీవిత మొక యాత్ర. బ్రహ్మత్వస్థితిలోనికి విముక్తి పొందడమే ఆ యాత్రావధి. కనుక, జీవించడం అంటే, జీవితంలోని వివిధదశలలో శ్రద్ధగా, జాగరూకతతో, దృఢసంకల్పంతో ఆ ఆధ్యాత్మికాభ్యాసాలనుకొనసాగించడం.

ఈ శిక్షణ పొందే శిష్యుడు ప్రథమ గురూపదేశంనాడు మొదలుకొని, చివరివరకు ఈ అంతిమ పరిణామాన్ని ఎన్నడూ విస్మరించడు.

మనస్సు సామాన్యమైన అవసరాలతో తృప్తిపడి ఉండడానికి ఒక్కసారి నిరాకరిస్తే, ఆ పైన దానికి హద్దు పద్దు లుండవు. కనుక నూనెపోసి నిప్పును ఆర్పడానికి యత్నించినట్టు, మనోవాంఛా సఫలతలు కామాగ్నినిమరింత రగిల్చి భయంకరంగా తయారు చేస్తవి. అందువల్ల మనస్సుకు మొట్టమొదటే చక్కని కట్టుబాట్లతో కూడిన అలవాట్లు చెయ్యడం చాలా అవసరం. స్వాభావసిద్ధమైన పరిమితులకు కట్టుబడి ఉండాలనే నిరంతర జాగరూకత, నిగ్రహం మనస్సుకు అలవాటు చెయ్యాలి. మోక్షపథాను గుణమైన ఆనందానుభూతిని, త్యాగసంసిద్ధతను అలవరచాలి

అట్టి శిక్షణదశ ముగిసిన తరువాత సాంసారిక జీవితం (గార్హస్థ్యం) ప్రారంభమవుతుంది.

> "వివేకంతో సాంసారిక జీవితాన్ని సాగిస్తున్నప్పుడే మనం ఇంద్రియ నిగ్రహాన్ని చక్కగా పాటించగలం. ప్రపంచానికి దూరంగా ఏకాంత వాసం చేసే టప్పుడు అది సులభం కాదు"—అని మనువు.

అనగా జీవితాన్ని సమగ్రంగా జీవిస్తే తప్ప వివేకం పరిపూర్ణం కాదు. వివేకహీనమైన ఇంద్రియ నిగ్రహం

వాస్తవమైన సుశిక్షణకాదు; అర్థరహితమై ఆచారానికి అంధానుసరణమే అవుతుంది. అది ప్రచ్ఛన్న మూర్ఖత.

వాంఛ తనహద్దులలో తాను ఉండడం అలవరచు కున్నప్పుడే కర్మ - ముఖ్యంగా సత్కర్మ - సులభసాధ్యం అవుతుంది. అప్పుడే గార్హస్థ్యం సకల ప్రపంచ సంక్షేమ కేంద్రం అవుతుంది, అప్పుడది చరమ ముక్తికి ప్రతిబంధకం కాకపోగా, సహకారి అవుతుంది.

ఆ విధంగా, ద్వితీయాశ్రమజీవితం గడిపిన తరువాత, శారీరక శక్తులు ఉడిగిపోవడం ప్రారంభించగానే, సహజమైన అవసానానికి అది తొలి సూచనగా గ్రహించాలి. అయితే ఈ సూచనను తన స్థానాన్నే పట్టుకుని వేళ్ళాడగోరే ఉద్యోగికి హఠాత్తుగా వచ్చిన బర్తరఫు నోటీసుగా పరిగణించి దిగులు పడి కూచోకూడదు. పరిపూర్ణదశను అందుకుంటున్న పరిపక్వస్థితిగా సంతోషంగా స్వీకరించాలి.

శిశువు మాతృగర్భంనుండి వెలువడిన తరువాతకూడా కొంత కాలంవరకు తల్లిని అంటిపట్టుకునే ఉంటుంది. శిశువు తల్లినుండి విడివడినా, తన నూతనా స్వేచ్ఛా వాతావరణానికి అలవాటు పడేవరకు ఆ బంధం తప్పదు. జీవిత తృతీయాశ్రమంలో స్థితి అలాంటిది. సంసారంనుండి విడివడినా, ఇంకా ఆ బంధం పూర్తిగా సడలదు. ఆ స్థితిలోనే ముముక్షువు సంపూర్ణ విమోచనానికి తగిన సన్నాహాలు చేసుకుంటూ

ఉంటాడు. ఈ దశలో అతడు తన విజ్ఞాన భాండారంనుండి ప్రపంచానికి సూడిదలిస్తాడు. ప్రపంచ సహకారాన్ని స్వీకరిస్తాడు. అయితే ఈ యిచ్చి పుచ్చుకొనడాలలో గృహస్థాశ్రమంలోఉన్న ఆదృతి ఉండదు; విరక్తిభావన ఉంటుంది.

పిమ్మట చిట్టచివరకు ఆ స్వేచ్ఛాబంధనాలు కూడా పూర్తిగా తెగతెంపులైపోయే దినం వస్తుంది. ముక్తాత్మ సర్వబంధనాలను తెంచుకుని పరమాత్మసన్నిధానానికి ఎగిరిపోతుంది.

మానవజీవితాన్ని ఆద్యంతం సక్రమంగా జీవించడానికి ఇదే సరియైన పద్ధతి. అడుగడుగునా మృత్యువుతో తలపట్లు పడుతూ, భయ విహ్వల చిత్తంతో బ్రతుకుతూ, చివరకు మృత్యువు వచ్చి పైబడినప్పుడు హఠాత్తుగా శత్రుసైన్యంచే ముట్టడింపబడి హతమారినట్లు దురంత వేదనపడకుండా ఉండాలంటే—ఈ జీవన విధానమే అశ్రయం.

భారతీయుల ఈ చతురాశ్రమ జీవనం విశ్వాత్మతో అద్భుత సామరస్యానికి మానవుని సన్నద్ధం చేస్తుంది. వ్యక్తివాదపరములైన అశిక్షిత విశృంఖల వాంఛలకు అందులో తావు ఉండదు. అందువల్ల మానవ వాంఛలు తమ వినాశకరమైన విశృంఖల విహారం సాగించలేవు. ఆ వాంఛలను సుశిక్షితం చేసి, పరమాత్మతో చరమైక్యసంధానానికి అభిముఖంగా త్రిప్పుతుంది.

ఈ విధానంలో మనకు వాస్తవంగా విశ్వాసం ఉంటే, మనం ఈ ఆదర్శజీవితాన్నే అనుసరించాలి. వ్యక్తిగతశక్తి ప్రదర్శనం, జాతీయసైనికపటుత్వం మొదలైనవన్నీ అప్రధానమైపోవాలి; మానవాత్మ విజయవంతమయి, నిరంతరం పరిభ్రమించే వ్యష్టిపరిమితిచక్రం లోనుండి విముక్తి పొందాలి.

అది జరుగనినాడు... "తతఃకిం?" దేనివలన మాత్రం ప్రయోజన మేమిటి?

అయితే, ఆ విధంగా వ్యష్టిభిన్నత పూర్తిగా నశించిపోవడమే ఆదర్శమని మన భారతదేశంలో అందరూ అంగీకరించరు. ద్వైతనిష్ఠతో భక్తి చేసేవారు మనలో చాలామంది ఉన్నారు. భగవంతునితో తమ భక్తి బంధం శాశ్వతంగా నిలిచి ఉంటుదని వారి విశ్వాసం. వారికి మతమే పరమసత్యం. మానవతను దాటి ఎక్కడో, ఆవలి ఒడ్డుకి చేరుకోనదలచుకొన్నవారిని చూచి వీరు మోహపడరు. మానవత్వంలోని అపరిపూర్ణతే సర్వదుఃఖాలకు మూలమని వీరికి తెలుసు. అయితే, మన పరిమితులలోనే ప్రేమకు (భక్తికి) పరిపూర్ణసిద్ధి కలుగగలదని, దానివలన ఎన్నిదుఃఖాలను అనుభవిస్తున్నా, వాటికి అతీతులమై ఉండవచ్చుననీ వీరిమతం.

# ౧౩ ముగింపు

సంస్కృతభాషలో పక్షికి ద్విజమనికూడా పేరు. ద్విజమనగా రెండు పుటకలుగల ప్రాణి. పక్షి మొదట తన గ్రుడ్డులోపలి ఆవరణలో పుడుతుంది. తరువాత అందులో నుండి అనంత స్వాతంత్ర్యావకాశంలోకి అవతరిస్తుంది. మన దేశంలో, మానవుడు తన పరిమిత వ్యక్తిత్వంలోనుండి విముక్తిపొంది, ఆధ్యాత్మ స్వాతంత్ర్యావకాశంలో విహరించవచ్చునని విశ్వసించే ఒక కులంవారికి కూడా ద్విజులనే పేరు రూఢి ఆయింది. జీవితంలో సర్వరంగాలలోను మానవుడు ఈ ద్వంద్వ ప్రకృతిని ప్రదర్శిస్తున్నాడు; ప్రత్యక్ష సంఘటనల ఆవరణలోనే బ్రతుకుతూ, దానిని అధిగమించి పారమార్థిక జగత్తులోకి చొరబడుతున్నాడు.

అతని మనస్సులోని ఈ సహజప్రేరణ, ఆ సరిహద్దును దాటవలసినదిగా ప్రోత్సహిస్తూండటంవల్ల, ప్రత్యక్షమైనంత మాత్రాన దేనినీ అతడు చరమసత్యమని అంగీకరించడు. పరిమితి అనే గుడ్డుపై డొలకను పగులగొట్టుకొని వెలువడడానికే అతడు నిరంతరం ప్రయత్నిస్తున్నాడు. ఈ ప్రయత్నంలో అతడు తరచు తనలోని బలవత్ప్రేరణలకు విరుద్ధంగా ప్రవర్తిస్తాడు. శరీరశాస్త్ర సంబంధములైన శిక్షాస్మృతులను కూడా ప్రతిఘటించి జయంపొందుతాడు. అనంతవిశిష్టత్వాన్ని చేరుకొనడానికి అతడు సలిపే నిరంతర సాహసయాత్రలో ఈ సహజప్రేరణను అనుసరించడం ద్వారానే అత్యమూల్య

మైన మానవ నాగరకతా సంపద సాధ్యమైంది. అతడు భౌతికావశ్యకతల విషయంలో సాధించిన విజయాలకన్న ఈ సత్యపరిశోధనలో సాధించిన ఫలితాలే ఘనమైనవి. అతని ఆత్మసాక్షాత్కారం వ్యక్తిగత ప్రయోజన సీమలకు అతీతమైన విషయం. ఇది అతని అమరత్వాన్ని ధ్రువపరచి, మతసత్యాన్ని బోధపరుస్తుంది. సత్యసౌశీల్య సంపదవల్లనే ఇది సంభవం. మానవపరిణామం ప్రాకృతిక పరిపూర్ణతనుండి ఆధ్యాత్మిక పరిపూర్ణతవంకగా సాగుతుంది. కనుక మానవునికి మాత్రమే మతం అనేది అవసరం.

వేదాంత భాష్యకర్తలలో కొందరి నిర్వచనం ప్రకారం బ్రహ్మమే పరమ సత్యము. అదే అవ్యక్తికమైన 'తత్' పదార్థం. అందు సదసత్తులుగాని, సౌందర్యాసౌందర్యాలు గానీ లేవు. అది అనిర్వాచ్యైకాంతచైతన్యమయమైన ఆనందం. అందు వస్తుభిన్నతకుగాని, భావభిన్నతకుగాని తావులేదు. దానికి ఇతర లక్షణ మేదీ లేదు. అయితే, మన మతప్రయోజన మంతా మానవవ్యక్తికి అనుభవ వేద్యమైన ఈ దృశ్య జగత్తులోనే కనుక, ఈ పరబ్రహ్మభావాన్ని గురించి ఇక్కడ చర్చించడం అనవసరం. దివ్యసత్యానికి ఎవరు ఏమని పేరుపెట్టినా, దానికి మన మతచరిత్రలో అత్యున్నత స్థానం ఉన్నదని నిరూపించడానికే ఈ వ్యాసావళిలో నేను ప్రయత్నించాను. మన మతం మానవత్వ ప్రాధాన్యం గలది. పాప పుణ్యాలకు అర్థవివరణ చేసేది, మానవస్వభావంతో సామరస్యంగల పరిపూర్ణతాదర్శాలన్నిం

టికి శాశ్వతమైన ప్రాతిపదిక ప్రసాదించేదీ అవడంవల్లనే ఇది సాధ్యమయింది.

లోగడ నేను సూచించినట్లు, భారతదేశంలో యుగ యుగాలుగా నిలచిఉన్న ఒక సంప్రదాయం ఉన్నది. మానవుడు యోగాభ్యాసంద్వారా ఈ మానవత్వావధు-లన్నింటినీ అధిగమించి, శుద్ధచైతన్యస్థితిలో పరబ్రహ్మతో ఐక్యం పొందవచ్చునని ఆ సంప్రదాయజ్ఞులు చెపుతున్నారు. ఈవిశ్వాసాన్ని ఖండించే హక్కు ఎవ్వరికీలేదు. అది కేవలం అనుభవవైకం వేద్యమగు విషయమేకాని, వాదోపవాదాల వల్ల తేల్చే సిద్ధాంతంకాదు. తాత్కాలికంగా సమాధిస్థితి పొందే శక్తిగల వ్యక్తులు నేడూ ఉన్నారని భారతదేశంలో దాదాపు అందరికీ తెలుసు. సమాధి అనగా ఆత్మను పరతత్వంలో ఐక్యం చేయడం. అది అనిర్వచనీయస్థితి, అట్టివారు చెప్పే సాక్ష్యాన్ని మనం నమ్మవచ్చు. అలాగే గాఢమైన ప్రేమలో, భక్తిలో విశ్వాసం గలవారుచెప్పే సాక్ష్యాన్నికూడా మనం విశ్వసింపక తప్పదు. మానవ విజ్ఞానమును, సంకల్పాలను, కర్మలను పూర్తిగా తనలో ఇముడ్చుకొనగలిగిన ఆ పరమాత్మతో ఐక్యభావం పొందవలెననే గాఢమైన అనురక్తే ప్రేమ, లేక భక్తి ఆ పరమాత్మే భగవంతుడు. అతడు కేవలం సర్వక్రియా సమాహారం కాడు. భూత వర్తమానాలకు అత్యంత దూరంలో ఉన్న ఆ పరమ లక్ష్యమే ఆ పరమాత్మ.

---

by RABINDRANATH TAGORE



దక్షిణ భాషా పుస్తక సంస్థ
సహకారమున ప్రకటితము,

ఉత్తమ కళకు ఉదాత్తమతతత్వం మూల కందం. ఉత్తమ కళాకారుని మతసిద్ధాంతం అతని వైయక్తిక దివ్యానుభూతుల లత. అతని రచనలు తల్లతాంతాలు. అట్టి రచనల వైభవము సమగ్రముగ భోగ్యం కావాలంటే ఆ రచయిత అనుభూతులను, మతవిశ్వాసము లను గ్రహించడం అవశ్యకం.

విశ్వకవి రవీంద్రుని రచనలలోని గంభీర దివ్య మాధురి అందరకు సులభభోగ్యం కాకపోవడానికి బహుశః ఇదేకారణం. ఇది గ్రహించి రవీంద్రుడే జీవనయాత్రాపథంలో తనకు ప్రాప్తించిన దివ్యానుభూతులను, తత్పర్యవసానంగా తనలో రూపొందిన మత తత్వాన్ని కొన్ని వ్యాసాలలో వివరించడం రవీంద్ర రసజ్ఞ జగత్తు అదృష్టం.

రవీంద్ర సారస్వతానంద శిఖరారోహణకు మార్గదర్శిగా ఉపయోగపడగల ఆ వ్యాస సంపుటికి ఇది యథోచితమైన తెనిగింపు.



కల్యాణీ ప్రచురణలు : : వాల్తేరు